వధర్మగ్రంథమాల-౧౦ వ బిల్వము.

# రేణుక విజయము

శిరోమణి:

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రకాశకులు:

శివధర్మగ్రంథమాల

శ్రీ మటికె నాగయ్యధర్మనిలయము,

సికింద్రాబాదు, దక్కన్.



వెల ఒక రూపాయి

( [illegible] )

# ప్ర స క్తి

"శ్రీమచ్ఛివాచారవిచారదీక్షం
స్వశిష్యసత్ప్రీణనపూర్ణపక్షం
దుర్వారకామాదివిదారదక్షం
భజామ్యహం రేవణకల్పవృక్షం."

—శ్రీకరభాష్యే.

శ్రీమద్వేదాగమోపనిషత్పురాణేతిహాసప్రసిద్ధంబగు వీరశైవమతము నీ భూలోకంబున స్థాపించినట్టి జగద్గురు పంచాచార్యులలో నగ్రగణ్యుండును, ఆంధ్రదేశమందలి శ్రీ కుల్యాపాక క్షేత్రంబున నవతరించినవాఁడును, రంభాపురీవీర సింహాసన ప్రవర్తకుండును, బ్రహ్మసూత్రభాష్యకర్తయును, సిద్ధాంత శిఖామణి, శివాధిక్యశిఖామణి, రేవణసిద్ధకల్ప, ప్రశ్న రేణుకాది గ్రంథరాజములకుఁ బ్రవక్తయును, అగస్త్యవిభీషణ చోళ విక్రమార్క శంకరాచార్య కల్లినాథాదుల ననుగ్రహిం చినవాఁడును, గోరక్ష ఖర్పర యక్షమిథునాదుల నిగ్రహించిన వాఁడును, అణిమాద్యష్టసిద్ధిపరిపూర్ణుండును, శివారాధ్యశిఖా మణియును, జంగమచక్రసార్వభౌముండును, లింగిబ్రాహ్మణ కులకమలదివాకరుండును, ప్రాతఃస్మరణీయుండును, పరమపావ నుండును నగు శ్రీ జగద్గురు రేణుకాచార్యభగవత్పాదులవారి చరిత్రమును దెల్పు నీ పురాణ గ్రంథమును బ్రకటించు సదవకాశము లభించినందులకు సంతసము గలుగుచున్నది.

వీరశైవాచార్యులలో రేణుకున కున్న ప్రసిద్ధి మిక్కిలి యెక్కువ. దీనికిఁ గారణ మాతని యద్భుతసామర్థ్యమే! వ్యాసాగస్త్య వసిష్ఠాదిమహాత్ములచరిత్రలు నేఁ డెందఱకుఁ దెలియును? రేణుకుఁడును బ్రాచీనుఁ డగుటచే నాతని కత ప్రాత వడినది. పురాణమైనది. కొందఱ కాతని యలౌకికమహిమము లందు నిర్విశేషభక్తి యున్నను మఱి కొందఱ కావంతయు విశ్వాసము కలుగక పోవచ్చును. వారి వారి దృక్కోణము బట్టి దివ్యపురుషుల జీవితములలోని తత్త్వములు గ్రాహ్యమగుచుండును. జడమతులే తమ యసామర్థ్యము నంగీకరింపరు కదా! నేఁటి పరిశోధకవిద్వాంసు లంతకంటె నధికముగఁ దమ సర్వజ్ఞత్వమును విశ్వసించియే చరిత్రాన్వేషణము కడ్డుదగులు గాథలను, చర్యలను అర్థవాదము లనియో అతిశయోక్తులనియో, అబద్ధములనియో నిర్ణయించుచుందురు. సత్యనిర్ణయమునకు వీరి సాధనములు సంపూర్ణముగ సమర్థములు కాఁజాలవు. కాని ఒక్కొకప్పుడు సామంజస్యమును గూర్చుచుండును. కావుననే పరిశోధనయు ప్రామాణ్యము నధిష్ఠించినది. అట్లని యన్నింటిని శుష్కప్రత్యక్షవాదములతోఁ బరీక్షించినచో నది యాత్మదౌర్బల్యమే కాని దాననా యా మహనీయుల మహత్త్వమునకుఁ గొఱత కలుగదు.

శ్రీమన్మహాచార్యుఁ డగు భగవద్రేణుకుని దివ్యభవ్యలీలావళిని జర్చించువారు స్మృతిపథమున నిడుకొనఁ దగు నంశము కొంత నివేదింపఁబడును. ఇఁక నా మహాత్ముని గూర్చిన ముఖ్యమైన సంగతులను గొన్నింటిని వివరింతును.

శ్రీ రేణుకాచార్యుఁడు వీరశైవులకు మిక్కిలి యభిమానపాత్రుఁడు. కావున శివాగమములు మొదలుకొని యాధునికుల వ్యాసములవఱకుఁ బరశ్శతగ్రంథములలోఁ బ్రస్తుతింపఁబడినాఁడు. అందుఁ గొన్నిమాత్రమే యథామతి యిటఁ బేర్కొనుచున్నాను. ఈ * నక్షత్రచిహ్నములు గల గ్రంథములలోఁ గొన్ని యేరికిని లభింపలేదు. కొన్నింటిని నే నవలోకింపనైతిని. కొన్నింటికిఁ గర్త లెవరో తెలియ దయ్యెను. ఈ గ్రంథము లన్నియుఁ గేవలము రేణుకాచార్యుని చరిత్రను జెప్పునవి కావు. కొన్నింటిని వాని నామముచేతనే యాచార్యునిచరిత్ర లని తెలిసికొనవచ్చును. కొన్నింటిలో రేణుకుని చరిత్ర స్వల్పముగా గ్రథితమైనది. తక్కుంగలవాని యందు రేణుకుని స్తోత్రము మాత్రమే కలదు. ఐనను జిజ్ఞాసువులకును, బరిశోధకులకును బనికివచ్చునేమో యని శ్రీ రేణుకాచార్యుని నామముతోడనో, చరిత్రతోడనో సంబంధము గల సాహిత్యము నిట సూచించుచున్నాను.

# రేణుకుని గూర్చిన వాఙ్మయము

## సంస్కృతమున

| గ్రంథము | కర్త | కాలము, క్రీస్తుశకము |
|---|---|---|
| స్వాయంభువాగమః | (పంచాచార్యోత్పత్తి ప్రకరణం). | |
| సుప్రబోధాగమః | (గురులక్షణ ప్రకరణం) | |
| పాశుపతతంత్రం | (ఉత్తరభాగం) | |
| వీరాగమః | (సాహస్రసంహితా) | |
| వీరలైంగ్యోపనిషత్ | (యజుర్వేదీయా) | |

| | | |
|---|---|---|
| సిద్ధాంతశిఖామణిః | శివయోగిశివాచార్య | 850 |
| రేణుకచంపూః | ఈశానశివగురు * | 950 |
| రేణుకవిజయచంపూః | సిద్ధనాథశివాచార్య | 960 |
| రేవణసిద్ధకల్పం | * | 1000 |
| ప్రశ్న రేణుకం | రుద్రమునీశ్వర | |
| శ్రీకరభాష్యం | శ్రీపతి పండితాచార్య | 1060 |
| శివప్రసంగరత్నాకరః | వృషభలింగశివయోగి | 1090 |
| షడ్దర్శన సముచ్చయ టీకా | గుణరత్న | 1300 |
| నారాయణోపనిషద్భాష్యం | వృషభపండితారాధ్య | 1400 |
| వీరశైవ సదాచారసంగ్రహః | | 1450 |
| కవిరాక్షసీయ టీకా | నాగనార్య | 1550 |
| వేదాంతసార వీరశైవచింతామణిః | నంజణార్య | |
| తంత్రాధికారనిర్ణయః | భట్టోజీదీక్షిత | 1630 |
| చోళరేణుక సంవాదః | సోసలే రేవణారాధ్య | 1660 |
| సిద్ధాంతశిఖామణి టీకా | మరితోంటదార్య | 1660 |
| కవికర్ణరసాయనం | ఎళందూరు షడక్షర కవి | 1665 |
| ధర్మశిరోమణిః | షడక్షరమంత్రి | 1700 |
| వీరశైవాచారకౌస్తుభః | ,, | ,, |
| శివతత్త్వరత్నాకరః | కెళది బసవరాజ | 1710 |
| గురువంశకావ్యం | కాశీ లక్ష్మణశాస్త్రి | 1850 |

## కన్నడమున

| | | |
|---|---|---|
| ఆదెయ్యగళ వచన | ఆదెయ్య | 1080 |
| రేవణసిద్ధరగళె | హరిహర | 1170 |
| సిద్ధరామేశ్వరపురాణ | రాఘవాంక | 1180 |
| బసవపురాణ | భీమకవి | 1360 |
| సౌందరపురాణ | బొమ్మరసు | 1459 |
| సిద్ధేశ్వరవచన | తోంటదసిద్ధలింగయతి | 1470 |
| ప్రభుదేవపురాణ | ఎళందూరు హరీశ్వర | 1480 |

| | | |
|---|---|---|
| రేవణసిద్ధపురాణ | చతుర్ముఖ బొమ్మరసు | 1500 |
| వీరశైవామృతమహాపురాణ | గుబ్బిమల్లణార్య | 1513 |
| రేవణసిద్ధేశ్వరకావ్య | మల్లణ్ణకవి* | 1513 |
| కెళదినృపవిజయ | లింగణ్ణకవి | 1550 |
| సిద్ధాంతశిఖామణిటీకె | ఉజ్జయనీశ | 1550 |
| సంగనబసవన వచన | బసవలింగ* | 1550 |
| చెన్నబసవ పురాణ | విరూపాక్షపండిత | 1584 |
| కాలజ్ఞానదవచన | | 1600 |
| శివాధిక్య పురాణ | బసవలింగకవి | 1611 |
| రాఘవాంక చరితె* | | 1615 |
| నిరంజన వంశరత్నాకర | | 1650 |
| మలెయరాజ చరిత్రె | సెజ్జయ సిద్ధలింగ | 1655 |
| వృషభేంద్రవిజయ | ఎళందూరు షడక్షరకవి | 1655 |
| సిద్ధాంతశిఖామణిటీకె | సోసలె రేవణారాధ్య | 1660 |
| చతురాచార్యపురాణ | సంపాదనెయ పర్వతేశ | 1690 |
| చతురాచార్య ప్రబంధ | తిలకాపుర సోమకవి | 1700 |
| భీమేశాద్రి పురాణ | (రేణుక లీలావిలాస) | |
| హాలుమతపురాణ* | | |
| రేవణసాంగత్య | | |
| రేవణసిద్ధ భక్తిసార | తిప్పశెట్టిమఠద మహాంతస్వామి | 1850 |
| వీరశైవరత్న | పండిత కాశీనాథశాస్త్రి | 1928 |
| పంచాచార్య ప్రభాకర | (ఆగమసంగ్రహ) | 1928 |
| రేణుకవిజయ (గద్య) | పండిత గురుశాంతశాస్త్రి | 1929 |
| పంచాచార్య స్తోత్రరత్నాకర | (సంకలిత) | 1933 |
| రేణుకవిజయ పురాణ | నంజనగూడు శ్రీకంఠశాస్త్రి | 1936 |

[ఇంకను ఛాడదానపుర, లక్ష్మేశ్వర, శిరివాళ, శిలాశాసనములును, హాసన, చిత్రదుర్గ, శివమొగ్గజిల్లాలలోని కొన్ని శాసనములును, పంచాచార్య ప్రభా, శివానుభవ, శరణసాహిత్య, లిం. వి. సాహిత్య సమితి పత్రికలును, ఆధునికుల అనేక గ్రంథములును వ్యాసములును అవలోకనీయములు.]

## ఆంధ్రమున

| | | |
|---|---|---|
| పండితారాధ్య చరిత్ర | పాల్కుటికి సోమనాథుఁడు | 1180 |
| ద్విపదసిద్ధాంతశిఖామణి | చెన్నవెగడ నాగేశ్వరకవి | 1450 |
| కొలనుపాకమాహాత్మ్యము | చిత్తారు గంగాధర కవి | 1600 |
| రేణుకపరిబంధము | సత్యలింగకవి * | |
| ద్వాదశాచార్యవిజయము | ము. వీరభద్రారాధ్య కవి | 1850 |
| శ్రీమద్రేణుకాచార్యవిజయము | నేమాన సూర్యప్రకాశకవి | 1940 |
| శ్రీరేణుకాచార్యచరిత్ర (గద్యము) | బండారు తమ్మయ్య | 1941 |
| రేణుక విజయము | సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి | 1942 |

[విభూతి, శైవప్రచారిణి, శైవరహస్యబోధిని మున్నగు పత్రికలలోని వ్యాసములును; శేషాద్రిరమణకవుల రెండు వ్యాసములును; కొలనుపాక కొడువటూరుశాసనములును అవలోకనీయములు.]

## మరాఠిలో

| | | |
|---|---|---|
| వేదేశ్వరీ (గీతాటీకా) | | 1500 |
| పరమ రహస్య. | మన్మథస్వామి | 1610 |
| గురులీలా సంగ్రహ* | | |
| కాశీపీఠాచే ప్రాచీనత్వ | చి. మ. వీ. | 1935 |
| మధ్యయుగీన చరిత్రకోశ | చి. సిద్ధేశ్వరశాస్త్రి | 1937 |

(వీరశైవ కేసరీ, వీరశైవ గర్జనా మున్నగు పత్రికలు)

## హిందీలో

| | | |
|---|---|---|
| శివాంక | (కల్యాణ పత్రికా) | 1935 |

(తమిళమున నేమేమి గలవో తెలియదు)

## ఇంగ్లీషులో

| | | |
|---|---|---|
| Vaishnavism & Saivism | Bhandarkar | 1923 |
| Religious qest of India | Forquehar | 1926 |
| Mysore Census Report | | 1910 |
| Mysore Archeological Report | | 1926 |

ఇంకను నేను గని వినని గ్రంథములును గొన్ని యత్యావశ్యముగా నుండును. ఇంత విపులమైన సామగ్రి గల ఈ మహాచార్యునిచరిత్రను బుద్ధిసంపన్నులుమాత్రమే చర్చించి యొక గ్రంథరత్నము నావిష్కరింపఁగలరు. ఇది ప్రత్యేకముగ విపుల ప్రయత్నసాధ్యము గావున నిటఁ గల యవకాశమునుబట్టి సంక్షిప్తముగనైనను కొన్ని యంశములు ప్రసక్తములైనవి.

శ్రీ రేణుకాచార్యుని యవతార భూమి "కొలనుపాక క్షేత్ర"మనుట సుప్రసిద్ధము. ఈ విషయము నేకగ్రీవముగఁ బ్రాచీనాధునికపౌరాణికు లెల్లరు నంగీకరించిరి. కొలనుపాక మిక్కిలి పురాతనమైన శివక్షేత్రము. ప్రస్తుత మిది నిజాం రాజ్యములోని నల్లగొండజిల్లా భువనగిరితాలూకాలో (ఆలేరు స్టేషన్, యన్. యస్. రైల్వే) గలదు. అచ్చోట నష్టాదశవర్ణములకు సూత్రప్రాయముగ గురుత్వమును నిర్వహించుచు నష్టాదశమతస్థులగు వీరమాహేశ్వరులు నేఁడును జీవితులై యున్నారు. రేణుకునినాఁటి జగద్గురుత్వవైభవ మీషణ్మాత్రముగనైనను నేఁటి కొలనుపాకచరిత్రలో సూచితము కాఁగలదు. కొలనుపాకలోని యక్షరాస్యుల కెల్లరకుఁ గొంతవఱకైనను రేణుకాచార్యుఁడు తమ క్షేత్రమున ము న్నవతరించెనని తెలియును. ఇట నొక్క యలౌకికవిషయము కలదు. రేణుకుఁడు సామాన్యమానవులవలెఁగాక శివలింగగర్భమునుండి యుద్భవిల్లినాఁ డని యాగమాదులలోఁ జెప్పఁబడినది.

"తథా రేవణసిద్ధస్య కుల్యాపాకపురోత్తమే,
సోమేశలింగా జ్జనన మావాసః కదలీపురే". ౨౮
(స్వాయంభువాగమము)

"అథ త్రిలింగవిషయే కుల్యపాకాభిధే పురే
సోమేశ్వరమహాలింగాత్ ప్రాదురాసీత్ స రేణుకః" ౮-౧
(సిద్ధాంతశిఖామణి)

శిలలోనుండి మానవు లుద్భవింతురా యను నాక్షేపము రావచ్చును. ఇక్కడ శిలయు లేదు; మానవుఁడును రాలేదు. శివలింగమునందు శిలాబుద్ధి పామరునకుఁ దక్క పండితునకుఁ బొడమదు. మార్కండేయుని రక్షణార్థము లింగగర్భావిర్భూతుఁడగు మహేశ్వరుఁడు కాని, ప్రహ్లాదునికొఱకు స్తంభమునుండి బయలుదేరిన నరసింహుఁడు కాని ప్రత్యక్షప్రమాణవాదులకు మిథ్యయే! వీరశైవుఁడుమాత్రము "లింగం సాక్షా న్మహేశ్వరః" అను శివాగమసూక్తి ననుసరించి లింగాంగసామరస్య చిన్మయమూర్తులలో నిట్టి లింగజన్మమును దుర్ఘటకృత్యముగాఁ దలంపఁడు. రేణుకునిగూర్చి పరమేశ్వరుఁడే "నీవు మానవజన్మయాయని పరితపింపవలదు. నీకు మానుషశరీరబాధ లంటవు. నేనే అయియున్న సోమేశ్వరలింగమునుండి ప్రాదుర్భవించి వేద వేదాంతసమ్మతమైన నా పరమైన అద్వైతమును భూలోకమున నీవు స్థాపింపఁగల''వని శివుఁడే యాజ్ఞాపించుచున్నాఁడు.

"సోమేశ్వరాభిధానస్య తత్ర వాసవతో మమ
అస్పృశన్మానుషం భావం లింగాత్త్వాప్రాదుర్భవిష్యసి. ౮-౧
మదద్వైతపరం శాస్త్రం వేదవేదాంతసమ్మతం
స్థాపయిష్యసి భూలోకే సర్వేషాం హితకారకం. ౨౦
—(సిద్ధాంత శిఖామణి-పరి. ౮)

దీనివలన శ్రీ రేణుకాచార్యులు అస్మదాదులవలె రక్త

మాంసమయశరీరులు కారనియును "మానుషభావము తవులని" దివ్యచిన్మయ తేజశ్శరీరు లనియును, విజ్ఞానులు గ్రహింపక పోరు. సామాన్యముగ శిలాభావము గలవారును ఆలోచింపఁ దగిన విషయములును లేకపోలేదు.

శివయోగశాస్త్రాభ్యాసమువలన నణిమాద్యష్టసిద్ధులు స్వాధీన మగు ననుట గొప్ప క్రొత్త కాదు. యోగులు అణు మహిమ శరీరములతో పరకాయములను, వజ్రాదులను ప్రవే శింపఁగలరు. శిలలోఁ జేరుట లెక్కయా! యోగశాస్త్ర ప్రవక్త యగు మహర్షి పతంజలి "తతోఽణిమాదివత్ ప్రాదుర్భావః, కాయసంపత్, తద్ధర్మానభిఘాతశ్చ" యని కదా స్పష్టముగా నణిమాది సిద్ధిని తెలిపియున్నాఁడు! మహా రాజు భోజదేవుఁ డీ యోగసూత్రములకు "మణిప్రభ" యను పేరుతో సంస్కృతమున వృత్తిని విరచించినాఁడు. ఆతఁడును నీ ప్రసంగమున "యథా పరమాణుత్వం ప్రాప్తో వజ్రాదీనా మప్యంతః ప్రవిశతి"(పరమాణుత్వమును బొందినవాఁడు వజ్రాదు లందును బ్రవేశించును) అని విపులీకరించినాఁడు. ఇంతకంటెను బరమాప్తులు మన కెవరు గలరు? మన పూర్వపురుషులు మొన్నటివఱకును నిట్టి యపూర్వమహిమలు గలిగియుండిరి. నేఁడును గ్వాచిత్కముగ యోగసిద్ధులు కలరు. అవి యఘ టనాఘటనము లైనంత మాత్రానఁ దోసిరా జనఁ దగదు. యోగశాస్త్ర మొకరికిఁ బ్రమాణము గాక పోవచ్చును. మఱి యొకరికి జ్యోతిషమును, ఇంకొకరికి వేదాంతమును, వేఱొకరికి వ్యాకరణశాస్త్రమును గిట్టవు. మా యూర నొకఁడు సంగీత

మునకుఁ గూడ శతు్రివే! భారతీయుల పరమరహస్యములైన యోగాదిశాస్త్రముల నుదాసీనించుటవలననే పామరులవలె మహాపురుషుల దివ్యచరిత్రను దెలియక కొందఱు పూర్వపక్షము నవలంబించినారు. తెలిసిన దని వా్రియుట కాదు. మహనీయుల మహత్త్వము నా బోంట్లు తెలియఁగలరా? "లోకోత్తరాణాం చరితం, కోహి విజ్ఞాతు మర్హతి?"

చతుర్యుగములలోను రేణుకాది పంచాచార్యులే భిన్న భిన్ననామములతో నవతరించి వీరశైవమతము నీ భూలోకమున స్థాపించి రని శివాగమముల ననుసరించి తన్మతీయులు దృఢముగ విశ్వసించుచు సమస్తశుభకర్మలందును బంచకలశముల స్థాపించి, పంచాచార్యుల నాహ్వానించి పూజించుట శాస్త్రరూఢమై యాబాలగోపాలము సుపరిచితము. శివాద్వైతమును స్థాపించుటయు శ్రీ రేణుకుని యవతారకర్తవ్యములలో నొకటి యని మీఁద నుదాహృతమైన శ్లోకమునఁ గంఠోక్తిగఁ జెప్పఁబడినది. వీరశైవధర్మరాజ్యమును దుష్టశిక్షణ శిష్టపరిపాలన పురస్సరముగఁ బరిపాలించుట కేతెంచిన జగద్గురు పట్టాభిషిక్తుఁ డీ రేణుకుఁ డని "వీరసిద్ధాంతనిర్వాహకృతపట్టనిబంధనం" (సిద్ధా. శిఖా. ౮-ు) అను ప్రమాణ ముద్ఘోషించుచున్నది.

క్రీ. శ. 1060 ల నాఁటి వాఁడగు శ్రీపతి పండితుఁడు తన శ్రీకరభాష్యమున ననేకపర్యాయములును, క్రీ. శ. 980 ల ప్రాంతముననున్న శ్రీకంఠశివాచార్యుఁడు తన బ్రహ్మసూత్రభాష్యమున (౮-౮ అవిభాగేన) నొకమారును సిద్ధాంతశిఖా

మణినుండి ప్రమాణము లుద్ధరించిరి. కావున, దొమ్మిదవ శతాబ్దము నాటికే ఈ గ్రంథము ప్రసిద్ధి గనియున్న దని తెలియుచున్నది.

పూర్వ మీశానశివగురుఁడు సంస్కృతమున విరచించిన రేణుకచంపూప్రబంధము ననుసరించి కన్నడమున రేవణసిద్ధ పురాణమును రచించితి నని తత్కర్తయగు బొమ్మరసు కవియే గ్రంథాదిని విస్పష్టపరచినాఁడు. ఈశానశివాచార్యుఁడు దక్షిణ దేశమున నొకప్పుడు ప్రఖ్యాతుఁడు; ఈశానశివగురుపద్ధతి మున్నగు గ్రంథములకుఁ గర్త. ఈతఁడు 11వ శతాబ్దమున నుండవచ్చునని సామాన్యముగ విద్వాంసులు భావించుచుండిరి. కాని కడపజిల్లా సిద్ధవటము తాలూక దొంగలసాని గ్రామ శివాలయమందలి శిలాశాసనమువలన ఈశానశివుఁడు పదవ శతాబ్దమున (950) నుండె నని నిశ్చిత మగుచున్నది.[1] రేణుకుఁడు తనకంటెఁ బూర్వుఁడును మహానుభావుఁడును అయియుండుటవలననే కదా, ఆతని దివ్యచరిత్రను ఈశానశివుఁడు తన భవ్యమైన చంపూగ్రంథమున గ్రథించెను?

మఱియొక రేణుకవిజయకావ్యకర్త సిద్ధనాథుఁడు. సిద్ధాంతశిఖామణికిఁ గర్త శివయోగి శివాచార్యుఁడు. వీ రిరువురును పితాపుత్త్రులవలెఁ దోఁచుచున్నారనియును, తండ్రి

(1) మద్రాసు ఓరియంటల్ లైబ్రరిలోని Col. K. Mackenzi's Report (15-4-28 P. 159) ను; వావిళ్ళవారి (త్రిలింగ రజతోత్సవ) సమ్మానసంపుటము (పు. ౩౬౨) ను చూడుడు. శాసనమందలి ౨౦-33వ పంక్తులలో "శ్రీ పర్వతంబునంగల......వార ఈశానశివులు"

రేణుకవిజయమును విరచింపఁగాఁ గొడుకు రేణుకోపదేశరూపమగు సిద్ధాంతశిఖామణిని గ్రంథించె ననియును శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రసంగానుసార మూహించి యున్నారు.[2] తాను సిదనాథునిపుత్త్రుఁడ నని శివయోగి సిద్ధాంతశిఖామణి (ప౧ శ్లో ౮.) లోఁ జెప్పియుండుటయే ఈ యూహకుఁ గారణము. సిద్ధనాథుఁడు విక్రమశకము ౧౦౧౭ వత్సరమున (క్రీ. శ. 960) రేణుకవిజయమును రచించినట్లు అందలి యంతిమశ్లోకమునఁ గలదు.[3] సిద్ధనాథుడు తండ్రి యనుకొనినచోఁ బూర్వనిర్ణీతమైన సిద్ధాంతశిఖామణి కాలమునకు సరిపడదు. సిద్ధనాథుఁడు విక్రమశకమును బేర్కొనినందునను ఆతఁడు ఆంధ్రుఁడు కాఁడని తోఁచుచున్నది. సిద్ధాంతశిఖామణి శైలియన్ననో ఆంధ్రకవితాసంప్రదాయానుసారముగ ననేక స్థలములలో యతిమైత్రి గలిగి తత్కర్తయగు శివయోగిని ఆంధ్రక్షేత్రమగు కొలనుపాకలో నున్నవానినిగా నిరూపించుచున్నది. శివయోగి పేర్కొనిన సిద్ధనాథునికంటె రేణుకవిజయకర్త భిన్నుఁడు కావచ్చును. కావున నిరువురు పితాపుత్త్రులనుటకు నింక నెక్కువగాఁ బరిశీలనావసరము కలదు.

ఈ చర్చవలన సిద్ధాంతశిఖామణిలోఁ బ్రతిపాదితమైన వీరశైవమతమును, రేణుకాద్యాచార్యులును తొమ్మిదవశతాబ్ది

2. విభూతి సం. ౨-౨ "ఆచార్యపండితుఁడు" వ్యాసమున.

3. 1925 లో పం. హరీశ్వరశాస్త్రిగారు ప్రకటించిన "రేణుకవిజయచంపూః" చూడుఁడు. దీని సంస్కృత భాషాశైలి మిక్కిలి మనోహరముగ లలితముగ యమకానుప్రాసములతో నలరారుచున్నది

కంటెఁ బ్రాచీను లని ప్రత్యేకముగ వ్రాయఁబనిలేదు. శివాగమములందును, ఉపనిషత్తులలోను స్పష్టముగఁ జెప్పఁబడి పరస్సహస్రములగు సంస్కృతకర్ణాటకాంధ్ర మహారాష్ట్ర భాషాగ్రంథములతోఁ బ్రత్యేకమైన వాఙ్మయచారిత్రక సామగ్రి గల వీరశైవమతమును గూర్చి 12వ శతాబ్దమునఁ బుట్టినదనియును, ఆధునికు లెవరో మొన్న స్థాపించి రనియును వాఙ్మయము దెలియని కొందఱు వ్రాయుటయుఁ గొందరు నమ్ముటయుఁ దటస్థించుచున్నది.[4]

సిద్ధాంతశిఖామణి యను గ్రంథము వీరశైవుల నిత్యపారాయణవ్యవహారములో నున్నది. ప్రసన్నమైన భాషాశైలి గలదై వాల్మీకికవిత్వమును స్మరణకుఁ దెచ్చుచుండును. వీర

---

4. ఆంధ్రపత్రికవారి బసవపురాణపీఠికలోఁ (పు. ౮౯) బరిష్కర్తలు వీరాగమమునుండి 'రేవణో మరుసిద్ధేశః' యను శ్లోకము నుదాహరించుచు, "ఈ యాగమమున వీరశైవ సంప్రదాయము లెల్ల వివరింపఁబడినవి. ఇది పురాతనగ్రంథ మనుట నే నంగీకరింపఁజాల నయ్యెదను. మఱియు రేణుక(రేవణ) సిద్ధవిరచితము సిద్ధాంతశిఖామణియు...... నీలకంఠాచార్యుని క్రియాసారమును గలవు. వీరశైవసిద్ధాంతమును నిరూపించు గ్రంథములలో మూలభూతము లివి" అని వ్రాసినారు. ఇది ప్రామాదికము. వీరాగమము పురాతనము గాదనుటకు యుక్తి యేమియు వారు చూపలేదు. పరమతీయగ్రంథములను ప్రాచీనము గావనుటయు సంప్రదాయ మేమో! శివాగమములే వీరశైవమునకు మూలములు. సిద్ధాంతశిఖామణ్యాదులు ఆచార్యోపదిష్టము లగుటవలన మహత్త్వము గలిగినది. భగవద్గీతకుఁ బ్రతిష్ఠ గల్గినంత మాత్రమున నుపనిషత్తులు వేదాంతమునకు మూలము కావనఁ జనునా? వీరశైవవాఙ్మయము నరయక తొందరపాటుతో వ్రాసిన యంశములు బసవపురాణపీఠికలోఁ బెక్కు గలవు.

శైవమతతత్త్వములు షట్స్థలాష్టావరణములు సూక్ష్మముగ నైనను సూటిగా వివరింపఁబడినవి. శ్రీ మద్రేణుకాచార్యులు అగస్త్యమహర్షికి దీనిని బోధించినట్లు ఆగ్రంథమునఁ జెప్పఁబడినది. శివయోగి శివాచార్యుఁడను నొక ప్రాచీనవీరశైవపండితుఁడు దీనిని గ్రంథరూపముగాను గూర్చెను. వామ దక్షిణ మిశ్రసిద్ధాంతములని శైవము నాలుగువిధములు. అందు సిద్ధాంతశైవమే వీరశైవము. పూర్వకాలమున శివుఁడు పార్వతికిని, స్కందునకును బోధించిన యష్టావింశత్యాగమములలో సిద్ధాంతభాగమును గలదు. కైలాసమందలి రేణుకదారుక ఘంటాకర్ణాది ప్రమథులకును నీ యాగమము లుపదిష్టములై మరల భూలోకమున నగస్త్యాదులకును బోధితములు. అట్లని కేవలము వినికిడిని బట్టి ఈగ్రంథమును శివయోగి వ్రాసె నను కొనఁగూడదు. దీనికి మూలభూతములగు సమస్తశివాగమములను, తంత్రములను, పురాణములను కూలంకషముగఁ బరిశీలించి; వేదమార్గమునకు విరోధము గల్గనట్లుగా వీరశైవసర్వస్వముగు నీ సిద్ధాంతశిఖామణిని[5] శివయోగి యావిష్కరించినాఁడు.

ఆలోక్య శైవతంత్రాణి, కామికాద్యాని సాదరం
వాతులాంతాని శైవాని, పురాణాన్యఖిలాని తు. ౨౯

వేదమార్గావిరోధేన విశిష్టాచారసిద్ధయే
సర్వస్వం వీరశైవానాం సకలార్థప్రకాశకం. ౩౦

---

5. ఈ సిద్ధాంతశిఖామణిని చెన్నవెగడ నాగేశ్వరకవి చక్కని ద్విపదగ్రంథముగా 15-వ శతాబ్దమున నాంధ్రీకరించినాఁడు. మున్ముందు మా గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడును.

తత్సంప్రదాయసిద్ధేన రేణుకేన మహాత్మనా
గణేశ్వరేణ కథిత మగస్త్యాయ పునః క్షితౌ. —౨౯

వీరశైవ మహాతంత్రం, మేకోత్తరశతస్థలం,
అనుగ్రహాయ లోకానా మభ్యదా త్సుధియాంవరః.౩౦
(సి. శి. ప. ౧)

అగస్త్యుఁ డెక్కడ! రేణుకుఁ డెక్కడ? యను ప్రశ్న యును సహజమే. శివాగమములలోను శివరహస్యాదులలోను గొన్నిచోట్ల 'రేణుక ఉవాచ' 'అగస్త్య ఉవాచ' యని స్పష్టముగా నుండుటవలన నీ రేణుకాగస్త్యసంబంధము పరంపరాప్రసిద్ధమే! సిద్ధాంతశిఖామణికారుఁడు కల్పించినది మాత్రము కాదు. ఆగమశాస్త్రానుసారము రేణుకుఁడును యుగభేదమును, శివాజ్ఞను అనుసరించి పలుమారులు భూలోకమున నవతరించినట్లు స్పష్టము. మఱియు మహాదివ్యశక్తి సంపన్నుఁ డగుటయు సువిదితము. కావున బ్రాచీనాగస్త్యునకును బ్రాచీన రేణుకునకును సమకాలికత్వము యుక్తిసహమైనది. ఆధునిక పరిశోధకులు కొంద ఱగస్త్యుఁడు 7, 8 శతాబ్దములలో నున్నాడని తెల్పుచున్నారు[6] గదా! దీనికి సమాధానమేమని మఱియొక ప్రశ్న పుట్టుచున్నది.

6. 'Rupam' 1925 Calcutta (O. C. Ganguly) అను సచిత్ర పత్రికలో నగస్త్యుని యనేక విగ్రహములను బ్రకటించుచు నగస్త్యుఁడు 7, 8 శతాబ్దములలో దక్షిణ భారతదేశమున నున్నట్లును, ఆతనికి శివగురువను మారుపే రున్నట్లును చెప్పఁబడినది.

2

కలియుగాదినుండి వీరశైవ మున్నను మధ్యకాలమున శిథిలావస్థ నందుచున్నందునఁ దదుద్ధరణార్థమై శివాజ్ఞ ననుసరించి రేణుకుఁడు మరల రెండవ పర్యాయము కొలనుపాకలో నవతరించెనని రేణుకచరిత్రలన్నియును, సిద్ధాంతశిఖామణియు నేకగ్రీవముగా నుడువుచున్నవి. అపు డీ ద్వితీయావతార కాలము 7, 8 శతాబ్దములని సులభముగనే గ్రహింపవచ్చును. ఈ రేణుకాగస్త్య సంబంధము వీరశైవులలో మాత్రమే జన జనితముగా నున్న దనుకొనవలదు.

శ్రీ భట్టోజిదీక్షితుఁడు సుప్రసిద్ధవైయాకరణుఁడు, కాశీవాసి; వీరి సిద్ధాంతకౌముది విశ్వవిఖ్యాత మైనది. కాశిలో నొకప్పుడు ఆగమతంత్రశాస్త్రములనుగూర్చి శైవులకును స్మార్తులకును వివాద మేర్పడగా, దీక్షితుఁడు "తంత్రాధికార నిర్ణయః" అను గ్రంథమును నిర్మించినాఁడు.[7] అందు:—

"తేన 'అతప్తతనూరజ్ఞ' ఇత్యాదినా 'దీక్షయా రహితః సాక్షాన్నాప్నుయాల్లింగ ముత్తమ' మిత్యంతేన అగస్త్యంప్రతి రేణుకేన పవిత్రశ్రుతేర్లింగధారణపరయా వ్యాఖ్యానాత్".

అను పంక్తి విస్పష్టముగా నుల్లేఖింపఁబడియుండుటవలన సిద్ధాంతశిఖామణియు రేణుకాగస్త్య సంబంధమును భట్టోజి దీక్షితునకు సుపరిచితమై యుండెనని తేలుచున్నది. ఈ సంబంధమునకు మఱియొక ప్రబలకారణమును గలదు. వీరశైవుల

7. ఈ గ్రంథమును ౨౩ వత్సరములకుఁ బూర్వము (విక్రమ శ. ౧౯౭౮) ద్రావిడ వీరేశ్వరశాస్త్రిగారు, కాశీ రాజేశ్వరీ ముద్రాశాలలో ముద్రించి ప్రకటించినారు. —(౨౭ పుట చూడుఁడు.)

శివదీక్షాసంస్కారమునఁ బంచకలశస్థాపన జేయవలసియుండును. అట రేణుకాచార్యుని పూర్వ (సద్యోజాత) కలశమును స్థాపించి యర్చించుటకై ఋత్విక్కులు గావలసియుందురు. ఈ పరంపరలో "శేవణ, రుద్రి, నీలముని, ఘంటాసిద్ధ, సారంగ, వృద్ధాగస్త్య"ల యొక్క వంశజులు మాత్రమే అర్హులు. సుప్రసిద్ధమైన శివతత్త్వరత్నాకరమున[8] (కల్లోల ౯, తరంగ ౭) ఈ యైతిహ్యము నిబద్ధమైయున్నది. అగస్త్యుఁడు వీరశైవుఁడా? లేక లింగధారణ సిద్ధాంతాభిమానుఁడు మాత్రమేనా యను నంశములు విద్వత్పరిశీలనార్హములు గదా! క్రీ॥ శ॥ 1060 ప్రాంతముననున్న ఆంధ్రుఁడైన శ్రీపతిపండితుఁడు తన శ్రీకర భాష్యమునకు నగస్త్యుని సూత్రవృత్తి యాధార మని ఈ క్రింది శ్లోకమునఁ జెప్పుచున్నాఁడు.

> అగస్త్యమునిచంద్రేణ, కృతాం వైయాసికీం శుభాం
> సూత్రవృత్తిం సమాలోక్య, కృతం భాష్యం శివంకరం.
> శ్రీకరభాష్యే. 9

రేణుకాచార్యుని యుపదేశానంతరమే యగస్త్యుఁడు బ్రహ్మసూత్రవృత్తిని విరచించియుండుననియును, అందలి లింగధారణాదివీరశైవసిద్ధాంతమునే శ్రీపతి తన భాష్యమున

---

8. దీనిని నాగరాక్షరములతో 'B. M. Nath & Co., Vepery, Madras' వారు ముద్రించినారు. వెల 20-0-0.

9. దీని ప్రథమభాగమును ఆంధ్రనాగర లిపులలో మా గ్రంథమాల ప్రకటించినది.

వి స్తరించియుండుననియును భావించుట సమంజసము.[10] ఇట్లు రేణుకాగస్త్యుల సంబంధము లోకశాస్త్రోభయప్రసిద్ధ మని పర్యవసితము.

రేణుకుఁడు లంక కేతెంచి విభీషణుని ప్రార్థనానుసారము శివలింగప్రతిష్ఠ గావించిన గాథయు రేణుకచరిత్రలోఁ గలదు. విభీషణుని సమకాలమున నున్న రేణుకుని మరొక యవతార ముతోఁ గాలచర్చకు సమాధానము నీయవచ్చును గాని వీర శైవాచార్యుఁడైన రేణుకుఁడు స్థావరలింగప్రతిష్ఠావిధి నెర వేర్చునా? యని ప్రశ్న రాకపోదు. తాము కంఠమున ధరించిన ఇష్టలింగపూజ దప్ప నితర దేవతారాధనము కూడదని వీరశైవ శాస్త్రప్రసిద్ధి కలదు. ఐతే దీనియర్థ మిట్లు తెలిసికొనవలెను. లింగధారణాధికారము లేని వారి నుద్ధరించుటకై వారిని శివ భక్తితత్పరులఁ గావించి లింగపూజాధికారము నైనను గల్గిం చుట వీరశైవకృత్యమే! లింగధారుల "శరణుఁడు సతి, లింగము పతి" అను న్యాయమునకు వివరణ మిది. పతివ్రతకుఁ దనపతితోఁ దప్ప నితరులతో దర్శనస్పర్శాదులు నిషిద్ధములు. ఇట్లని తల్లి దండ్రులతో బంధువులతో అతిథులతో దూరముగ నుండుమని కాదు తాత్పర్యము. తత్తదుచితపరిచర్యలు సేయుట విధియే. కాని అంగ సామరస్యమున మాత్రము పతికిఁ దక్క నన్యుల కధికారము లేదు. ఇటులే లింగపూజాపరాయణులు ముక్త్య

10. 'విభూతి' 3–౮ లోని 'నీలకంఠ శ్రీకంఠభాష్యములు – శ్రీకర భాష్య ప్రతిష్ఠ' అను వ్యాసమును, ౪–3 లోని 'బ్రహ్మసూత్రభాష్యములు' అను వ్యాసమును అవలోకనీయములు.

ర్థమై ఇష్టలింగసామరస్యము గలవారై నను శివలింగప్రతిష్ఠ శివాలయోద్ధారములను ఆత్మార్థముగాక పరార్థమునకై కావింపవచ్చును. అటులే శివపరివారు లగు నంది భృంగి వీరభద్రాదులను, శివభక్తులగు ఇంద్రోపేంద్రాదులను జ్యోతిర్లింగములను ఉచితావసరములందుఁ బూజింపవచ్చును, నుతింపవచ్చును. దాన శివోత్కర్ష యే యగును. లింగముద్రాంకితస్థలమునుగూడ రక్షించుట వీరశైవునకు విధి. లంకలో నెంత కాలమునుండియో పూజారహితములై యున్న శివలింగములకుఁ బ్రతిష్ఠ గల్పించిన యాచార్యుని కృత్య మమోఘము. కావున నే వీరశైవకావ్యాదులలో వీరనంద్యాదిస్తోత్రములును ఆచార్యులు శివక్షేత్రముల దర్శించినట్లును, స్థావరలింగములం దైక్యమైనట్లును గాంచనగును.

రేణుకుని చరిత్రలో శ్రీ శంకరాచార్యుని గూర్చిన ఘట్టమును నొకటి కలదు. ఒకరు శైవు లగుటయు వేరొకరు స్మార్తులగుటయు నిందుకుఁ బ్రతిబంధకములు. ఒకరు కేవల జ్ఞానవాదులు, వేరొకరు జ్ఞానకర్మసముచ్చయవాదులు. శంకరు నంతటి వాఁడు రేణుకునుండి శివలింగమును బడసి యుపాసనా కర్మకాండవాదము నంగీకరించెనా యనునదియే యిటఁ బ్రధానము. అంత్యమున జ్ఞానమువలననే ముక్తియనియును, జ్ఞానము స్వయంప్రకాశమనియును సులభముగఁ జెప్పవచ్చును కాని యా జ్ఞాన మెవ్వరికిని లోకమున సులభముగఁ గల్గినట్లు గానము. కావుననే బ్రహ్మసూత్రభాష్యరచనానంతరము శంకరాచార్యునకు నవశ్యముగా సర్వాధికారిసులభమైన యుపాసనను గూర్చి జిజ్ఞాస గల్గియుండును.

తదపనోదనార్థమై శ్రీశైలమునఁ దప మాచరించుచుండ శివుఁడు ప్రత్యక్షుఁడై "రేణుకాచార్యునివలన ఇష్టార్థము నెర వేరఁగల"దని వర మిచ్చెను. తదనుసారము శంకరాచార్యులు మలయాచలమున సంచరింపఁగా శ్రీ రేణుకాచార్యుని యాశ్రమ దర్శనము కలిగెను. బ్రహ్మ తేజోవిరాజితుండును స్వయం సిద్ధుండును నగు శ్రీ రేణుకాచార్యులఁ గాంచి—

"భద్రాంకురాయ భజతా మభయంకరాయ
మోహాంధకారరవయే కవయే మనూనాం
కైవల్యకల్పతరవే గురవే గురూణాం
శ్రీ రేణుకాయ గణపాయ నమోఽస్తు తుభ్యం."

(రేణుకవిజయే, 3-౧౫.)

ఇటులు శంకరాచార్యులు వినుతించి యెక్కువగ సంభా షించి జ్ఞానకర్మసిద్ధాంతములనుగూర్చి తత్త్వము ప్రత్యక్షమైన పిదప "చంద్రమౌళీశ్వరలింగము ని'మ్మని ప్రార్థించెను. (తథా యయాచే ముదితాంతరాత్మా, శ్రీ చంద్రమౌళీశ్వరనామ లింగం 3-౭౨) రేణుకుఁడును, సుపాత్రము నరసి, సాత్త్విక కర్మస్వరూపమును, భక్త్యుపాసనాతాదాత్మ్యమును, జ్ఞాన సవిషయకత్వమును నిరూపించి—

"అంధపంగువదన్యోన్యే సాపేక్షే జ్ఞానకర్మణీ
జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః."

(సిద్ధాంతశిఖామణౌ)

అను స్వసిద్ధాంతప్రకారము జ్ఞానకర్మసముచ్చయతత్త్వ మును బోధించి యత్యంతమగు ప్రేమతోఁ జంద్రమౌళీశ్వర

లింగము ననుగ్రహించెను. శంకరాచార్యులు చారిత్రకపురుషులు కావున కేవల రేణుకవిజయగ్రంథము ననుసరించియే యిట్లు స్థిరపరచుట సరికానేరదు. అది ప్రమాణాంతరములచే నుపబృంహణము కావలసియుండును. పరీక్షించిచూతము. నంజణాచార్యవిరచితమగు "వేదాంతసార వీరశైవచింతామణి"యను గ్రంథముననను శంకరాచార్యులకు రేణుకాచార్యులు లింగము ననుగ్రహించిన విషయము స్పష్టముగాఁ గలదు.

"శంకరాచార్యసన్నామ - యోగీంద్రాయ మహోజ్జ్వలం,
చంద్రమౌళీశ్వరం లింగం దత్తవానితి విశ్రుతం.
శ్రీ రేణుకగణేశాఖ్యం రేవణం సిద్ధదేశికం,
వీరశైవమతాచార్యం వందేహం తం జగద్గురుం."

కాని మరొక సందేహమున కవకాశ మిటఁ గలదు. శంకరాచార్యనామము గల వ్యక్తు లెందరో ప్రాచీనకాలమున నుండిరికదా! ఆదిశంకరులే ననుటకుఁ బ్రమాణ మేమి? యని ప్రశ్నింపవచ్చును. సమాధాన మీ క్రింద వివరింపఁబడుచున్నది. శృంగేరిపీఠాస్థానవిద్వాంసులు పండిత లక్ష్మణశాస్త్రిగారిచే విరచితమగు "గురువంశకావ్యము"ను శ్రీరంగము వాణీవిలాస గ్రంథమాలవారు తమ ౧౦ వ పుష్పముగాఁ బ్రకటించినారు. దాని తృతీయసర్గలో శంకరాచార్యులు స్వశిష్యుఁడగు విశ్వరూపాచార్యునకు రేవణసిద్ధునివలన లభించిన చంద్రమౌళీశ్వర లింగమును, రత్నగర్భగణనాథమూర్తిని ఇచ్చి వీనిని జిరకాల మర్చించుమని యాజ్ఞాపించినట్లు గానసగును.

"శ్రీచంద్రిమౌళీశ్వర లింగ మస్మై
సద్రిత్నగర్భం గణనాయకం చ
స విశ్వరూపాయ సుసిద్ధద త్తం
దత్త్వా న్యగాదీ చ్చిర మర్చయేతి" 33

ఇట మూలమున "సుసిద్ధద త్తం" అను శబ్దము కలదు కాని రేవణసిద్ధశబ్దము లేదని మఱియొక ప్రశ్న రావచ్చును. గురువంశకావ్యమునకు స్వయముగ గ్రంథకర్తగారే సంస్కృత వ్యాఖ్యానము రచించియున్నారు. అందు "సుసిద్ధేన రేవణసిద్ధ మహాయోగినా ద త్తం" అని సుస్పష్టముగ నుండుటచేత నీ సంశయమునకును జోటు లేదు. లక్ష్మణశాస్త్రిగారైనను ఈ గురువంశకావ్యమును స్వకపోలకల్పితముగ రచించినదికాదు. పితామహసంహిత, శంకరవిజయములలోని ప్రాచీనైతిహ్యమును బట్టియే సంగ్రహించిరి. పైగా వారు శృంగేరి యాస్థానపండితులు కావున "ప్రాచా మసమ్మతం నైవ లిఖ్యతేஉత్ర నచాధిక"మ్మను వారి ప్రతిజ్ఞను విశ్వసింపవలసియున్నది. మైసూరు మహారాజాస్థాన ధర్మాధికారపండితు లగు విద్యావిశారద శ్రీ కుణిగల్ రామశాస్త్రిగారిచే పరిశోధింపఁబడి గురువంశకావ్యము ముద్రింపఁబడినది. కావున నింకను దీని ప్రాశస్త్యము ద్విగుణిత మగుచున్నది. "శివతత్త్వరత్నాకర" మను పూర్వోక్త గ్రంథమునను (౧౦౫ పుటలో) ఈ విషయము ఇంచుక విస్తారముగా వచ్చినది. అం దిట్లు కలదు.

"తతః స రేవణాసిద్ధసంప్రదాయప్రవర్తినాం
శంకరాచార్యవర్యాణాం పారంపర్యక్రిమాగతం

సన్న్యాసినముపాశ్రిత్య వినయావనతోఽధికం
వృత్తాంత మఖిలం తస్మై యతయే స్వం వ్యజిజ్ఞపత్.
శేవణాసిద్ధసంప్రాప్తం చంద్రమౌళీశమ ప్యదాత్
అభ్యర్చ్యానేన లింగేన తవాభీష్టాప్తి రిత్యపి."

ఈ మహాగ్రంథము మద్రాసులో గొప్ప విద్వాంసుల తత్త్వావధానమున ముద్రింపఁబడినది. వారిలో నాంధ్రులకు సుపరిచితు లగు శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ. గారును నొకరు. మద్రాసు ప్రభుత్వమువారి పురాతత్త్వశాఖాధ్యక్షులును సుప్రసిద్ధపరిశోధకులును నగు రావుబహద్దుర్, హెచ్. కృష్ణశాస్త్రి, బి. ఎ. గారీ శివతత్త్వరత్నాకరమునకుఁ బీఠికను వ్రాసినారు. అం దొకచోట—

"One very interesting point, which must be particularly drawn attention to in the story of Vidyaranya as given in the 12th Taranga of the 4th Kallola, is 'the శేవణసిద్ధ సంప్రదాయ which the ఆచార్యాs of the శంకరాచార్య line that initiated our విద్యారణ్య were then practising at శృంగేరీ. The లింగ of చంద్రమౌళీశ్వర which is still worshipped as the chief deity by the ఆచార్యాs of శృంగేరిమఠ is also said to have been presented to విద్యారణ్య by this direct Guru. శేవణసిద్ధ we know is a well-known Saiva teacher whom the Lingayats still claim as one of their earliest ఆచార్యాs. The Keladi chiefs, who were mostly followers of the Lingayat creed, were devoted adherents of the

శృంగేరి-శంకరాచార్యమఠ. Perhaps also for this same reason viz, that the శంకరాచార్యs were followers of the రేవణసిద్ధ సంప్రదాయ. This explains perhaps why in the అద్వైతమఠ of శృంగేరి there is still a greater bias towards Saivism and Saiva worship, than towards Vaishnavism and Krishna worship, though the founder the great శంకరాచార్య, was no respector of creeds nor of any distinction between శివ and విష్ణు''

(శివతత్త్వరత్నాకరము నాల్గవ కల్లోలము ౧౨ వ తరంగమందలి విద్యారణ్యచరిత్రను వివరించు సందర్భమున, విద్యారణ్యులకు సన్న్యాసము నిచ్చిన ఆ కాలపు శంకర పీఠాధి పతులు రేవణసిద్ధ సంప్రదాయము ననుసరించుచుండి రను అంశము నెల్లరును గమనింపఁదగియున్నది. శృంగేరిపీఠమందు నేటివరకును ఆ పీఠాచార్యులచే ముఖ్యోపాసనామూర్తిగా పూజింపఁబడుచున్న శ్రీ చంద్రమౌళీశ్వరలింగము విద్యారణ్యు లకు వారి గురువులచే ననుగ్రహింపఁబడిన దని చెప్పఁబడి యున్నది. రేవణసిద్ధుఁడు శివసిద్ధాంతస్థాపకుఁడగుట సుప్ర సిద్ధము. వారు వీరశైవమతాచార్యులలో నొకరని వీరశైవు లనుచున్నారు. శంకరాచార్యులు రేవణసిద్ధసంప్రదాయము నను సరించుచున్నందుననే వీరశైవులగు కెళదిరాజులు శృంగేరీమఠ మునకు శ్రద్ధగా నడచుకొనుచుండిరి. శ్రీ శంకరాచార్యులు శివవిష్ణువులందు భేదబుద్ధి గలవారు కాకపోయినను, ఇప్పటికిని అద్వైతమఠ మనఁబడు శంకరపీఠమునందు లింగపూజాదులకే

ప్రాశస్త్య మెక్కువగా కలదని ఈ కారణమువలననే తెలియ వచ్చును.)

భారతవర్షీయ మధ్యయుగీన చరిత్రకోశ మను గొప్ప గ్రంథమున [11] నిట్లు వివరింపఁబడినది.

"रेवणसिद्ध: — यानें शंकराचार्यांना चन्द्रमौलीश्वर लिंग दिलें अशी प्रसिद्धि आहे. हे शंकराचार्य म्हणजे आद्य शंकराचार्य होत. हा जातीनें जंगम होता."

—मध्ययुगीनचरित्रकोश. पृ. ७१४.

(రేవణసిద్ధుఁడు:— వీరు శంకరాచార్యులకుఁ జంద్రమౌళీశ్వరలింగము నిచ్చి రని ప్రసిద్ధి కలదు. ఈ శంకరాచార్యులు ఆద్యశంకరులే యై యుండిరి. ౨. ఈ రేవణుఁడు జాతిచే, జంగముఁడు.)

ఇట్లు వీరశైవేతరగ్రంథములలోను స్పష్టముగ నీ విషయములు ప్రతిపాదితములు. రేణుకాచార్యుఁడు ఆంధ్రుఁడైనను, శంకరాచార్యుఁడు కేరళదేశీయుఁడైనను ఇరువురును కర్నాటక దేశమున నొక్కచోట (కడూరుజిల్లా, మైసూరురాజ్యం) తమ పీఠములను స్థాపించుటఁజూడ నిం దేదో రహస్య మున్నట్లే తోఁచుచున్నది. రేవణునిపీఠ మగు రంభాపురికిని (బాళే హొన్నూరు) శంకరునిపీఠమగు శృంగేరికిని ౧౫ మైళ్ళ దూరముమాత్రమే కలదు. శంకరునిపీఠమున నేటికిని గురుపరం

---

11 దీనిని పూనాచరిత్రకోశమండలివారు ప్రకటించినారు. వెల రు 12—0—0 లు.

పరగఁ జంద్రమౌళీశ్వరలింగపూజ జరుగుచుండుట సుప్రసిద్ధము. ఈ సమయమునఁ గాఁబోలు శంకరాచార్యలింగప్రదానవిగ్రహము చెక్కఁబడి నేఁటికిని రేణుకపీఠమున వెలసియున్నది.

శంకరాచార్యుని కాలముగూర్చియు రేణుకాచార్యుని కాలమునుగూర్చియు చర్చలు సాగుచునేయున్నవి. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దము మొదలు ఎనిమిదవ శతాబ్దమువఱ కను విషయములో గొప్పగొప్పవారికే వివాదములు రహితముకాలేదు. మదారిసు బి. సూర్యనారాయణరావు, B. A., M. R. A. S., గారి విజయనగరచరిత్రలో శంకరాచార్యునికాలము ఒకటవ శతాబ్ద మని నిర్ణయింపబడియున్నది. రేణుకవిజయమందును రేణుకుఁడు విక్రమమహారాజునకు ఖడ్గము నను గ్రహించిన యితివృత్తమును జూడ నీ కాలనిర్ణయమును సరిపోవుచున్నది. లేదా ఎనిమిదవశతాబ్దమున రెండవ మా రవతరించిన రేణుకుఁడును కలఁడు.

స్మార్తాచార్యుఁడు శైవాచార్యునినుండి లింగమునుబడసి పూజించుట సహజముగాదని నేఁటివారికిఁ గొందఱకుఁ దోపవచ్చును. కాని ప్రాచీనులలో నిట్టి భావము లుండెడివి కావు. ఏయే విద్య లెవరినుండిసాధించిన సమగ్రముగా లభించునో అట్టి యాచార్యులనుండి యాయావిజ్ఞానము నుపార్జించుట సంప్రదాయసిద్ధమే! పరకాయప్రవేశ మొనర్చి కామశాస్త్రమును దెలిసికొనిన అద్భుతమూర్తియగు శంకరుఁడు శైవాచార్యుల నుండి శివరహస్యము నందుకొనినచో వైరుద్ధ్య మేమియు లేదు. ప్రాచీను లగు జంగమాచార్యులుగాని, వారి మహాపీఠోప

పీఠములలో నేఁటికిని పరంపరగా నున్న గురుత్వాధికారముగల మఠస్థలమాహేశ్వరులునుగాని లింగి బ్రాహ్మణులే యైయున్నారు. జంగముల మని చెప్పుకొను ననేకసాధారణశాఖలు నుండుట వలనఁ గొందఱు పరమతీయపండితులకుఁ దారతమ్యము దెలియక పోవచ్చును. కాని నన్నెచోడుని కుమారసంభమున బ్రాహ్మణుఁడుగాఁ బలుమారులు పేర్కొనఁబడిన జంగమ మల్లికార్జునుఁడు విద్వాంసులకు సుపరిచితుఁడే. శివస్వరూపము నకే జంగమ మని పేరు. గురులింగజంగమము లొక్కటియే. ఇది శివాగమసిద్ధాంతము. గురువు లందరు జంగమములుగా నెన్నఁబడి కాలాంతరమున నది జంగమజాతిగాను వ్యవహృతమయ్యెను. కావున శైవస్మార్తభేదములు జ్ఞానోపార్జన కడ్డురావని యెఱుంగుట లెస్స.

"లింగస్య ధారణాదేవ శివోఽయం జీవతాం వ్రజేత్
లింగనాశే శివస్యాస్య జీవతావేశతా కుతః." 23

అని "యద్వైతానుభూతి"లో లింగధారణమును విమర్శించిన శంకరుఁడు శివలింగమును స్వీకరించుటయుఁ బూజించుటయుఁ బొసఁగదని కొందఱు వివదింపవచ్చును. ఇటఁ గొంత తెలియఁజెప్పవలసియున్నది. అద్వైతానుభూతిలో జగన్మిథ్యాత్వమును జెప్పు సందర్భమునఁ బై శ్లోకము వచ్చినది. ప్రకరణానుసారము ఆ శ్లోకమునకు "నిర్మలుఁడైన శివుఁడు జీవత్వకారణమును భావించి యంటుకొనుచో జీవుఁడే యగుచున్నాఁడు. అట్టి కారణలింగము (జీవచిహ్నము) నాశము పొందినపుడు జీవత్వభావ మెక్కడిది!" అని సహజముగ భావము చెప్పికొనఁ

దగు. అంతియేకాని శైవులు ధరించు ప్రాణలింగ విమర్శన ఇచ్చట నెంతమాత్రము లేదనుట విద్వద్వేద్యము. అటులు గాక అక్షరార్థము మాత్రమే చదువుకొనినవారు పై శ్లోకము నకు "లింగమును (అనఁగా నేఁటి శైవులవలె) ధరించినందువల ననే శివుఁడు జీవత్వమును పొందుచు" అను పూర్వభాగమును మాత్రమే శైవవ్యతిరిక్తముగ నుపన్యసించుచో స్వవచన వ్యాఘాతమును శంకరాచార్యున కంటఁగట్టవలసియుండును! పెక్కు పూర్వపక్షములు బైలుదేరఁగలవు. పై శ్లోకమునకంటె మొదటను తర్వాతను—

జీవేశ్వరాదిభావేన భేదం పశ్యతి మూఢధీః
నిర్భేదే నిర్విశేషేఽస్మిన్ కథం భేదో భవేద్ధ్రువం. 22
శివ ఏవ సదా జీవో జీవ ఏవ సదాశివః
వేత్త్యైక్య మనయో ర్యస్తు స ఆత్మజ్ఞో న చేతరః. 23

ఇట్లు శంకరాచార్యులే జీవేశ్వరులకు భేదము లేదని యును శివజీవు లేకమే ననియును సెలవిచ్చియున్నారు. భేదము లేనపుడు 'లింగము, శివుఁడు, జీవుఁడు' అను పదార్థము లెవ్వి! శివజీవాతిరిక్తమైన లింగము మరొకటికలదా? లేక దానిని శివ లింగమనియో జీవలింగమనియో అర్థము చెప్పవచ్చునన్నచో భేదమే లేని శివజీవులకు ప్రత్యేకలింగము లెచ్చటినుండి కలిగి నవి? అంతయు నిర్విశేషమైయుండ శివుఁడు లింగమును ధరించి జీవుఁడయ్యె నను సవిశేషభ్రాంతి యే మూఢునకుఁ గలిగినది? శివుఁడు జీవలింగమును ధరించి జీవుఁ డగు చున్నాఁడనుచో జీవుఁడు శివలింగమును ధరించి శివుఁ డేల కాఁజాలఁడు? శివజీవు

లేక మంటివి కదా? లింగము నశించి జీవత్వము పోవు టెటులు? సవిశేషులు వివాదపడుచున్నందున పుక్కిటి పురాణముఁ జెప్పితి నందువేమో? సవిశేషులభ్రాంతి నిర్విశేషుల యనుభవమున కెట్లువచ్చినది? ఇది యంతయు మిథ్య యను వాదమునే పురస్క-రించుకొనినచో సవిశేషముగ పెనఁగులాడు నిర్విశేషవాదము కూడ మిథ్య యేలకాదు? మున్నగు విషయములను సమన్వ-యించుటకుఁ గొఱవితోఁ దల గోకుకొనవలసియుండును. కావున నిట లింగధారణ నిందాపరముగా నీ శ్లోకమును గ్రహింపక ప్రకరణాంతరవిషయ మని తెలియవలెను. లింగమును హస్త పీఠమున ధరించి పూజించుట స్మార్తులలోను సదాచారమే కావున లింగధారణనింద యప్రస్తుతమే యగును. వీరశైవులు పూజాకాలమునందే కాక యెల్లపుడును ధరింతు రని యాక్షేపము చేయ వీలు లేదు. ఇదియే సంప్రదాయవిశేషము. వేదాగ-మాదులలో బోధింపఁబడిన ధర్మసామాన్యవిశేషములు అధి-కారితారతమ్యమును బట్టి సంప్రదాయముల సమన్వయించు చుండు నను సంగతిని సమర్థుఁడైన గురువు నాశ్రయించి గ్రహింపవలసియుండును. స్వసమయానుభవమే లేనివారికిఁ జెప్పవలసి యుండదు.

ఇట్లే శ్రీ రేణుకునిచరిత్రలోఁగల కాంచీవిష్ణుశిరఃకంప నివారణము, యక్షదంపతీదమనము, విక్రమఖడ్గప్రదానము, గోరక్షగర్వహరణము మున్నగు నంశములనుగూర్చి విపులముగా విమర్శించుటకు నిది యదను కాదని సంక్షేపింపనైనది.

ఒక ముఖ్యమైన విషయమునుమాత్రము గమనింపవలెను. ఆగమాది ప్రాచీనగ్రంథములలోను, సంస్కృత కర్ణాటక చరిత్రపురాణములలోను జెప్పఁబడిన రేణుకాచార్యుఁడు మొత్తము ఒకఁడే యనుకొనుటకు బాధ లేకపోలేదు. 2 మొదలుకొని 12-వ శతాబ్దమువఱకును రేణుక రేవణ రేవణసిద్ధ అను వ్యక్తినామములు కనపడుచున్నవి. వీరందరును వీరశైవవ్యక్తులే! రేణుకాచార్యుని పీఠము నారోహించినట్టి పెక్కు ఆచార్యులకును అభినవరేణుక మున్నగు బిరుదములతో వ్యవహారము కలదు. రేణుకుఁడు ఏడునూర్ల ఏండ్లు గుప్తముగాను, ఏడునూర్లు ప్రకాశముగను భూలోకమున నున్నట్లు ఈ చరిత్రలన్నియుఁ జెప్పుచున్నవి. యోగశక్తి వలన దీర్ఘకాలము జీవింపచ్చునను సిద్ధాంతమును విశ్వసింపని వారికిని ఇట ఆచార్యవ్యక్తులు భిన్నులుగా నభిమతమే కద! అనఁగా రేణుకాచార్యనామము గల మహనీయులు అనేక వ్యక్తులై యున్నను రేణుకచరిత్రలను గ్రథించిన ఆధునిక కవులకు నీ తత్త్వ మవగతముకాక ఒకే వ్యక్తినిగా వర్ణించుచు వచ్చిరా యను నూహ కలుగకపోదు. వీరశైవాచార్యుఁడు తప్ప ఇతరమతీయుఁ డెవఁడును ఈ నామముతోఁ గానరాఁడని మాత్రము ధ్రువమే!

"ఇతి శ్రీ భగవన్మాహేశ్వరస్య రేవణారాధ్యస్య సూనునా నాగనార్యేణ విరచితా ... ... దీపికా సమాప్తా."

(కవిరాక్షసీయే, వావిళ్ళప్రతి)

ఇక్కడఁ జెప్పఁబడిన భగవన్మాహేశ్వరుఁడగు రేవణుఁడు వీరశైవ గృహస్థుఁడనుటలో సందేహమే లేదు. ఏకాలపువాఁడో?

"ఉత్పలః కారికాం వేత్తి తంత్రం వేత్తి ప్రభాకరః
వామన స్తూభయం వేత్తి న కించిదపి రేవణః."
(షడ్దర్శనసముచ్చయటీకాయాం)

అను సుప్రసిద్ధశ్లోకమున జైనగ్రంథకర్తలచే నాక్షేపింపఁబడిన రేవణుఁడు వీరశైవాచార్యుఁడే యనుటను విద్వాంసులూహింపకపోరు. రేణుకుని మీమాంసాశాస్త్ర గ్రంథ మెద్దియైనను ఆ కాలమున నుండె నేమొ! రేణుకుఁ డగస్త్యునకు బోధించినది "సిద్ధాంతశిఖామణి" గాను, చోళున కుపదేశించినది "శివాధిక్యశిఖామణి" (చోళ రేణుక సంవాదము) గాను ఖర్పరాదులకుఁ బ్రతిగాఁ బుట్టినది రేవణసిద్ధకల్పముగాను[12] అతీతానాగతముల నరయుటకై స్వశిష్యుఁడగు రుద్రమునీశ్వరునకుఁ దెల్పిన జ్యోతిస్తంత్రము "ప్రశ్న రేణుకము" గాను[13] శంకరాచార్యునకు బోధించినది. "సిద్ధశంకర సంవాదము" గాను[14] లోకమునఁ బ్రచారములైనవి. రేణుకుని సూత్రభాష్యమున్నట్లు శ్రీకరభాష్యమువలనను, వీరశైవపండితలోకమందలి సాంద్రమైన ప్రఖ్యాతివలనను నిర్ణీతమేకద! ఇటులే రేణుకుని

12. ప్రసిద్ధమైన బసవరాజీయమున నిది వైద్యగ్రంథముగాఁ జేర్పఁబడినది. ఇటీవల నీ గ్రంథము లభించినదనియును, పూర్వ మొకప్పుడు మదార్సు ఆయుర్వేద గ్రంథప్రదర్శనమున నిడఁబడెననియును వైద్యవర్యు లొకరు చెలిపిరి.

13 ఇది మా గ్రంథాలయమున నున్నది. దీనితో మనోగత ప్రశ్నలను యథాక్షరముగ సైతము చెప్పవచ్చును. 14 ఇది యింకను అనుపలబ్ధము.

మీమాంసాది శాస్త్రగ్రంథమును కాలగర్భమున లీనమై యుండును. ఊర్వశీశాప మర్జునునకు అజ్ఞాతవాసమునఁ బనికి వచ్చినట్లు పూర్వాజైనపండితుని ఈసడింపు రేణుకాచార్యుని శాస్త్రగ్రంథముయొక్క అస్తిత్వమునకు సూచకమైనది.

క్రీ॥ శ॥ ౧౦-౨౦ల ప్రాంతమున నుండిన మహాకవి క్షేమేంద్రుని "భారతమంజరి"యొక్క యరణ్యపర్వమున (శ్లో. ౬౦౫-౬౬౭) ననేకతీర్థములు పేర్కొనఁబడినవి. అట "అగస్త్య, భద్రవటి, రుద్రతీర్థ, స్కందకోటి, రుద్రకోటి" యను శైవ తీర్థములలో రేణుకసరోవరమును గూడ విశదముగ నుట్టంకించినాఁడు.

"బ్రహ్మతుంగం సకౌమారం రేణుకం చ సరోవరం".

మహాభారతము ననుసరించియే 'భారతమంజరి' యుద్భవించినది. సంస్కృతమహాభారతముద్రాపకులు (వనపర్వ- ౮౫, ౮౨ అధ్యా) ఇక్కడ నున్న రేణుకశబ్దమును రేణుకా యని మార్చిరి. ఇది యజ్ఞతవలన జరిగియుండును గాని, అగస్త్య, స్కంద, రుద్ర, శంకుకర్ణ తీర్థముల మధ్యమున రేణుకతీర్థముండుటయే సంప్రదాయసిద్ధము. రేణుకాశబ్దమున కిక్కడఁ బ్రసక్తియే లేదు. క్షేమేంద్రుని బోలి "యౌచిత్యవిచారు"నకు రేణుక, రేణుకాశబ్దముల పరిజ్ఞానము పరిపూర్ణముగ నుండె ననుట యుక్తిసహము.

రేణుకునిగూర్చిన తీర్థ మొక్కటియె కాదు. ఇట్టివి పెక్కు గలవు.

## రేణుకుని క్షేత్రములు

శ్రీమదాచార్యుని యవతారభూమియగు కొలనుపాక క్షేత్రము సుప్రసిద్ధము. వీరశైవమతమును ఇక్కడనుండియే ప్రచారమైన దనవచ్చును. అనేకకారణములవలన నీ క్షేత్ర మాహాత్మ్యము[15] వీరశైవులలో నత్యధికముగాఁ గలదు. దీనికి ౫, ౬ మైళ్ళ దూరమున 'కొడువటూ'రను సిద్ధేశ్వరక్షేత్రము గలదు. రేణుకసిద్ధుఁ డిట శివయోగసమాధిమహిమను బ్రకటించుటవలన నీనామము కల్గె నందురు. గుల్బర్గాజిల్లాలోని 'శేవగి' గ్రామమునను 'సగసంబి'లోను నీ యాచార్యుని పేరఁ బ్రాచీన దేవాలయములు కలవు. సుప్రసిద్ధమైన చాళుక్యకళచుర్య రాజధాని యగు కల్యాణపట్టణమునను రేణుకాచార్యుని మందిర మున్నది. ఈ క్షేత్రము లన్నియు నేఁటి నిజాంప్రాంతమందలివి.

మైసూరురాష్ట్రమునను రేణుకుని పుణ్యక్షేత్రములు కొన్ని కలవు. అందు బాళెహళ్లి, బాళెహొన్నూరు అను రంభాపురి రేణుకునిస్థానములలో కెల్లఁ బావనతరమై భద్రాతీరమున నున్నది. ఇదియే జగద్గురు రేణుకాచార్యుని వీరసింహాసనాగ్ర భూమి. ఇది కడూరుజిల్లా నరసింహరాజపురము తాలూకా లోనిది. ఇచ్చోటనే ఆదిరేణుకాచార్యుని యనంతరము పరంపరగాఁ బట్టాభిషిక్తు లగుచున్న జగద్గురుమహాచార్యులు నేఁటికిని నివసించుచున్నారు. శ్రీ మహాపీఠమును వర్తమానమున నధివసించుచున్నవారు శ్రీ౧౦౮ జగద్గురు శివానందరాజ

---

15 "కొలనుపాక మాహాత్మ్యము"ను బ్రకటించునపుడు దీని విశేషములు వివరింపఁబడును.

దేశికేంద్ర శివాచార్య మహాస్వాములవారు. శ్రీ వారి ధర్మ పరిపాలన, విద్యావితరణ, విద్వత్పోషణాది లోకోత్తరవిధానములు నిరుపమానములు.[16] ఈ పీఠమున శ్రీ వీరభద్ర శ్రీ జగద్గురు రుద్రముని శివాచార్యులయొక్క విగ్రహములును కలవు. శ్రీ మైసూరు ప్రభుత్వమువారీ సింహాసనాచార్యుల గౌరవప్రతిపత్తులను యథాశాస్త్రముగఁ బ్రకాశింపఁ జేయుచున్నారు. బెంగుళూరుజిల్లా హొసపేట తాలూకలోని రేవణసిద్ధేశ్వరుని బెట్ట (కొండ) యు, శివగంగాక్షేత్ర పూర్వపర్వతమున రేవణ సిద్ధేశ్వరదేవాలయమును, తుమకూరుజిల్లాలో సిద్ధులకొండయను గలవు.

బొంబయిప్రాంతపు సొన్నలాపురమునను, ఈ మండల మందలి మంగళవేఢ, మాసనూరు సిద్ధనకెరె గ్రామములలోను, సాతారాజిల్లా విటాతాలూక రేణావియందును, కొల్హాపురము బెల్లదబాగెవాడికిఁ జేరువగాను, అక్కలకోట తాలూకా యందలి బర్హాణపురమునందును, శ్రీ రేణుకునకు సంబంధించిన దేవాలయములు, గిరులు, తటాకములు గలవు.

మద్రాసు ప్రాంతమునను గొన్ని స్మారకములు లేక పోలేదు. ఆర్కాటుజిల్లా అరుణాచల మధ్యమునను, వృద్ధాచలమునను. కోయముత్తూరుజిల్లా కొళ్లేగాల తాలూకాహరళి

16 శ్రీ జగద్గురువులవారి సంపూర్ణాశీర్వాదఫలముగా నీ రేణుకవిజయము మా గ్రంథమాలలో నింత సమర్థముగఁ బ్రకటితమై యాంధ్ర వీరశైవులకుఁ బఠనీయ మగుచున్నది.



శ్రీ రంభాపురీ (బాళెహాళ్ళి) వీరసింహాసనాధీశ్వర

శ్రీ జగద్గురు శివానందరాజదేశికేంద్ర శివాచార్యులవారు,

గ్రామపు కావేరీతీరముననుు శ్రీ రేణుకుని పేర దేవాలయ ములు కలవు.

హిమాచలపు శ్రీ మదేకోరామాచార్యుల ధర్మపీఠ మగు ఉషామఠమునకు సమీపమున నొక రేణుక తటాకము గలదు.[16]

ఈ క్షేత్రములను తత్తత్ స్థలములను శ్రీ రేణుకా చార్యులు సంచరించి రనియును వారి స్మారకముగా నివియే కాక పరిశోధకులకు ఇంక నెన్నియో లభ్యము కాఁగలవని యును విశ్వసింపవచ్చును.

ఏవంవిధమగు మహాగ్రంథక్షేత్రసామగ్రిని కూలంకష ముగఁ బరిశీలించి ఆగమాదివిపులప్రమాణములతోడను; శాసనప్రతిబింబములతోడను, క్షేత్రచిత్రములతోడను సమేత మగు బృహద్రేణుకవిజయమును సమర్థు లెవ్వరైనను కాలాం తరమున సిద్ధము చేయఁగలరు.

రేణుకుఁ డాంధ్రుఁడైనను ఆంధ్రమున నెక్కువగా చరిత్రగ్రంథములు పుట్టలేదు. రేణుకుని సింహాసనము కర్ణా టకమున నుండుటవలనను; అట నాచార్యుని జీవితకాల మెక్కు వగాఁ గడచుటవలనను గన్నడముననే నాతనిగూర్చి బహు గ్రంథములు పుట్టుట కవకాశము గల్గినది. తెలుఁగున విరచిత

16. మహాభారత వనపర్వమున వచ్చిన 'రేణుక సరోవర' మిదియే యగు నేమో పరిశీలనీయము. దీనికి ఏకోరామపీఠ సాన్నిధ్యము కూడ సాధకము.

ములైన ఒకటి రెండు ప్రాత్తములును సురక్షితముగా లేవు.[17] కావున సంగ్రహాత్మకమైన చరిత్రను పురాణరూపముగఁ బఠించుకొను వీరశైవులయుపయోగార్థమై యొక గ్రంథమును బ్రకటించు ప్రయత్నము చిరకాలానుభూత మగుచునే యుండెను. "కాలే వర్షతి పర్జన్యః, కాలే ఫలతి భూమిజః" యను నార్యోక్తి ననుసరించి నేఁటి కీ యల్పకాయగ్రంథ మైనను ప్రకాశము నందినది.

బహుగ్రంథప్రణేతలును, "పంచాచార్యప్రభా" ప్రవర్తకులును, వీరశైవసనాతనధర్మపక్షవిచక్షణులును, నాగనూరుబృహన్మఠాధ్యక్షులును, పండితవర్యులు నగు శ్రీకాశీనాథశాస్త్రిగారి యప్రతిమప్రోత్సాహమువలననే ఈ గ్రంథమచిరముగఁ బ్రకటితమైనది. శ్రీ శాస్త్రిగారు ఏ తద్గ్రంథకర్తలగు కవీశ్వరులను సముచితముగ సంభావించుటయే కాక ఇందలిచిత్రముల నన్నింటిని స్నిగ్ధపత్రములతోఁగూడ సుచితముగ ముద్రించి యిచ్చి సాహాయ్య మొనర్చినారు. వారియెడ

---

17 పూర్వమలంపూరునివాసులగు రేచర్ల శ్రీమలుగు సాంబయ్యగారు రేణుకప్రబంధమను సత్యలింగకవికృతిని దాము స్వయముగ జూచితిమనియును, కవిత్వము సాధారణముగ నుండెననియును గట్టిగఁ జెప్పుచున్నారు. సిద్ధనాథుని సంస్కృతరేణుకవిజయమును అలంపూరు దగ్గరి నందికొట్టుకూరిలో లభించినది. పాల్కురికి సోమనాథుని మల్లమదేవీ పురాణ మను నొక యపూర్వకృతిని నందికొట్టుకూరిలోనే యొకరియింట గాంచినట్లు శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు "ఆంధ్ర సారస్వత సర్వస్వము"న వ్రాసిరి. ఇవి యన్నియు అలంపుర మొకప్పుడు వీరశైవాచార్యుల కేంద్ర మనుటకు సూచకములు.



నాగనూరు బృహన్మఠాధ్యక్షులు

పండిత శ్రీ కాశీనాథశాస్త్రిగారు

నౌపచారికముగఁ గృతజ్ఞతను బ్రకటించుటకంటె నధికముగ నర్పించు స్వార్థము లేదు.

ప్రస్తుతగ్రంథమగు ఆంధ్రరేణుకవిజయమును ఆంధ్రలోకమునకు సుపరిచితులగు సాహిత్యశిరోమణి: శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు విరచించిరని పాఠకులీపాటికిఁ దెలిసికొనియేయుందురు. వీరి పాండిత్యప్రతిష్ఠలను గూర్చియును ప్రసన్నకవిత్వమునుగూర్చియును వేఱుగా నివేదింపఁబనిలేదు.[18] తెలుఁగు నుడికారములును లోకోక్తులును వీరి కవిత కలంకారములు. వైయాకరణులు కావున భాషాపరిశుద్ధికిని వీరు పేరువడసినారు. ఈ గ్రంథమునఁ గల పహరా (౧-౭) మరమ్మతు (౧-౪౬) పునీత (౩-౪౦) పట్నము (౩-౭౯) నిర్మాణించు, వత్తు మున్నగు రూపములు వీరి కవితాస్వాతంత్ర్య

---

18 శ్రీ స.సూ.నా. శాస్త్రిగారు వారి మేనబావగారగు శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి వద్ద విద్యాభ్యాసమును గావించిరి. వీరు బాల్యమునుండియు వ్యాకరణశాస్త్రమును మిక్కిలి పరిశ్రమతోఁ బ్రయోగదృష్టి నిడుకొని యభ్యసించి యందు విపులమైన విజ్ఞానమును సంపాదించినారు. మొదలు కొంతకాల మాంగ్లభాషను గూడఁ జదివియుండిరి. వీరిరువదిరెండేండ్లనుండి సికిందరాబాదు మహబూబు కాలేజిలో నాంధ్రోపాధ్యాయులుగా నున్నారు. స్వయంకృషివలన అలంకారశాస్త్రమునను వైదుష్యము సంపాదించి శిరోమణి, విద్వాన్, P. O. L. పరీక్షలలో నుత్తీర్ణత నందిరి. అద్వైతవేదాంతగ్రంథములనుగూడ బఠించినారు. జాతకకథాగుచ్ఛము, తత్త్వచంద్రిక మున్నగు గ్రంథములు వీరి ప్రకృష్టమైన కవిత్వమునకును పాండిత్యమునకును సమర్థమైన సాక్ష్యములు. వీరి కీరసందేశము, ద్వంద్వయుద్ధము, సప్తశతీసారము, ఖడ్గతిక్కన మున్నగు పెక్కుగ్రంథము లాంధ్రదేశమునఁ బ్రచారమంది కొన్ని విశ్వవిద్యాలయములలోఁ బఠ్యములు.

మునకును సాక్ష్యములు. సంస్కృత రేణుకవిజయమును కన్నడ రేణుకవిజయమును అనుసరించి ఈ యాంధ్రకృతి సిద్ధమైనది. సంప్రదాయవిషయములును గూడ పాటింపఁబడినవి. కావున నీ యనువాదమున భావస్వాతంత్ర్యమున కవకాశము లేకుం డుట భావ్యమే! మూలగ్రంథములకంటెను న్యూనత మాత్రము సంఘటింపలేదు. కొన్నిచోట్ల నుత్కృష్టతయుఁ బొడమినది. ఏతద్రచనావసరమున శ్రీ శాస్త్రిగారికిఁ బరిశ్రమయు గలిగినది. నా కోర్కె ననుసరించి స్నేహముతోడను బరమార్థబుద్ధితోడను ఇద్దానిని రచించి మా గ్రంథమాల కొసంగిన శ్రీ శాస్త్రిగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

శ్రీ కొలనుపాక క్షేత్రమున శా. శ. ౧౮౫౭ యువసంవత్సర ఫాల్గునశుద్ధ ౧౨,౧౩,౧౪ తిథులలో నెరవేరిన వీరశైవధర్మ పరిషత్తున శ్రీ రేణుకుని యనుపమచరిత్రను విని యది గ్రంథ రూపముగ సిద్ధమగుచోఁ దన్ముద్రణ కగు సాహాయ్యమొనర్తు నని సభాముఖమున వెల్లడించినవారును[19] అస్మన్మిత్రవర్యులును సద్వైష్ణవులును సౌజన్యమూర్తులును అగు కొలనుపాక శ్రీ గంగరాజు రఘునాథరావు దేశపాండ్యగారు ఇటీవల కాలధర్మము నొందిరి. ఈ గ్రంథప్రకాశమునకు వారి వాగ్దాన ప్రోత్సాహమే అంకురార్పణము. ఈగ్రంథ ప్రకటన నపుడే శీఘ్రముగ నెరవేర్చి వారియాత్మకు సంతసముఁ గలిగింపఁ జాల నందులకు విషాదమగుచున్నది.

---

19 'గోలకొండపత్రిక' సం. ౧౦ సం. ౭౫ (16-3-36) చూడుఁడు.

శ్రీ శివానుగ్రహము, శ్రీ రంభాపురి జగద్గురువులవారి యాశీర్వాదము, పూర్వోక్త విద్వద్వర్యుల ప్రోత్సాహము లనెడు సాధనత్రయి నూతగాఁ గొని శ్రీమదాచార్యనిచరిత్ర నీ సంగ్రామసమయమందలి మహార్ఘతలోను సులభముగ మా పాఠకుల కందింపఁ గలిగినందులకుఁ గొంత సంతసమే కాని యింకను నివ్విషయమునఁ గర్తవ్య మవశిష్టముగనే యున్నది. "క్లేశః ఫలేన హి పున ర్నవతాం విధత్తే" యన్న మాడ్కి నీ గురుచరిత్ర మాంధ్రవీరశైవలోకమున సముచితముగఁ బ్రచారమగుచోఁబునర్ముద్రణావసరమున నివేదనీయాంశములు పూర్తిగావింపఁబడఁగలవు.

మానవబుద్ధిసహజముగ దొరలిన దొసఁగులను విజ్ఞులాజ్ఞాపింపఁగోరుచు నేతద్గ్రంథావిర్భూతికిఁ గారణమైన మహనీయులకుఁ గృతజ్ఞతాంజలి ఘటించుచున్నాఁడ.

శా. శ. ౧౮౬౪
చిత్రభాను రథసప్తమి.

రేణుకపథపథికుఁడు,
చిదిరెమఠము వీరభద్రశర్మ.

# కృతజ్ఞత

ఈ రేణుకవిజయమును వ్రాయుటకు నన్ను బ్రోత్సాహించిన నాగనూరు బృహన్మఠాధ్యక్షులు పండిత శ్రీకాశీనాథశాస్త్రిగారికిని, శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికిని నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. కన్నడభాషలో నున్న యీ గ్రంథమును నాకు సమగ్రముగా శర్మగారే యాంధ్రీకరించి చెప్పిరి. కావున వారికి ద్విగుణీకృతమగు కృతజ్ఞతఁ జూపుచున్నాను.

విధేయుఁడు,

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

11-2-1943.

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము





# అ వ ధే య ము



శ్రీ జగద్గురు రేణుకాచార్యులవారి జయంత్యుత్సవమును ఫాల్గున శు. ౧౩ లేక ౧౪ తిథులలో (మఖానక్షత్రమున) నాచరించుట సమస్తాస్తికవీరశైవుల కర్తవ్యము. మూర్తికి అభిషేకాదులను గావించి విగ్రహమును గురుహర సంకీర్తనపురస్సరముగ నూరేగించి సభలో సిద్ధాంతశిఖామణి రేణుకవిజయములగూర్చి యుపన్యసించి ధర్మప్రచారము గావింపవలెను. రేణుకునియవతారముఖము సద్యోజాతము, పూర్వదిక్కలశము, కంథావర్ణము హరిత్ (ఆకుపచ్చ), వీరగోత్రము, షడ్విడి సూత్రము, ఏకాక్షర శివాచార్యప్రవర, ఋగ్వేదము, అశ్వత్థదండము, నకారబీజము, ప్రసాదపంచాక్షరీమంత్రము, పృథ్వీతత్త్వము, పురాణ సుతూర్యాదులు ౧౩ ఉపసూత్రములు— అను వివరణము అవధేయము.

---

శ్రీజగద్గురుపంచాచార్యాః ప్రసీదంతు

# రే ణు క వి జ య ము

## ప్ర థ మా శ్వా స ము

### మంగళాచరణము

క. శ్రీమత్కైలాసాచల
ధామా! సోమా! మహత్త్వశంసకనిగమ
స్తోమా! కలుషధ్వంసక
నామా! సర్వామరాభినందితమహిమా!

మ. జలరూపంబును, బావకాకృతిని, య
జ్వాత్వంబునున్, సూర్యచం
ద్రుల యాకారము, నంతరిక్షవిధమున్
భూమిస్వరూపంబుఁ, గ
ర్వలిచందంబును దాల్చి లోకములకున్
శ్వశ్శ్రేయసవాప్తిముం
గలుగంజేసెడి యష్టమూర్తిని శివున్
గాఢంబు ధ్యానించెదన్. ౨

క. చండికయై పాపంబులఁ
జెండాడుచు, భక్తతతికి శివములు గూర్పన్
మెండుగ శివాత్మమునఁ గను
పండువుగావించు తల్లిఁ బార్వతిఁ గొలుతున్. ౩

క. మణివై "ఆదౌ పూజ్యో
గణాధిప"యటన్న కీర్తిఁ గైకొని దివిష
ద్గణమునకుఁ, గ్రియాసిద్ధికిఁ
బ్రణేత యగు విఘ్ననాథు బత్తి నెరగుదున్. ౪

క. శ్రుతిగీతిఁ బాడుచుండఁగఁ
బతి, వేతంతియలు గల్గు వరవీణపయిన్
అతిమృదువుగ వాయించెడు
సతీమణి సరస్వతినిఁ బ్రశంసింతు నెదన్. ౫

గీ. దిక్పతులు తన్నుఁ గాంచి భీతిల్లి పఱవ
దిగ్భ్రమముఁ బొంది కడు నన్యదిక్కులకును
సురలు చిచ్చఱపిడు గంచు వెఱచి విఱుగ
దక్షు మర్దించు వీరభద్రయ్యఁ దలఁతు. ౬

క. అహమహమిక శివదర్శన
మహోత్సవంబునకు వచ్చు మంది ననుపుచున్
'బహారాఁ' గాయుచుఁ దగ వే
త్రహస్తుఁ డగు నంది మ్రొక్కెదను సద్భక్తిన్. ౭

చ. హరు వలగొంచు నర్ధవల
యాకృతి మ్రొక్కి, భవానిఁ దా ననా
దరపఱప న్నశక్తపద
తం గొని శాపఫలంబుగా, మహే

శ్వరు దయ నేకపాదమునఁ
బాదయుగీపటిమంబుఁ గాంచి శం
కరు సభలో విదూషకుఁడు
గా నయి వర్తిలు భృంగి నెన్నెదన్. ౮

గీ. తన మహావీర్యరూపవర్ధనములు విని
యముని యెనఁపోతు పర్వెత్త నళికి దవ్వు
అంబికానాథు వాహనంబై చెలంగు
ధర్మమూర్తిని వృషభంబుఁ దలఁతుఁ బ్రీతి. ౯

క. హరవిరచితాగమంబులఁ
బురాణమును, శైవతత్త్వమును రూఢముగా
ధరలో నాటిన స్కందుని
సురసైన్యస్కంధు నెడఁదఁ జొనుపుదు బత్తిన్. ౧౦

క. అంచితగుణసంచయులుఁ, బ్రి
పంచక్షేమంకర ప్రివర్తనులు, జగ
త్సంచితపుణ్యాకృతు లగు
పంచాచార్యుల నుతింతు బ్రిహ్మాత్ములనన్. ౧౧

క. శివసద్యోజాతముఖో
ద్భవుఁడై యల వీరశైవతత్త్వనగంబున్
భువి స్థాపింపఁగ వచ్చిన
ప్రివీణుఁ డగు రేణుకార్యుఁ బ్రిణుతింతుఁ దగన్. ౧౨

క. ధరయందు శైవకావ్యమె
సరసతరం బంచుఁ బెద్ద చాఁటఁ దెలుఁగునన్
విరచించిన శ్రీనాథా
ద్యురుకవులకు వందనంబు లోలి నొనర్తున్. ౧౩

సీ. తొలుతఁ బంచాచార్యు లిలను స్థాపించిన
వీరశైవమతంబు పెంపడంగి
పేర్ప్రతిష్ఠలు మాయ, వీక్షించి కంకణం
బును గట్టి దాని సముద్ధరింపఁ,
బ్రతివాదుల జయించి, స్వయముగా వ్రాసియు
వ్రాయించియును బెక్కు గ్రంథములను,
గురువర్గసభలను గూర్చి పెక్కింటిని
గర్ణాటమున మానికంబువోలె

గీ. భాసిలినవాఁడు, నైష్ఠికబ్రహ్మచారి,
అత్యుదారుండు, సువిశాలయశుఁడు, ఘనుఁడు
చారుగుణుఁడు, కాశీనాథశాస్త్రి బుధుఁడు
నాగనూర్మఠనాథుండు నయపరుండు. ౧౪

మ. శివభక్తోద్ధరణుండు, ధీవరుఁడు, కా
శీనాథశాస్త్ర్యాహ్వయుం
డు, విశిష్టప్రతిభాన్వితుండు, బుధవ
ర్ణ్యుం, డేతదీయాదరం

బె విచారింపఁగ నాదు కావ్యమునకున్
బీజంబు; శ్రీశాస్త్రికిన్
భువి దీర్ఘాయు వొసంగి శ్రేయ మిడి శం
భుం డోమూర్తిన్ నిచ్చలున్. ౧౫.

క. శివరామశాస్త్రి, వేలూ
రి వంశకలశాబ్ధిచంద్రు, శ్రితసత్కీర్తిన్
అవధానకలాదక్షుని,
స్తవింతు మద్దేశికేంద్రు జ్ఞానసముద్రున్. ౧౬.

---

## — కథాప్రారంభము —

క. పదునాలుగు లోకములకుఁ
బొదలుచు నాధార మనఁగఁ బొడవొప్పఁగ ము
ప్పదిమూఁడుకోట్ల యోజన
కదంబకము మేరుగిరి ప్రకాశిలుచుండున్. ౧౭

క. సురసిద్ధసాధ్యకిన్నర
గరుడోరగముఖ్యతతికిఁ గాపుర మగు నా
గిరిరాజంబుమహత్త్వం
బఱిదియ వర్ణింప నా యనంతునకైనన్. ౧౮

చ. ఎవని బ్రదక్షిణించును రవీందుమహాగ్రహ తారకాగణం;
బెవనిఁ బురారి వింటి రచియించి పురాసురుఁగీ టడంచెనో;
ఎవఁ డిల రత్నముల్ పిదికి యిచ్చె సమృద్ధిగ శైలపంక్తి; కా
వ్రవరుని మేరు నెన్నఁ గఁదరంబె మహామహిమాభిరామునిన్?

గీ. తాదృశస్వర్ణశైలమధ్యంబునందు
భాసిలు మనోహరముగఁ గైలాసనగము
నందు శివదర్శనానందతుందిలు లగు
ప్రమథబృందంబు భక్తరాట్ప్రథము లుండ్రు. ౨౦

క. ఆ కొండనలువలంకుల
వాకిళులై తనరు నాల్గు ప్రాంజమువులు, సే
వాకుశలుఁడు నందీశుఁడు
ప్రాకటముగఁ గాచు నిలిచి ప్రాగ్ద్వారమునన్. ౨౧

శా. కత్తిం గైకొని దక్షునాదలఁ దగన్
ఖండించె; బుత్తివే క్షత్రిన్
మొత్తె న్నాడని బాడఁగా వెనుకవై
పుం జూచుచున్; వేలుపుల్
మొత్తంబుం దటిమెం గదన్ మగఁటిమిన్
మున్, వీరభద్రుండు దా
నిత్తెంబుం గొలువుండు దక్షిణదిశన్
నిర్నిద్రుఁడై వాకిటన్. ౨౨

క. పడమటిదెస, ను త్తరమున
నడరుదు రట నీలలోహితాహ్వయు డగు రు
ద్రుఁడును, మహాకాలుఁడు రు
ద్రుఁడునుఁ భక్తేష్టదానధూర్వహమతులై. ౨౩

క. శివనామ ముచ్చరించుచు
శివసారూప్యంబుఁ దాల్చి స్పృహసేయు చెదఁ
శివదర్శనమునకు మునుల్
తవిలి చరించుదురు నాల్గు ద్వారములందుఁ. ౨౪

క. విలసిలు నా కైలాసా
చలమున మణిమయములైన స్తంభంబులతోఁ
దులకించు ముత్తియపు దం
డలతో నొక మండపంబు డంబు వహించుఁ. ౨౫

మ. సతతం బయ్యెడ నయ్యుమారమణుఁ డీ
శానుండు విద్యాధిదై
వతముల్ కేసరపుంజమై, దళములై
భాస్వత్సుధాంశుద్యుతి
పరితతుల్, నాళమునయ్యె వాసుకి, కదుఁ
భాసిల్లు చున్నట్టి యా
యతిరమ్యాష్టదళాబ్జమందు మహనీ
యస్ఫూర్తి వాసించెదుఁ. ౨౬

మ. తలపై గంగయుఁ జందమామయును, గా
త్రింబం దహిశ్రేణి శో
భిల, సూర్యేందుశిఖుల్ త్రినేత్రములుగా
వెల్గొంద, వామాంగమం
దల శైలాత్మజ గ్రాలఁ బంచముఖుఁడై
యశ్రాంత మాత్మాశ్రితా
వళి వాత్సల్యముతోడఁ గాచు హరుఁ డొ
ప్పారున్ మనోజ్ఞంబుగన్. ౧౬

క. ధరియించియు గజచర్మాం
బరమును భస్మత్రిపుండ్రభాస్వరమై నేన్
మెఱయఁగఁ దత్పార్శ్వంబులఁ
జిఱునవు వెన్నెలలు గాయ శివుఁ డందుండున్. ౧౭

సీ. సనకాది యోగీంద్ర జనబృంద మేతెంచి
పొగడు చుండఁగ హస్తములు మొగిడ్చి
నీరజాసనముఖ్య నిర్జరావళి వచ్చి
సాష్టాంగవినతులు సల్పుచుండఁ
దారకారియును బిఘ్నారియు నరుదెంచి
ముంగల శ్రుతిపాఠముల నొనర్ప
నందియు భృంగియు డెందంబు బత్తితోఁ
దొలఁకాడ నిలుచుండి కొలుచు చుండ

గీ. వేదజననయిత్రి యైన సావిత్రి పేర్మి
సభ కలంకారమై మనోజ్ఞతను గూర్ప
నింబు మీఱంగ నొడ్డోలగంబునందుఁ
బరిఢవిల్లుచు నుండె శ్రీకరుఁడు హరుఁడు. ౨౯

మ. సరవిం గాంచఁగ శంఖచక్రగదలున్
జాపంబునుం జేతులన్
బరగన్ వక్షమునందుఁ గౌస్తుభము శ్రీ
వత్సంబునుం, బత్త్రిమై
వరపంచాక్షరమంత్రముం జదువుచున్
వైకుంఠదేవుండు త
త్పరిషన్మధ్యమునందు వెల్గె సురల
బ్రిం బంది వీక్షింపఁగన్. ౩౦

మ. తనుదీప్తిం జలజాప్తదీప్తిఁ గడు డిం
దం జేయుచున్ సంతతో
న్మనులై రేణుకదారుకుల్, మఱియు
ఘంటాకర్ణుఁ డన్ దేశికుం
డనఘుండై తగు ధేనుకర్ణవిబుధుం,
డా విశ్వకర్ణుండు, శం
భుని పంచాస్యములందుఁ బుట్టిన ఘనుల్
పొల్పొంది రా గొల్వునన్. ౩౧

క. తొలకరిమించుల మొత్తము
వెలవెల వఱపించు నేనివెలుఁగుల లాస్యం
బులఁ జేయు చంద్రు రంభా
తిలోత్తమాద్యప్సరస్తతియు నవ్వేళన్. ౩౨

క. కనుచున్ వినోదజాలము,
వినుచున్ భక్తులు పొనర్చు విన్నపములు, వా
రినిఁ గరుణామృతదృష్టినిఁ
గనుంగొనుచు నీశ్వరుండు కాత్యాయనితోన్. ౩౩

—• పరశివుఁడు శ్రీరేణుకాచార్యు నాజ్ఞాపించుట •—

గీ. తత్సభామందిరమున రత్నప్రదీప
ముల తెఱంగునఁ దద్దయు వెలుఁగు చున్న
యట్టి యాచార్యపంచకమందు నున్న
రేణుకుని దగ్గఱికిఁ బిల్చెఁ బ్రీతి యొలుక. ౩౪

క. జనకుని సమీపమునకుం
జనుదెంచుచు నున్న పుత్త్రుచందమున మదిం
బెనఁగొనఁగా భయభక్తులు
ఘనుండు రేణుకుఁడు శివునికడ కరుదెంచెన్. ౩౫

మ. హరుఁ డీక్షించి పురఃప్రదేశగతుఁడౌ
నా రేణుకాచార్యునిం
గరబంధోజ్జ్వలఫాలమండలుఁ దగం
గారుణ్యపూర్ణాక్షులం

బరమానందముతోడ నిట్లు వలికెఁ
రమ్మోయి ! నాబిడ్డ ! ద
గ్గఱికిం ద్వత్కరణీయకార్య మది యొ
క్కం డుండె నాలింపుమీ ! ౩౬

గీ. నాస్తికావళి జృంభించి యాస్తికు లగు
వీరశైవుల కిడుచుంట బెట్టిదములు
వీరశైవంబునకుఁ దాఁకెఁ బెద్ద దెబ్బ
ఊనుమా ! వీరశైవధర్మోద్ధరణము. ౩౭

మ. పిడివాదంబు లొనర్చుచుఁ శ్రుతులకుఁ
భిన్నార్థముల్ తీయుచుఁ
బిడుగుల్ వోలెను మొత్తుచు న్నడఁగఁగా
వేదోక్తధర్మంబులఁ
నడిపింపంగఁ జెనంటితోఁ బ్రవ జనులఁ
యత్నించు చున్నా రిలం
జెడుగుల్ కొందఱు; లేదు కిల్బిషము త
జ్జిహ్వాగ్రముల్ చీల్చినఁ. ౩౮

క. నలుదిక్కులఁ జెలరేఁగిన
కలుషాత్మకులైన నాస్తికశ్రేణులచే
నలుగుచు నున్నది ధర్మము
బలమఱి చూపడఁగుఁ గొంతవడి కిట్లున్నఁ. ౩౯

శా. ఈదృగ్దుఃస్థితవీరశైవమత మోయీ!
యుద్ధరింపన్ భువిం
ద్వాదృగ్ధుర్యులు గోచరింప రొకరున్
నాదృష్టికిం; గాన నీ
మీఁదన్ మోపుదు నిర్వహింపవలె సు
మ్మీ! కార్యభారంబు నే
వాదక్షుండవు దేశికోత్తముఁడవున్
భవ్యుండవున్ రేణుకా! ४०

మ. అని కొండాడుచు నానతింపఁగ హరుం,
డా రేణుకాచార్యుఁ డి
ట్లను నాస్యంబు నలంతి వాిల్చి శివుపా
దాబ్జంబులం దాఁకుచుం
దన హస్తంబులఁ గండ్ల కద్దుకొనుచున్
"నా తండ్రి! మన్నింపు మీ
పనికిం జాలఁ ద్వదాజ్ఞ మీఱుటకు నా
స్వాంతంబు గొంకుం గదున్. ४౧

క. ధనవంతుఁడు దారిద్ర్యం
బును గొనుగతిఁ బుణ్యలోకమును బాసి కటా!
చెనఁటి యగు నారకమునకుఁ
జనిన ట్లగు నాదు బ్రిదుకు శశధరమకుటా! ४౨

గీ. తల్లి నిం బాయఁజాలని పిల్లఁడట్లు
నిన్నుఁ బాయంగఁ జాలఁ దండ్రీ! క్షమింపు
తలఁచుకొనుచున్న కొలఁది భూతలము కథలు
జలదరించును నామేను చంద్రమౌళి!" ౪౩

క. అని శివునానతినిం జే
యనుఁ ద్రోయనుగాక రేణుకాచార్యుఁడు తా
వినయంబునఁ దలవాంచిచి
కనుచుర్ణ ముక్కంటికాళ్ళకడ నిలుచుండెన్. ౪౪

క. పరమేశ్వరుండు కనుఁగొని
యెఱింగి రేణుకుని హృదయ మిట్లనె "నోయీ!
యెఱుఁగవు నీబల మిఁక; నే
నెఱుఁగుదు; నీ పనికిఁ దగుదు వీ వొకఁడవ నూ!. ౪౫

క. నిలయము పాపమునకు భూ
తల; మా హేతువుననే కదా! నినుఁ బంపన్
వలసెను; దాని మరమ్మతు
సలుపుటకై నీవు మాత్రమె చాలుదు పుత్త్రా! ౪౬

శా. భూలోకంబున నేఁడు దీవులను జం
బూద్వీప ముత్కృష్టమై
కాంలున్; దానఁ ద్రిలింగదేశ మమరున్
రాష్ట్రంబులన్ శ్రేష్ఠమై;

కైలాసంబున కుద్దిదై కొలనుపా
    కక్షేత్ర మొప్పారు నం;
దాలోకంబు పవిత్రమయ్యెను జుమీ!
    యా క్షేత్రమం దుంటచేన్. ౪౭

ఆ. అందు లింగరూప మొంది, సోమేశ్వరా
హ్వయముఁ గాంచి, కాంచ నభిలషించు
భక్తతతికి నేను బ్రత్యక్షమై వారిఁ
గాచు చుందు వేయికనులఁ గప్పి. ౪౮

క. ఆవిర్భవింపు మోయీ!
నీ వా లింగంబునుండి; నీవలనన యీ
భూవలయంబు సమస్తముఁ
బావనతర మగును ధర్మబంధురము నగున్. ౪౯

శా. ఏన్నూ ఱేఁడులు గోచరింపకయు నీ
    వెవ్వారికిన్ భూమిలో
నన్నా! కుమ్ములు మోయి! యా పిదప నీ
    వా శైవసిద్ధాంతమున్
విన్నాణంబుగ బోధసేయుచును బృ
    థ్వీమండలం బంతయున్
ఏన్నూ ఱేఁడులు సంచరింపవలె సు
    మ్మీ! గోచరత్వంబుతోన్. ౫౦

మ. శివమంత్రం బుపదేశ మిచ్చుచుఁ గడుం
జిత్తంబులన్ నాఁటుచున్
శివభక్తిన్ శివలింగధారణవిధుల్
సేయించుచు న్నెమ్మెయిన్
బవితంబై తగు నంగలింగముల సం
బంధంబు బోధించుచున్
భువినిన్ నిల్పుము నీ యశోధ్వజము స
మ్మోదంబునన్ రేణుకా! ౯౧

క. కావించి యీ మనుక్తము
శైవోద్ధరణంబు, సప్తశతవత్సరముల్
పావనమొనర్చి లోకము,
రావోయి! మదంతికంబుఁ గ్రమ్మఱ" ననియెన్. ౯౨

క. హరుఁ డిట్లానతి నీయఁగ
గురువర్యుండైన రేణుకుఁడు వలగొని యా
పరమేశ్వరునిఁ దదాజ్ఞను
శిరసా వహియించి వెడలె క్షితితలమునకున్. ౯౩

గీ. తల్లిదండ్రుల విడనాడి దత్తపుత్త్రిఁ
డాత్మబంధంబుఁ ద్రెంపంగ నలవిగాక
యాఁగునెదతోడఁ బరదేశ మేఁగునట్ల
రేణుకాచార్యవర్యుఁ డుర్వికిని వచ్చె. ౯౪

## — శ్రీ రేణుకాచార్యుల అవతారము. —

గీ. బ్రహ్మవిష్ణ్వింద్రలోకముల్ వరుస దాఁటి
ధ్రువపథ మతిక్రమించి సరోజబంధు
చంద్రలోకముల్ గతియించి సరవి దిగెను
రేణుకాచార్యవర్యుఁ డదృశ్యమూర్తి. ౫౫

మ. చెలువుం జిమ్మెడు నంగవంగములుఁ,
గాశ్మీరంబుఁ, బాంచాల కుం
తలముల్, ద్రావిడ కేరళంబులును, ద
త్తద్దేశముల్ కాంచుచుꣳ
సలుపꣳ సత్వర మా శశాంకధరు నా
జ్ఞం దా మనోవేగుఁడై
తెలుఁగుం దేశముఁ జొచ్చె నాతఁడు సుకృ
ద్బృందాశ్రియంబుం దగꣳ. ౫౬

క. కల వెచ్చటం ద్రినగములుఁ;
గలవు త్రిలింగములు నెందుఁ; గల వెయ్యెడఁ బె
క్కులు పుణ్యతీర్థములు; నా
తెలుంగునాఁ డెన్న బ్రహ్మదేవుని వశమే? ౫౭

గీ. పండు నెచ్చట బంగారు పంటనేల
పాల నిడు నెందు బానల కాలమంద;
నిత్యకల్యాణ మెయ్యెడ నెగడుఁ బ్రజకు;
నా త్రిలింగంబుభాగ్య మర్హ్యంబుగాదె? ౫౮

గీ. తెలుఁగుదేశంబుఁ జొచ్చి తదీయమైన
పుణ్యసంపత్తి కెదయందు మోద మొంది
తన్ను ధన్యచరిత్రుగాఁ దలఁచికొనుచుఁ
గొలనుపాక గవేషించుకొనుచు వచ్చె. ౫౯

ఆ. తెలుఁగునాటిచేతఁ గొలనుపాకపురంబొ?
కొలనుపాకచేతఁ దెలుఁగునాడొ?
అయ్యెఁ గీర్తనీయ మఖిలదేశంబుల
నీ రహస్య మెఱుఁగు నీశుఁ డొకఁడె. ౬౦

మ. అల సోమేశ్వరసత్కృపార్ఘరసమూ
హంబో? యనం బాఱు వం
కలతో, భక్తజనాళి కిడ్డ ఫలసం
ఘంబో? యనం దగ్గ స
త్ఫలబృందంబులఁ గ్రాలు వృక్షతతితోఁ
దత్క్షేత్రపార్శ్వంబు క
న్నులవిందుం గలిగించె రేణుకునకుం
స్తుత్యంబుగా నత్తఱిన్. ౬౧

క. తరుషండంబు శకుంత
స్వరముల సోమేశమహిమ స్తవియించెను నా
హరశరణుల చందంబునఁ
బరగుచు రేణుకుని మదికిఁ బ్రమదం బిడియెన్. ౬౨

క. గుడినుండి వచ్చుచుండిరి
గుడిఁ జొచ్చుచు నుండిరి త్రోసికొను చొండొరులన్
గడిఁదిగ నత్తఱి నిసుకయుఁ
బుడమిపయిన్ రాలనట్టి పొలుపున భక్తుల్ ౬౩

మ. వదనాద్యంగములందు విస్ఫుటముగా
భస్మత్రిపుండ్రాంకముల్
చదల న్నాగడపల్ వలెన్ వెలయ, వ్రే
లంగా గళంబందునన్
రుదురాకల్ పెనుపాముచుట్ట లన, నా
ర్యుల్ శైవు లశ్రాంతమున్
హృదిఁ బంచాక్షరమంత్రముం జదువుచు
న్నేతెంతు రచ్చోటికిన్. ౬౪

క. అల పాశుపతాగమవే
త్తలు పంచాచారరతులు ధార్మికు లగు వి
ప్రులు శంభో! హర! హర! యను
చొలుకంగా భక్తి వచ్చుచుండిరి గుడికిన్. ౬౫

గీ. చక్కని వినీతవేషభూషలు ధరించి
పూలుఁ బండ్లును బళ్ళెరంబుల వహించి
మూర్తిఁ గైకొన్నభక్తినాఁ బువ్వుఁబోండ్లు
చనుచు నుండిరి శంభుదర్శనముకొఱకు. ౬౬

క. కొలువంగా సోమేశ్వరు
విలాసిబృందంబుఁ గూడి వెల గడియింపన్
అల చుట్టముఁ బేరంటముఁ
గలిసినగతి వచ్చె వారకాంతాతతియున్ ౬౭

గీ. పిల్లనవ్వుల జిగిగుంపొ? మల్లెపూలొ?
కలికిచూపులొ? యవి నల్లకలువచాలొ?
గుబ్బలో? చెండ్లొ? యన్న తబ్బిబ్బుతోడ
విటులు నిల్చిరి పువ్వులావికలఁ గనుచు. ౬౮

సీ. గాయకుల్ శివకథాగానం బొనర్చుచుఁ
తలలూఁపి పరిజల కుత్సాహమొసఁగఁ
గవివరుల్ స్వరచిత శివపురాణంబులఁ
జదివి వైదికుల సమ్మదముపఱప
శివతత్త్వవేత్తలౌ సిద్ధులు లింగాంగ
సామరస్యముఁ దెల్ప జనవితతికి
బైలాటకాండ్రాడి మేలుగా శివలీల
లానందపఱప నాయామి మంది

గీ. పరితులు పరితముల బోధింప, వైశ్యవరులు
భస్మరుద్రాక్షలను భక్తిఁ బంచుచుండఁ
గొలనుపాకపురంబుఁ దాఁ జెలువు మిగిలె
నపుడు రెండవ శివలోక మని నుతింప. ౬౯

క. శతరుద్రింబుఁ బఠించుచు
సతితరముగ నెలుఁగు లెత్తి యార్యులు భూదే
వత లభిషేక మొనర్చుచు
శితికంఠుని గర్భగుడి వసించిరి బత్తిన్. 20

క. రమణులు గౌరీకల్యా
ణముపాటలు మధురకంఠనాదంబులతోఁ
బ్రిమయంగఁ గోకిలాబృం
దమొ? యని ప్రజ, పాడుచుండిరి తత్సమయమునన్.

గీ. ఆ మహోత్సవ సమయంబునందు మింట
వినఁబడియె నిట్లు మేఘగంభీర నాద
మాఁపి కోలాహలముఁ దైర్థికాళి యెల్లఁ
గరయుగము మోడ్చి చెవియొగ్గి కాంచుచుండ. ౨౧

క. "శివసద్యోజాతముఖో
ద్భవుఁ డగు రేణుకుఁడు ప్రమథతతినాథుఁ డిటన్
అవతారించెడు నిపు డీ
శివలింగమునుండి పుడమి శివములు వడయన్. 23

క. హరునికిఁ బిమ్మట నాతఁడు
హరునంతటివాఁడు భక్తులారా! మీరల్
చరితార్థుల రైతిరి; త
త్పరమపురుషు దర్శనంబు దగ నబ్బుటచేన్. 24



కొలనుపాక శ్రీ సోమేశ్వరలింగమునుండి

శ్రీ రేణుకాచార్యుల అవతారము

చ. రవి యుదయింపఁ జీకటుల,
రాసులు దొలకుఁ బాసిపోయి ది
జ్నివహము లెల్లఁ బొలుచు కర
ణిన్ భగవానుఁడు రేణుకార్యుఁ డు
ద్భవమగుడున్ సమస్త క్షమ
తంబు లడంగును రూపుమాసి యీ
భువిపయి వీరశైవమత
పున్ వెలుఁగుల్ పడు నింక దట్టమై.'' ౭౫

గీ. ఆ వియద్వాణి నెల్లవా రాలకించి
కన్ను లలిమోడ్చి మోడ్చియుఁ గరయుగంబు
"హర! మహాదేవ! శంభో! మహాత్మ! మమ్ము
నుద్ధరింపవె?" యని పల్కు చున్న వేళ. ౭౬

మ. రవికోటిద్యుతితోఁ ద్రినేత్రములతో
రాజిల్లు జూటంబుతో
స్తవనీయోజ్జ్వల భస్మపుండ్రములతో
దండంబుతో శాటితోఁ,
దవు రుద్రాక్షులతోఁ గమండలువుతోఁ,
దద్రేణుకాచార్యుఁ డు
ద్భవ మయ్యెన్ వరకుల్యపాకనగరిం
దల్లింగమధ్యంబునన్. ౭౭

క. మొరసెను సురదుందుభితతి;
కురిసెను సుమవృష్టి, వేల్పుకొమ్మల యాటల్
బొఱసెను, భక్తుల డెందము
విరిసెను దత్సమయమందుఁ బెద్దగ బళిరా! ౪౮

ఆ. వె. ప్రజ్వరిల్లె యాగవహ్నులు లెస్సగా
సమలదీప్తి నెసఁగె నాకసంబు
సకల దిక్కులును బ్రసన్నభావము నొందె
రేణుకుఁడు జనింప క్షోణియందు. ౪౯

క. కృతయుగ సహస్ర మిట్లా
కృతిఁ దాల్చెనో? యమృతరసము క్షితిపైని ఘనీ
కృతమయ్యెనో? యని భక్తులు
కుతూహలముతోడ రేణుకునిఁ గని రెలమిన్. ౫౦

క. తన చూపునఁ గనుదోయినిఁ,
దన పలుకుల వీనుదోయి, దాక్షిణ్యమునన్
మనమును ముంచుచు నమృతం
బున రేణుకుఁ డిట్లు భక్తముఖ్యుల కనియెన్. ౫౧

ఆ. వె. భక్తజనములార! పండెను మీపంట
ఈశ్వరుం డనుగ్రహించె మిమ్ముఁ
గొని తదాజ్ఞ వచ్చితిని వీరశైవంబు
నుద్ధరింపఁ దలఁచి యుర్వియందు. ౫౨

మ. శివపూజల్ పచరింపుడీ! తలఁపుఁడీ!
చిత్తంబునన్ నిత్యమున్
శివదేవున్, శివనామమున్ బలుకుఁడీ!
శీర్షంబులం దాల్పుఁడీ
శివనిర్మాల్యము; శైవధర్మము లను
ష్ఠింపుండి! సేవింపుఁడీ
శివయోగిప్రకరంబు; మీకు శివముల్
చేకూఱు నత్యంతమున్. ౮౩

క. ధరియింపుఁడు తల లింగము
శరీరమున భస్మపుండ్రజాలముఁ బంచా
క్షరిని జపింపుఁడు సతతం
బెఱుఁగుఁడు శివతత్త్వసార మిదె ధర్మ్య మగున్. ౮౪

ఆ. వె. అనుచు నానతిచ్చి యచట నష్టాదశ
వర్ణులకును ధర్మ పాలనార్థ
మాదరమున రేణుకాచార్యుఁ డుపదేశ
మిచ్చి చదలివీథి కెగిరిపోయె. ౮౫

— శ్రీరేణుకుఁ డగస్త్యునకు శివతత్త్వ ముపదేశించుట —

క. శిరసున నంజలిపుటముల
విరచించి కనంగ భక్తబృందము ప్రమథే
శ్వరుఁడైన రేణుకార్యుఁడు
దరిసెన మిడ నాయగస్త్యి దగ్గఱి కరిగెన్. ౮౬

మ. సెలయేళ్ళందు మునింగి నారమడుఁగుల్
చెల్వొప్పఁగాఁ దాల్చి మే
నులఁ గై సేసి విభూతిరేఖలను స్థా
ణుస్తోత్రముల్ పాడుచున్
ఫలమూలంబుల దర్భపుష్పముల సం
పాదించి యాచార్య దే
వుల కర్పించెడు శిష్యు లా గిరిపయిం
బొల్పొందుచుం దిప్పుదున్. ౭౭

క. ఫలములఁ గాయలఁ బత్త్రం
బుల జలములఁ గందమూలముల మెసవుచు నా
మలయాద్రియందు నుండిరి
పలువురు పాసరించుచుం దపస్సుఁ దపస్వుల్. ౭౮

క. పలువురు పంచాగ్నులలోఁ
బలువుం డొక్కకాలిమీఁదఁ బలువురు నిద్రా
దుల మాని సేయుచుండిరి
మలయాచలమందుఁ దపము మాన్యులు తపసుల్. ౭౯

క. ఒసఁగుచు హరిణములకు లేఁ
గసవులు చదువుచును వేదకాండంబుల దు
ర్వ్యసనములకు దవ్వుల ని
త్య సదాచారు లగు శిష్యు లలరుదు రందున్. ౮౦

క. నెలవలెఁ జుక్కలలోఁ, గ్రహ
ములలో రవివోలె, వేల్పుమొత్తములో నా
జలజాసను గతి నా శి
ష్యుల నడుమ నగస్త్యమౌని శోభిలుచుండెన్. ౯౧

క. తన కడకు వచ్చు రేణుక
గణనాథునిఁ గాంచి యా యగస్త్యమునియు నె
మ్మన మానందాంబుధిలో
మునుంగ నిట్లనియె శిష్యముఖ్యులతోడన్. ౯౨

క. మనపాలి భాగ్యదేవత
మన పూర్వతపఃఫలంబు, మాన్యుండు, త్రిలో
చనునాజ్ఞ నవతరించిన
ఘనుండు రేణుకుఁడు మనలకడ కరుదెంచెన్. ౯౩

మ. ధర నానాఁటికిఁ దీసికట్టగు త్రయీ
ధర్మంబులం గాంచి యే
డ్తెఱి లోకంబు సముద్ధరింపఁగ మహా
దేవుండు కారుణ్యసం
భరితాంతఃకరణుండు స్వీయవదన
ప్రాదుర్భవుం డైన యా
పరమశ్రేష్ఠుని రేణుకుం బుడమికిం
బంపెన్ సూఁడీ! యిత్తఱిన్. ౯౪

క. శివసద్యోజాతముఖో
ద్భవుఁ డీతఁడె! దుష్టపాపవారిదచయముం
దవులకుఁ ద్రోలు మహాబలుఁ
డవు ఝంఝానిలుఁ డితండె! యరయుఁడు మీరల్. ౯౫

క. క్షితినిం జార్వాకాదిక
మతముల శ్రుతిదూరములను మాయింపఁగ సు
స్థితముగను వీరశైవముఁ
బ్రతిష్ఠఁ గావింప వచ్చెఁ బ్రజ రక్షింపన్. ౯౬

మ. అవతారంబయి యీతఁ డా కొలనుపా
కాఖ్యంపు క్షేత్రంబునన్
శివలింగంబున, ధర్మముల్ గఱపుచున్
శిష్యాళికిన్, సంతతో
త్సవముల్ గూర్చుచు భూమికిం దనదు పా
దన్యాసమాత్రంబునన్
స్తవనీయుండయి వచ్చు చుండె నిదె య
స్మత్పుణ్యపాకం బనన్. ౯౭

క. ననుఁబోలు పరమధన్యులు
ననుఁబోని నితాంతపావనచరిత్రులిలన్
ననుఁబోలు తాపసేంద్రులు
కనఁబడ రను మాట నిజముగాదే తలఁపన్? ౯౮

క. ఇతనిం బూజించుట నా
శితికంఠుని భక్తిఁ బూజ సేయుటయ యగుఁగా
ఇతఁ డాత్మ సంతసిల్లిన
శితికంఠుం డాత్మ సంతసిల్లు నిజముగాఁ. ౯౯

క. అని భాషించు చగస్త్యుఁడు
తన శిష్యులతోడ లేచి తత్పరమతి నా
వినువీథినుండి డిగియెడు
ఘను రేణుకు నెదురుకొనఁగఁ గడఁగెఁ వడిగాఁ. ౧౦౦

క. డిగుచున్న వేవెలుం గన
ధగధగల వెలుంగు చున్న తనుదీప్తులతో
భగవంతుఁడు రేణుకముని
యగస్త్యుడాపునను డిగె జయధ్వను లెసఁగఁ. ౧౦౧

గీ. ఆ యగస్త్యుడు లర్ఘ్యపాద్యముల నొసఁగి
పఱచి దర్భాసనంబు దైవమును బోలె
వలగొనియుఁ బెద్దభక్తిఁ జూపంగ నతఁడు
వారల ననుగ్రహించుచుఁ బలికె నిట్లు. ౧౦౨

చ. వ్రతపము సాగుచున్నదె? త
పోధనులార! నిరంతరాయమై;
అతిథిసపర్య లెప్పటికి
యం జరుగుం గద? చెల్లు చుండెనే

శ్రుతితతిపాఠనంబులును?
శూలిసమర్చన సేయు చుందురే
సతతము మీరు? లేదు గద
తాస్థలి వైదికధర్మహానియున్? ౧౦౩

క. వెలుఁగునె చక్కఁగఁ దేరితా
గ్నులు? దండిగఁ బూలుఁబం డ్లనోకహషండం
బులు కాచునె? నిర్మలజల
ముల నిడునే? మీ సరస్సమూహం బిచటన్. ౧౦౪

క. భవదాశ్రిమ మాశ్రియముగ
నివసించెడు జంతువితతి నిరతంబు మహో
త్సవములఁ దేలుచు నున్నవె?
లవలేశంబేని కొఱఁతలం గొన కెడఁదన్? ౧౦౫

ఉ. అని పృచ్ఛింపఁగ రేణుకోత్తముఁ; డగ
స్త్యర్షీందుఁ డిట్లాడె నో
మునినాథా! కల దొక్క నీ యెఱుకకున్
బుద్ధంబుగా నట్టి దీ
వనలాతాననసంభవుండవు; తప
స్స్వామూర్తి; వే మెల్ల నీ
యనుకంపన్ సుఖమున్నవారలము దే
వా! లేక యే లోపమున్. ౧౦౬

క. తమ దర్శనమున మే మై
తిమి పుణ్యుల; మీర లేగుదెంచుటకు నిదా
నముఁ దెల్పి భవదనుగ్రహ
సమాదరణపాత్రములుగఁ జలుపుము దేవా! ౧౦౭

ఆ. అని వచింప నంత నాచార్య రేణుకుం
డాస్యమందు హాస మంకురింపఁ
గాంచు చున్న యా యగస్త్యాదులకు నుప్ప
తిల్లఁ గౌతుకంబు దెలిపె నిట్లు. ౧౦౮

ఆ. వె. జ్ఞాననేత్రమునను సర్వంబుఁ గను నీకు
దెలియరాని దెద్ది గలదు పుడమిఁ?
బరగఁ దప్పవచ్చుఁ బ్రత్యక్షదృష్టి; తా
జ్ఞానదృష్టి కున్నె చాటొకండు? ౧౦౯

క. నీ మహిమ లెవ రెఱుంగరు?
భూమినిఁ ద్రౌణిఁ గాదు నోర్కొ పూర్ణఘటము? స
త్త్రోమమున మేలుబంతివి
వ్యామోహవిదూరచిత్తుఁ డౌదు వగస్త్య! ౧౧౦

క. అరికట్టి సూర్యచంద్రుల
తెరువుం గడుఁ గొలఁదిఁ గడచి దిట్టతనమునన్
బెరిగెడి వింజం బాఁకిడి
పరిరక్షించితివి నీవ ప్రజ లెల్లరినిన్. ౧౧౧

చ. పొనరఁగ నశ్వమేధ శత
మ్ముం బొనరించి, సురాధిపత్యముం
గొని కడుఁ గ్రొవ్వి యింద్రు సతిఁ
గోరి మహర్షులమూఁపు లెక్క, వే
చనుచును "సర్పసర్ప"యను
జాల్మని నా నహుషావనీంద్రు నీ
వొనరిచి పెద్ద సర్పముగ
నొయ్యన నవ్విధి బుద్ధిఁ జెప్పవే? ౧౧౨

మ. అతిమర్యాదగ బ్రాహ్మణోత్తముల నా
హ్వానించి రప్పించి, పూ
జితులం జేసియు, విందొనర్చి యుదర
చ్ఛేదంబుఁ గావించి త
న్మృతమాంసాదుల మెక్కు దుర్జనుల భ్రా
తృద్వంద్వముం జంపి యీ
క్షితికిం బందు వొనర్చినట్టి కరుణా
సింధుండ వీ వారయన్. ౧౧౩

చ. జలముల డాఁగి లోకులకు
సంకటముల్ గలిగించు క్రూర దై
త్యుల వెలలించి వెల్పటికిఁ
ద్రుంపఁగఁ జాలక నిన్ను వేఁడ వే



శ్రీ రేణుకాచార్యులు అగస్త్యమహర్షులకు

శివతత్త్వము నుపదేశించుట

ల్పులగమి, సప్తవార్ధు లల
వోఁకను బుక్కిటఁ బట్టవే మునీ!
కలరె భవాదృశుల్? నిజము
గా నినుఁ బోలుదు వీవె యిద్ధరన్. ౧౧౪

క. నినుఁ బోలిన శివభక్తుఁడు
నినుఁ బోలిన బల్లిదుండు, నినుఁ బోలిన స
న్మునిరాజుఁ ద్రిభువనంబులఁ
గనవచ్చునె యెన్ని సార్లు గాలించినను. ౧౧౫

ఆ. కాన నీకు నలవిగాని దే మున్నది?
ఎఱుఁగరాని విషయ మెందుఁ గలదు?
అయిన విస్తరించి నాలించి నామాట
శ్రద్ధఁ బూని నీవు సలుపు మయ్య! ౧౧౬

క. గురుసత్కటాక్షమున నె
వ్వారు తత్త్వజ్ఞాన మొంది వర్తిలుదురో యు
ప్పరమపవిత్రులె ధన్యులు
ధర గురువును గడచినట్టి దైవము గలఁడే? ౧౧౭

గీ. వసుధ యోగంబు సాంఖ్యంబు పాశుపతము
పాంచరాత్రంబు వేదం బటంచుఁ గలవు
పంచమతములు; శైవంబు వానియందు
శ్రౌతసిద్ధాంతమయమై ప్రశస్తిఁ గాంచు. ౧౧౮

గీ. తనరు నా శైవమున వామ దక్షిణములు
మిశ్రి సిద్ధాంతము లటంచు మెఱయు నాల్గు
శాఖ; లం ద్వైదవది మహేశ్వరముఖోక్త
కామికాద్యాగమములకుఁ గన్నతల్లి. ౧౯

క. క్రమముగ జీవబ్రహ్మై
క్యము బోధించును మనోజ్ఞగతి సిద్ధాంతా
గమ మదయె శివాగమ సా
ర మదే లింగాంగసామరస్యము తలఁపఁగ. ౧౨౦

క. లింగం బధికశివాంశం;
బంగము న్యూనాంశ మందు రార్యులు; కానన్
లింగంబే బ్రహ్మం బగు;
నంగంబే జీవుఁ డగు యథార్థం బరయన్. ౧౨౧

గీ. పరగు చుండు నిష్ట ప్రాణ భావలింగ
భేదముల లింగ మిట్లు ముప్విధము లగుచు;
నంగమును ద్యాగ భోగ యోగాంగము లని
పలుకుదురు శైవతంత్రిప్రపంచవిదులు. ౧౨౨

క. అల యిష్టలింగమాచా
రలింగ గురులింగము లని కార్యిలును రెండై
తెలిసికొని దీనిఁ బడయుం
గలుగు సుఁడీ! ముక్తి భక్తకాండం బెల్లన్. ౧౨౩

గీ. ప్రాణలింగంబు శివలింగమనియు మఱి జై
లంగు చుండును జంగమలింగ మనియు;
భావలింగంబుఁ బైద్రాసివలెఁ బ్రసాద
లింగ మనియును దగు మహాలింగ మనియు. ౧౩౪

గీ. భక్తము మహేశ మంచు నొప్పారు చుండు
నసుధఁ ద్యాగాంగము; ప్రసాది ప్రాణలింగి
యనుచు భోగాంగ మమరు; యోగాంగ మొప్పు
శరణ మని యైక్యమని రెండు తెఱఁగు లొంది. ౧౩౫.

గీ. ఈ షడంగంబులను వచియింతుర్రి బుధులు
షట్స్థలంబు లటంచు; నీ సరణిఁ బట్టి
సంసృతిక్లేశములఁ బాసి శాంతి నొంది
యాత్మసాక్షాత్కృతిం జనుం డందుఁ దుదిని. ౧౩౬.

గీ. పడయు భక్తస్థలంబున భక్తివిజయ;
మా మహేశస్థలంబున నడఁగుఁ గర్మ;
తేజరిలు జ్ఞాన మా ప్రసాదిస్థలమునఁ;
గెరలుఁ దత్త్వేచ్ఛ ప్రాణిలింగిస్థలమున. ౧౩౭

క. దురహంకారము లయ మగు
శరణస్థలమందుఁ; దోఁచు సాక్షాత్పరమే
శ్వరుఁ డైక్యస్థలమున; మన
కటిదియ పొగడంగఁ దచ్చిదానందవపుః. ౧౩౮

క. తెలిసికొను నెవ్వఁ డీ షట్
స్థలముల తత్త్వం బతండు సాధించును ని
ట్టలముగ మోక్షనిధానం;
బిల దీనినిఁ బోలు ధర్మ మెందుం గలదే! ౧౨౯

గీ. భూమిసలిలాగ్నిమారుతవ్యోమనామ
పంచభూతంబు లాత్మయు నంచితముగఁ
బొందు భక్తాదిషట్స్థలంబుల లయంబు
నవియు నాచారలింగాదు లం దడంగు. ౧౩౦

గీ. నాసయయి, జిహ్వయయి, లోచనంబునందు,
వాక్కునం, గర్ణమునయందు, స్వాంతమందు
నిలిచి యాచారలింగాదు లిల గ్రహించు
గంధముఖ్యగుణంబులఁ గ్రమికవృత్తి. ౧౩౧

గీ. తప్ప కాచారలింగ మంతమునయందు
నడఁగు గురులింగమందు; న య్యది లయించు
నమలశివలింగమున; నద్ది యడఁగి పోవు
నల్ల జంగమలింగంబునందుఁ దలఁప. ౧౩౨

ఆ. అది ప్రసాదిలింగమందు, మహాలింగ
మందు నా ప్రసాది, యదియుఁ దుదికి
గలిసి పోవు సుమ్మ! ఘనలింగమందు; లిం
గాంగసామరస్య మన్న నిదియె. ౧౩౩

క. ఏతద్రహస్య మెఱిఁగిన
యా తాపసవరులు ముక్తి నందుదురు సుమీ!
ఖ్యాతిగ నాత్మజ్ఞానముఁ
బ్రీతిగ లింగైక్య మన్న వసుధ నిదె సుమీ! ౧౩౪

క. నలువదినాల్గీ యంగ
స్థలభేదము; లేఁబదేఁడు తనరును లింగ
స్థలభేదము; లీ నూటొక
టిలఁ దెలిసిన బంధముక్తి యెసఁగు జనులకున్. ౧౩౫

క. ఇదియే వేదరహస్యం;
బిది భవరోగౌషధంబు; నిన తేజం బి
య్యది యజ్ఞానాంధ్యమునకు;
నిది శైవులభాగ్య మనుచు నిలకుఁ గఱపుమీ! ౧౩౬

క. అని యిట్లుపదేశంబును
ఘనుండు రేణుకుఁ డొసఁగి యగస్తికి, వారల్
కనుఁగొన "జై పరమేశ్వర!''
యని తలఁచు చదృశ్యుఁ డయ్యె నంబరసీమన్. ౧౩౭

ఆ. ఆ యగస్త్యమౌని యాత్మయం దత్తఱి
వేయిమంది రవులు వెలిఁగినట్లు
పెక్కుకోట్ల చంద్రు లొక్కమా రుదయించి
నట్టు లయ్యె; నిది మహాద్భుతంబు. ౧౩౮

ప్రథమాశ్వాసము సమాప్తము.

---

# రే ణు క వి జ య ము

## ద్వి తీ యా శ్వా స ము

### రేణుకుఁడు విభీషణుని ప్రార్థనానుసారము త్రికోటిలింగముల స్థా పిం చు ట

గీ. అనఘుఁడా రేణుకుఁడు మలయాద్రినడుమఁ
బాఱు భద్రాతరంగిణీతీరమందు
నలరు రంభాపురంబునం దవతరించి
వీరసింహాసనముఁ గాంచి వెడలె నచటు. ౧

క. అతఁ డంతఁ గాంచె డాపున
క్షితిఁ దాల్చిన నీలిపట్టుచీరపడువున్
గుతుకంబుఁ గూర్చు తదపాం
పతి సితఫేనములఁ గ్రిక్కు భంగవితతితోన్. ౨

క. సిరి కూఁతురు, హరి యల్లుఁడు,
సరోజశాత్రవుఁడు కొడుకు, స్వయముగ రత్నా
కరుఁడును మైనాకాభయ
శరణ్యుఁ డా సాగరుండు స్తవనీయుఁ డగున్. ౩

శా. ఆ వారాన్నిధి ప్రాంతమందె తొలి మా
ర్తాండాన్వయాంభోధికిన్
రేవన్గై తగు రాముఁ డా జనక
పుత్రీప్రాప్తికై పూని యా
దేవారిం దశకంధరుం దునిమి త
త్తీరంబునం, బాపముల్
పోవన్ సైకతలింగముం నిలిపి సం
పూజించె భక్త్యాఢ్యుఁడై. ౪

శా. ఆ రామేశ్వరలింగదైవతము మో
క్షాశాపరిపూర్ణాత్ములై
యారాధింపఁగ దాలనుండియును భ
క్తౌఘంబు విచ్చేయు; నా
పే రుచ్చారణముం బొనర్చినను, ద
ద్బృందారకశ్రేష్ఠుఁ గ
న్నారం గాంచినఁ బాయు గాడ్పునకుఁ గా
రాకుల్ వలెం బాపముల్. ౫

క. సురసిద్ధ సాధ్యవిద్యా
ధరకిన్నర సంచయంబు తద్దయు భక్తిన్
దరిసింప వత్తురి రామే
శ్వరలింగముఁ బొగడఁ దరమె సరవిం దానిన్. ౬

మ. అతఁ డా సైకతలింగముం గని సప
ర్యల్ సేసి యం దున్న భ
క్తతతిన్ సత్కరుణాకటాక్షములచే
తం బిట్టు మన్నించు చ
ప్రతిమానంబుగ రాముచేత మును ని
ర్మాణింపఁగాఁ బడ్డదై
కుతుకశ్రీని ఘటించు సేతువును గ
న్గొంచుం జనెన్ లంకకున్. ౭

శా. ముల్లోకంబులు వేని పే ర్విని భయం
బుం బొంది క్షోభిల్లెనో?
తల్లిం బోలిన తన్విపై వలపుచే
తన్ స్వీయరక్షఃకులం
బెల్లన్ భస్మ మొనర్చె నెవ్వఁడు? దిశా
ధీశాగ్రిణుల్ కాయు చుం
డెల్ల ప్డెవ్వని ద్వార, మా దశముఖుం
డేలెం దగం దత్పురిన్. ౮

మ. తన సోదర్యుని కోర్కె యెట్లు సఫల
త్వం బొందునో? యెట్లు క
ల్గునో యయ్యాశ ననుగ్రహం బనుచుఁ గూ
ర్కుల్ మాని రేయుంబవల్

ఘనభక్తిఁ శివపూజలం జలుపు భ
క్తగ్రామణిఁ శ్రీవిభీ
షణు చింతల్ హరియింప రేణుకుఁడు ప్రా
చార్యుం డటం దా డిగెన్. ౯

క. తలవని తలంపుగాఁ దన
నిలయంబున వెలసి యున్న నిధి రేణుకునిన్
ఎలమిఁ గని విభీషణుఁ డెదఁ
దలఁచెను ఫలియించెఁ దనదు తప మనుచుఁ గడున్. ౧౦

చ. కని యెదురేఁగి రేణుకుని
కాళ్ళపయిం బడి బత్తి నవ్విభీ
షణుఁ డిడి యర్ఘ్యపాద్యముల
స్వామి! కృతార్థుఁడ నైతి మీదు ద
ర్శనమున; నేఁడు పుణ్యదివ
సంబు; జయం బగుఁ గాత నీకుఁ; బా
వన మొనరింపు మయ్య గురు
వర్య! మదీయగృహంబు నిత్తఱిన్. ౧౧

క. విజయంచేయుము దేవా!
భజియింతు; గుహుంపు దక్క భక్త వితతికిన్
నిజముగను లేఁదు పెఱ వే
ల్పు జగంబునఁ దేలిచినను ముంచిన నతఁడే! ౧౨

గీ. అని విభీషణుఁ డాడంగ నాత్మయందు
రేణుకాచార్యవర్యుండు ప్రీతి నొంది
తద్గృహంబున కరిగి తద్దత్తపూజ
లాదరపురస్సరంబుగా నందికొనియు. ౧౩

ఉ. "మెచ్చితి నీదు పూజలకు;
మెచ్చితి నీమహనీయభక్తికిన్;
మెచ్చితి నీదు మన్ననకు;
మెచ్చితి నీ దగు సచ్చరిత్రకున్;
ఇచ్చకు వచ్చినట్టి వర
మిచ్చెదఁ గోరు" మటంచు నొయ్యనన్
బొచ్చెములేని కూర్మి గణ
ముఖ్యుఁడు రేణుకుఁ డాడె వెండియున్. ౧౪

చ. అనుఁడు విభీషణుండు విన
యంబునఁ బల్కెను "దేశికోత్తమా!
ఘనుఁడు మదగ్రజుండు త్రిజ
గంబుల గెల్చి సురాసురాళిచే
తను బరిచర్యలం గొనె; న
తండు మహేశ్వర భక్తవర్యుఁ డా
యన శివపూజసేయ కెపు
డానఁడు నీరు, భుజింపఁ డన్నమున్. ౧౫

మ. మును కాకుత్థ్సకులోద్భవుం డయిన రా
ముం డా ధరాజాతతో
డను దమ్ముం డగు నార్యలక్ష్మణునితో
డం బూని పిత్రాజ్ఞనున్
వనమందుండఁ ద్రిలోకమాత యగు నా
వైదేహిసౌందర్యమున్
విని వంచించియు విప్రవేషమున నా
పెన్ ముచ్చిలెన్ దుష్టుఁడై. ౧౬

చ. తెలిసి రఘూత్తముం డది ప్ర
దీప్తదవానలుఁడై కపీంద్రసే
నలఁ గొని వెంట సేతురచ
నం బొనరించి, మహాబ్ధి దాటి య
గ్గల మగు బల్మి రాక్షసని
కాయము నూఱిచి నుగ్గునూచగా
బలిగొనె నాదు సోదరునిఁ
బంక్తిగళుం దన ఖడ్గధారకున్. ౧౭

మ. నను నాహ్వాన మొనర్చి, యన్న తన ప్రా
ణంబుల్ విసర్జించు వే
ళను మీఁదం జెయివైచి పల్కె నిటు మె
ల్లన్ "నేఁ బ్రతిష్ఠించి యుం

టిని లింగంబుల నాఱుకోట్లను; దిక్కో
టిన్ వే ప్రతిష్ఠించి కీ
ర్తినిఁ గైకొమ్ము! మదీయవాంఛితము సి
ద్ధిం గూర్పుమీ! తమ్ముఁడా.” ౧౮

ఆ. అని వచింప దాని నాలించి సే నంటి
“నీదు పేరుమీఁద నిలుపఁగలను
భువిని విష్ణుదేవు నవకోటి మూర్తులఁ
బరమగతికి నిన్నుఁ బనుచువాఁడ”. ౧౯

మ. అనుదుక్ రావణుఁ డిట్లు తాఁ బలికె ము
న్నా వేదముల్ దొంగిలిం
చిన క్రూరాత్ముని సోమకాసురుని ను
చ్ఛేదింప మత్స్యాకృతిం
గొని సంద్రంబు గలంచినట్టి హరియుం
గొల్చెక్ సుమీ! యిందుఁ బో
ల్చిన మత్స్యేశ్వర లింగముక్ సురతతి
శ్రేష్ఠుండు శంభుండె పో! ౨౦

క. కానం “గా”దని పల్కక
పూనుము ముక్కోటి లింగముల నిలుపఁగ స
మ్మానింపు నాదు కోర్కిని
నేను గృతార్థుండ నగుదు నిష్కల్మషుఁడక్. ౨౧

క. అని తన కోరికి తీఱమి
కిని నాపై నమ్మకం బొగిం దలుగమిన్
వనరుచు శివునిం దలఁచుచుఁ
దన ప్రాణంబులను వదలెఁ దగ ననుఁ గనుచున్. ౨౨

ఉ. ఈ మహనీయకార్య "మిద మిత్థ"
మటంచు రచింపఁ జేతగా
కేమియుఁ దోఁచ కేఁగితి సు
మీ! జనకుం డగు విశ్రవోముని
స్వామినిఁ జూడ? వేడితిని
భ్రాతృమనోరథసిద్ధ్యుపాయమున్
ఆ ముని నన్నుఁ గాంచి దర
హాసముఖుం డయి యాడె నీ గతిన్. ౨౩

మ. "వెతలం బొందఁగ నేల యిట్లు వితగాఁ
బెంపేది యో పుత్ర! స
మ్మతి లంకాపురమందు నెక్కొనిన శ్రీ
మత్స్యేశ్వరస్వామి న
ర్చితుఁ గావింపుము; తత్కృపాబలమునన్
సిద్ధించుఁ బో? నీ యభీ
ప్సిత" మంచుం దయనేసి దీవనలు పం
పె న్నన్ను స్నేహంబుతోన్. ౨౪

క. ఏను దదాజ్ఞను గైకొని
మానుగ నర్చించుచుండ మత్స్యేశ్వరునిం
దైనందిన మొకదినమునఁ
గానంబడె నీశ్వరుండు కలలో నాకున్. ౨౬

చ. కనఁబడి భక్తిపేర్మిఁ దన
కాళుల వ్రాలిన నన్నుఁ గాంచి యా
యన యనె "వత్స! చింతిలకు
మాత్మను గొండొక నాళ్ళ కిందు వ
చ్చును సుమి! మన్ముఖోద్భవుఁడు
సూరివరేణ్యుఁడు రేణుకార్యుఁ; డా
తని శరణొందు మయ్య! ఫలి
తం బగు నీ హృదయేప్సితం బొగిన్". ౨౭

క. అని యంతర్ధానముఁ బొం
దెను; నే నా దినమునుండి దేవర! మీ ద
ర్శనమున కువ్విళ్లూరుచు
క్షణ మొక యుగముగను దండ్రి! కడపుచు నుంటిన్. ౨౮

క. దయ గలిగెనె? యీ భక్తుని
పయి నిన్నాళులకు దేవ! వచ్చితి వికనా
ప్రియసోదరుని యభీష్టము
క్రియాకృతినిఁ దాల్చు; నగుదుఁ గృతకృత్యుండన్. ౨౯

శా. దేవా! నిన్నెటు సత్కరింపఁగల? నాతిథ్యంబు నీ కెవ్విధిన్
గావింపం గల? నెట్లు నీవు దయతోఁ జాతుర్విధనై యుండెదర్
శ్రీవిశ్వేశముఖోద్భవుండ వగు నీ శ్రేష్ఠత్వమున్ నీ మహా
పావిత్ర్యంబును మూర్ఖచిత్తుఁ డగు నే వర్ణింప శక్తుండనే! ౨౯

క. కొండంత దేవరకు నిలఁ
గొండంతటి పత్రి గల దొకో? నామెద నో
క్కండే నీ కర్పింతును
నిండు దయన్ స్వీకరింపు నీవు మహాత్మా! ౩౦

మ. ఇది నాభాగ్యమొ? నీ దయామహిమమో? యేఁ జేయు సత్కర్మమో?
మది నూహింపఁగ నీదు ధర్మమొ? గురూ! మాయింటికే తెంచి పె
న్మదముం గూర్చితి; వయ్యె నాగృహము సంపూతంబు; నా జన్మముం
బొదలెన్ ధన్యతరంబుగా; నెవఁడు నన్ బోలంగఁ జాలున్ ధరన్? ౩౧

మ. అనుడుఁ రేణుకుఁ డాస్యపద్మమున హా
సాంకూరముల్ తోఁప ని
ట్లనె నోయీ! యిది యీశుపత్సలత; సు
మ్మావంక వీక్షింపు; మొ
య్యన ముక్కోటిమహేశలింగములు దృ
శ్యం బయ్యెఁ నీదు పూ
జనముల్ గాంచి యిఁకఁ భయం బుడుగుమా!
స్వాంతంబునం దంచనెఁ. ౩౨

మ. కనులం ద్రిప్పి విభీషణుండు కనఁగాఁ
గాన్పించి రచ్చోటడా
పున రమ్యంబుగ సంప్రతిష్ఠితములై
ముక్కోటిలింగంబు, లా
ఘనలింగంబులఁ బూజ సేయు తన యా
కారంబు, లవ్వాని ముం
దున నాచార్యక మాచరించెడు మహా
త్ముల్ రేణుకాచార్యులుఁ. ౩౩

క. కని యచ్చెరువడు చుండఁగ
ననె రేణుకుఁ డో విభీషణా! విస్మయముం
గొన నేల? శివుఁడు భక్తుల
ననుగ్రహము సేయు నిట్టి వగు చందములఁ. ౩౪



శ్రీ రేణుకాచార్యులు విభీషణుని ప్రార్థనానుసారముగ
ముక్కోటిగురు రూపముతో ముక్కోటిలింగముల స్థాపించుట

క. తెలియుమి! యీ షట్స్థలముల
నల పంచాచారవిధుల నష్టావరణం
బుల నిది శివసిద్ధాంతము
కలదే? యిల దీనిమీఁదఁ గల మత మొకఁడున్. 35

క. శివభక్తిసుఫల నీ వీ
భువి జనులకుఁ బంచియిమ్ము! పుణ్యాఘనులలోఁ
బ్రవరుఁడవు కమ్ము! నీ వా
రవితారకకీర్తిఁ గాంచి శ్రాలుదు వంచున్. 36

గీ. ఆ విభీషణు హృదయార్తి నడఁగఁ జేసి
రేణుకార్యుండు దీవించి ప్రీతి నతని
నా మహేశ్వరు ధ్యానించు చాత్మయందు
భావికార్యంబు లూహించి బయలు వెడలె. 37

—। శ్రీరేణుకుని కాశీక్షేత్ర యాత్ర; శ్రీవిశ్వారాధ్యదర్శనము ।—

క. తన నామధేయమును యో
జనశతమందుండియేని స్మరియించెను త
జ్జనపాప మడఁచు బహుపా
వని గంగకు సరి గలదె ప్రపంచమునందున్. 38

మ. హరుఁ డీ గంగను నెత్తి నుంచుకొనె మో
హావిష్టుఁడై యంచుఁ గొం
దఱు, భూభాగ మడంగకుండఁ గరుణా
ర్ద్రస్వాంతుఁడై తాలిచెః

శిరమం దంచును గొంద ఱాడుదురు కా
నీ దాని పూతత్వముం
బరిశీలించి తనుం బవిత్రునిగ న
ల్పం దాల్చె నం చెంచెదర్. ౩౯

మ. తన నామంబె యడంచుచోఁ గలుషముల్
తన్నీరపానంబుచే
తను, తద్వారికణాళిసిక్త మగు ప్రాం
తంబందు వాసించుటల్
దనలో ముస్గుటఁ జేసి మెట్టి దగు పు
ణ్యం బబ్బునో! తెల్ప నె
వ్వనికిన్ శక్యము? గంగ దాని మెఱుఁగుల్
స్వప్రాభవౌన్నత్యముల్. ౪౦

క. ధరియించి త్రిమూర్తిత్వముఁ
బఱచుచు నా స్వర్గమర్త్యపాతాళములం
బరిపూతం బొనరించెడి
తరంగిణి మఱొకఁ డున్నె తన్నది వెలిగా? ౪౧

క. ఆ మందాకిని పాఱిన
యామూలాగ్రంబు తీర మతిపావన మా
భూమిఁ గల పురులఁ "బూసల
లో మేరువు" నాఁగ భాసిలును గాశి తగన్. ౪౨

క. "చనియెదఁ గాశీపురమున"
కని పల్కిన, "చని వసింతు నఁట నే'' నన్నున్
గొనునఁట కాశీస్థితిఫల
మును నీక నా వారణాసిఁ బొగడం దరమే? ౪౩

శా. ఆ కాశీనగరంబునన్ హరుఁడు భ
క్తానుగ్రహార్థంబుగా
నాకోటీందురవిప్రకాశ ముపసం
హారంబుఁ గావించి వ్య
క్తాకారంబు వహించి నేత్రముల కా
హ్లాదంబు సంధించుచున్
బ్రాకారం బయి తానె యెల్లరికి సం
రక్షించు చుండుం జుఁడీ. ౪౪

మ. నుదుటం దాల్చి కృశానునిం గలుషసం
దోహంబు భస్మీకరిం
పఁ దలం జంద్రు ధరించి య య్యమృతముం
బంచీయఁగా మేనియం
దదుకంజేసి లతాంగి నైహికసుఖా
హ్లాదప్రదానార్థమై
ముదముం గూర్చుచుఁ గావ లోకముల శం
భుం డుండు నా కాశిలోన్. ౪౫

గీ. కాశియం దొక్కఁ లతయు నొక్కఁడు తరువు
నాలుమగ లయి వర్తించు నచ్చెరువుగ
సతి యపర్ణఁట! నాథుండు స్థాణువంట;
ఇత్తురఁట వాంఛితఫలాళి నెల్లతఱుల. ౪౬

క. పడి సంసారార్ణవమున
నడుగువఱకు మునిఁగి తేలు చాఘాతములన్
బడలిన వారికి నీశ్వరుఁ
డుడుపంబై దగ్గఱించి యూఁత నొసంగున్. ౪౭

మ. అల విశ్వేశముఖోద్భవుం డయిన వి
శ్వారాధ్యుఁ డన్ పేరి మా
నిలలాముం డట స్కందగోత్రపతి యుం
డెన్ జ్ఞానసింహాసనం
బెలమిం బొంది; యతండె శంకరుని ది
వ్యైశానవక్త్రోత్థుఁడై
తొలి జన్మంబునఁ గాశిలో నాతని మహా
త్మ్యం దెల్పఁగా శక్యమే? ౪౮

క. ఆ మహనీయుని యాశ్రమ
సీమంబున శైవతత్త్వజిజ్ఞాసువు లు
ద్దామ తపోధను లైన మ
హామునులు వసించు చుందు రతనిఁ గొలుచుచున్. ౪౯

క. సుమనోవర్యులుఁ బురుషో
త్తములుం జతురాస్యులెల్ల తత్రత్యులు; పు
ణ్యామునకు నిధాన మా యా
శ్రమ మది పొగడంగ రాదు చక్రికినైనన్. ౫౦

క. తన దర్శనంబుచే నా
యన, యాయన దర్శనమున నానందంబుం
గొనఁగాఁ దానును రేణుక
ముని విశ్వారాధ్యుకడకుఁ బోయెం బ్రీతిన్ ౫౧

క. అహమహమికతో శిష్యులు
బహూకరింపంగ నర్ఘ్యపాద్యంబులతో
మహితుఁడు విశ్వారాధ్యుఁడు
స్పృహణీయప్రతిభుఁడైన రేణుకుఁ గొలిచెన్. ౫౨

చ. ఇరువురుఁ బూర్ణకామనుల;
యిర్వురు శర్వముఖప్రభూతు; లి
ర్వురు మునిచంద్రు లిర్వురును
బూజ్యుల; యిర్వురు లోకకంటకో
ద్ధరణనితాంతదీక్షితుల;
తథ్యము రత్నము రత్నముం బలెన్
స్ఫురదురుశోభలన్ వెలుఁగు
చుం గనుపట్టిరి వారల తత్రిన్. ౫౩

క. వినయంబు విధేయతయును
గనంబఱచు కొనుచు వా రొకరి కొక్కరు పూ
జనములను సలుపుకొను చా
మనస్వియుగళంబు సర్వమాన్యం బయ్యెన్. ౫౪

—॥ మహర్షులకుఁ గేదారలింగమహిమ నెఱింగించుట ॥—

క. అన్యోన్యంబు దలంచిరి
ధన్యత్వము సంభవించెఁ దమ కని; యంతన్
మాన్యుఁడు రేణుకుఁ డేఁగె హి
మాన్యద్రికి నచటి మానిమండలిఁ గాంచన్. ౫౫

క. మునినాథుం డగు రేణుకుఁ
గని పాదాబ్జముల కెరగి కడు బత్తిని శూ
లినిఁ బోలెఁ బూజ సేసిరి
మనోంబుజసహస్రికమున మాన్యులు వారల్. ౫౬

మ. తనివిం బొంది తదీయపూజలకుఁ జి
త్తం బందు శ్రీ రేణుకుం
డనె నిట్లో శివభక్తులార! భవదీ
యంబైన సద్భక్తికిన్
అనలాక్షుం డెదమెచ్చి మీకు శివసి
ద్ధాంతంబు బోధింపఁగా
ననుఁబంపెన్ భవదంతికంబునకు వి
న్నాణంబుగా నిత్తఱిన్. ౫౭

క. మఱువకుఁడీ ! శివనామముఁ
బరిత్యజింపకుఁడి ! యా శివధ్యానంబున్
దఱియకుఁడీ ! నాస్తికులను
మఱియుం దెగడకుఁడు ! వీరమాహేశ్వరులున్. ౯౮

క. శివపూజలు గావింపుఁడు
శివునిన్ నుతియింపుఁ డెపుడు; శివునిన్ రేయుం
బవలుం బాడుఁడు; వేఁడుఁడు;
శివతత్త్వముఁ జాటుఁ డెల్ల క్షితిమండలిలోన్. ౯౯

క. ఎవ రాస్తిక్యపథంబునఁ
బ్రవర్తిలుచు నుంద్రో! వారె పడయుదురు సుఁడీ
శివుని యనుగ్రహమును; మీ
రవనిం జాటుండు శివుని యా యా మహిమల్." ౧౦౦

చ. అను గురువాక్యమున్ విని మ
హాముసులెల్లరు హర్షమొంది, యా
తని పదపద్మయుగ్మమును
దాఁకుచు బత్తిని మోఁకరిల్లి; "యో
మునివర! విన్నవార మిట
మున్ను శివుండు లులాయరూపముం
గొని చరియించె నంచు; నెద
కుం బ్రియమారఁగ దాని విన్పుమీ!" ౧౦౧

క. అని వా రభ్యర్థింపఁగ
మునీశ్వరుఁడు రేణుకోత్తముఁడు తదుదంతం
బును మోక్షసాధనముఁ బా
వనమును వినిపించె నిట్లు పాయఁగ నఘముల్. ౬౨

క. కలుషములబుంగ నాఁదగు
కలియుగ మారంభ మగుటఁ గనుఁగొని క్రాంతే
యులు రోసి పుడమి నుండఁగఁ
గొలిచి శివుని ముక్తిఁబొందు కోరికి పొదలన్. ౬౩

క. తుహినాద్రి కరిగి యందున్
బహుకాలము వెదకి వెదకి వనవాటములం
గుహలందు, హిమాచలరా
డ్దుహితృపతిం గనక, పడిరి దుఃఖాంబుధిలోన్. ౬౪

చ. గిరిశిఖరాగ్ర మెక్కి పరి
కింప వృకోదరుఁ డెల్ల దిక్కుల
త్తతి నెనుపోతుపిం డొకటి
తన్నికటంబునఁ గానిపించె; న
బ్బరముగ దానినుండి యొక
పోతు, సమూహము వెన్క నెట్టె ముం
దరి కరుదెంచి నిల్వఁబడెఁ
దన్మరుదాత్మజువంకఁ గాంచుచున్. ౬౫

ఆ. వె. అష్టదిగ్గజముల, యమలులాయంబును
లెక్క గొనని దర్పలీల మెఱయఁ
జియ్యఁబట్టి యదియుఁ జిందులాడుచు నుండె
వాల మెత్తి యెగిరి పరుగు లిడుచు. ౬౬

మ. అతనిం గాంచి కడుంగడుం బెదరిన
ట్లా కాసరేంద్రింబు పో
ద్ధతిమై విప్పి చెవుల్ తలం గదిపి శా
తంబైన శృంగంబులన్
హతమార్పన్ విదిలించికొంచు శరవే
గాతీతమై దారుణా
కృతితోఁ బేరెము వాఱె వానికడ కు
ద్రిక్తపరితాపంబునన్. ౬౭

మ. తనపై కవ్విధి నా లులాయ మతిదు
ర్దాంతంబుగా రాఁగఁ బా
వని దృప్తుండయి దానిపై దుమికి తీ
వ్రింబైన ఘాతంబులం
దనువందుం గురిపించుఁ గొమ్ములను జే
తం బట్టి నల్మోన్ మెడన్
గొని తోఁక న్నిరుకేలఁ ద్రిప్పి విసరున్
గ్రొవ్వెల్లయుం గూలఁగాన్. ౬౮

క. అలఁతియు నలసటఁ గాంచక
నలగక గున్నేనుఁగ ట్లనాయ_స్తంభై
చెలరేఁగి వానిపై కా
లులాయకము పఱచెఁబో యలోకోద్ధతిమై. ౬౯

క. మరలం ద్రొబ్బెను మున్నిటి
కరణిని భీముండు; తాఁకెఁ గాసర మతనిన్
మరలన్ మున్నిటికరణిని;
నిరువురకుం జరిగె జగడ మివ్విధి నచటన్. ౭౦

క. క్రమముగను భీమసేనాం
గములన్ బల మడఁగెఁ దూలె గర్వము మదిఁ ద
త్సమయమునఁ దోఁచె సందే
హము తత్కాసరము "శంభుఁ డగునో" యనుచున్. ౭౧

చ. స్థిరపడ నా తలం పతని
చి_త్తమునం బ్రణమిల్లి బ_త్తిఁ ద
చ్చరణములందుఁ బల్కె నప
చారము సైఁపుము దేవదేవ! నే
నెఱుఁగక త్వన్మహామహిమ
మిట్లొనరించితిఁ "దాసు దోషముల్
సరిగద వందనంబులకు"
సర్వ మెఱుంగుదు నీవె యీశ్వరా! ౭౨

మ. నిను వీక్షింపఁ గుతూహలంబుఁ గొని తం
డ్రీ! యీ తుషారాచలం
బున గాలించితి మెల్ల దేశముల సం
పూర్ణంబుగాఁ; గానరా
మిని దుష్ఖేదముఁ బొందె మా యెడఁద స్వా
మీ! మాకుఁ బ్రత్యక్షమై
వనటం బాచి యఘంబులం జిదిమి కై
వల్యంబు నీయంగదే!" ౨౩

ఆ. అనుడుఁ గాసరేంద్ర మాలించి యామాట
వాని భక్తి మెచ్చి; పడసి ముదము
స్వస్వరూప మొందెఁ; బ్రమథబృందం బయ్యెఁ
దోడ నున్న యెల్ల దున్నపిండు. ౨౪

శా. అంతన్ భీముఁడు మ్రొక్కఁ; శంభుఁ డనె "వ
త్సా! లెమ్మా! నీ భక్తికిన్
సంతోషించితిఁ; బోయి మీరలు తప
స్యం జేయుఁడీ! యుత్తర
ప్రాంతంబందు వెలుంగు దివ్యమగు క్షే
త్రంబైన కేదారమం;
దంతే నేమముతో లభించు భవదీ
యేష్టంబు మోక్షం బటన్. ౨౫

క. మును గ్రొవ్వినట్టి లోకం
బును గలఁచెడు యమలులాయమును బోగ రడపం
గొనితిని లులాయరూపముఁ;
గొని తద్రూపంబె జనుల కోర్కె వెలసితిఁ. ౭౬

గీ. తనరు నా పృష్ఠ ఘమరనాథంబు నందు;
మీరు నా మూపురంబు గేదారమందు;
నా ముఖం బొప్పుఁ బశుపతినాథమందు;
లింగరూపంబుఁ బొంది వెలుంగు నవియు. ౭౭

క. విను మీ లింగత్రియమును
ఘనభక్తిం గొలుచు భక్తకాండమున కిఁకఁ
వినఁబడదు సుమ్ము! యమవా
హనగళఘంటానినాద మది నిక్కముగఁ. ౭౮

క. అని యంతర్ధానంబును
గొనెఁ బ్రమథులతోడ; గాడ్పుకొమరుఁడు శృంగం
బును డిగి సోదరులం గొని
చని కేదారమున ముక్తి సాధించెఁ దుదిఁ. ౭౯

క. మునులారా! యిదిము న్నా
పినాకి ధరియించి మహిషవృత్తినిఁ జరియిం
చిన కథ; యాలించిన దీ
నినిఁ బాపము లెల్లఁ గాలి నీ అగును సుఁడీ. ౮౦

—• శ్రీమదేకోరామారాధ్యుని సందర్శనము •—

క. అని యిట్లు వారిని శివా
ర్చనముల నావిష్టమతులఁ జలిపి "యిగో ! నేఁ
జనుదు" నని రేణుకార్యుఁడు
ఘనుఁ డేకోరామగురుని కడకుం బోయెన్. ౮౧

మ. గురువర్యుం డఁట భృంగిగోత్రపతి యే
కోరాముఁ డన్ మానిశే
ఖరుఁ డుత్తుండయి రామనాథ మను లిం
గంబం దధిష్ఠించి సుం
దరవైరాగ్యసమాఖ్యపీఠమును ధా
త్రీశ్రేణితోఁ గ్రాలె; నీ
శ్వరపంచాస్యములం దఘోరమున మున్
జన్మించె నీ పుణ్యుఁడే ! ౮౨

క. ఏకోరాముఁడు భక్త్యు
ద్రేకంబున స్వాగతంబు రేణుకుని కిడెన్
లోకారాధ్యునకు గుణా
స్తోకున కనవద్యమతికి స్తుత్యునకుఁ దగన్. ౮౩

సీ. అగ్నియుగ్మంబువలెను, సూర్యద్వయంబు
మాడ్కి, నిరు పాలవెల్లులమాదిరి నుండెఁ
బూర్ణ తేజస్వియై శాంతమూర్తిక మగు
నా గురుద్వంద్వముం బ్రశస్యత వహించి. ౮౪

క. అల యేకోరాముని శి
ష్యుల కుపదేశించి, భక్తిచొప్పడ ధర్మం
బులఁ బెక్కుఁ; గకుద్గిరికిని
వెలలెం గన ఋష్యశృంగవిబుధోత్తంసున్. ౨౫

— ఋష్యశృంగునకుఁ గకుద్గిరివృత్తాంతమును జెప్పుట —

గీ. ఋష్యశృంగుండు దర్శించి రేణుకార్యు
రెండవ హరుండు వోలె వర్తిల్లు వాని
నర్ఘ్యపాద్యంబు లర్పించి యర్చ చేసి
తాఁ దరించితి నంచుఁ జిత్తమునఁ దలఁచె. ౨౬

మ. మరియుం బల్కెను ఋష్యశృంగుఁడు మహా
త్మా! రేణుకాచార్య! యె
వ్వరినిం గాంచిన నిన్నుఁ గాంచిన గతిన్
స్వాంతంబు సంతుష్టమై
పరగం బోదు, ప్రసన్నతం గొనదు; నీ
పార్శ్వంబునన్ నిల్చినన్
వరకైలాసమునందు నున్న కరణిన్
భావించు చుంటిన్ సుమీ! ౨౭

క. కృతయుగ మాకృతిఁ దాల్చిన
వితమున, రూపొంది నట్లు పెను పుణ్యంబో
యతిచంద్ర! కానిపింతువు
కృతార్థతం గంటి నేను రేణుకమానీ! ౨౮

క. కలదో? కో! శాస్త్రములందునఁ
దెలియని చరితంబు దివ్యదృష్టినిఁ గొని వ
ర్తిలునీకు, వినిచి దేవా!
తెలుపుము మా కెలమి నీ కకుద్గిరి కథలన్. ౮౯

ఆ. వె. అనుచు ఋష్యశృంగుఁ డాడంగ నాలించి
హాస మంకురింప నాననమునఁ
బలికె నిట్లు 'వినుఁడు! కలఁడు కణాదుండు
నాఁగ మున్ను మౌనినాథుఁ డిచట. ౯౦

గీ. అతఁడు పంచాగ్నిమధ్యమం దధివసించి
యానుచుఁ దృణాగ్రజలకణం బహరహంబు
కృచ్ఛ్రతప మాచరించె నా రీతిఁ బట్టి
వానికిఁ గణాదుఁడన్న యాహ్వాయము వచ్చె. ౯౧

ఆ. వె. వాని తపము మెచ్చి బాలేందుమౌళి ప్ర
త్యక్షుమై కృపాళువై యొసంగె
వాని యీప్సితంబు; కాన సిద్ధిక్షేత్ర
మంచు దీనిన్ వచించు చుంద్రు." ౯౨

క. అని ఋష్యశృంగమౌనికి
వినిచి కకుద్గిరిచరిత్ర విద్వన్మణి యా
యన తత్త్వమసిప్రభృతి వ
చనముల యర్థంబుఁ గఱపె శైవమతగతిన్. ౯౩

—॰ శివుని పంచవింశతిలీలల నెఱింగించుట ॰—

క. అవిరళగతి రేణుకముని
శివసిద్ధాంతములఁ దెలిపె? శివధర్మంబుల్
ప్రవచించె; నివ్విధంబున
వివరించెను శివుని పంచవింశతిలీలల్. ౯౪

౧. చంద్రధరలీల

క. తన సప్తవింశతిసుతల
మును దక్షుం డొసఁగి చంద్రమున కెల్లరినిం
గనుమీ! సమముగ నని చె
ప్పిన రోహిణియందు నిలిపెఁ బెద్దయుఁ బ్రీతిన్. ౯౫

శా. ఆనం దాఁటి స్వపుత్రికామణుల క
న్యాయంబుఁ గావింపఁగా;
నానల్ దాఁటిన కింక దక్షుఁ డపు డా
యల్లుండు జాబిల్లికిన్
"క్షీణత్వంబు వహింపు" మంచు శపియిం
చెన్; గ్రుద్ధులౌ వారికిన్
జ్ఞానం బుండునె? యల్లునిం దెగడ న
ష్టంబౌఁ గదా? పుత్త్రికిన్. ౯౬

ఉ. పిమ్మటఁ జందురుండు మది
బిట్టువగం గొని శంభుఁగూర్చి తీ
వ్రమ్ముగ నాచరించెను ద
పంబు; శివుండు దయార్ద్రమైన స్వాం

తమ్ముగ శాపమోచన మొ
నర్చి తదీయకళేబరం గ్రహించి శీ
ర్షమ్మున దాల్చి కుం దడపి
సంఘటియించెను లోకపూజ్యతన్. ౯౭

౨. ఉమామహేశ్వరలీల

మ. కమలాక్షుం డెద గౌస్తుభాభరణముం
గై సేసి యున్నట్లు పు
ష్పము సౌరభ్యముఁ దాల్చియున్నగతి నా
శైలాత్మజం గూడి ని
త్యము బ్రహ్మాండములన్ సృజించుచు నమ
ర్త్యశ్రేణికి నిందు హ
ర్ష మొనర్చెం; దదుమామహేశ్వరపర
బ్రహ్మంబు స్తోత్రించెదన్. ౯౮

౩. వృషభవాహనలీల

క. విలయం బొనర్చి ముజ్జగ
ముల ధర్మము వృషభరూపమునఁ దనుఁ దలియన్
ఎలమి నధిష్ఠించిన తద
చలాత్మజాశంకరులకు 'జయ! జయ!' యందున్. ౯౯

౪. తాండవేశ్వరలీల

మ. డమరుధ్వానము పిక్కటిల్లఁగను ద
ట్టంబై; కడుం జిందఁ మూ
ర్ధముపై నుండి సురాపగాంబుకణబృం
దంబుల్, భుజంగాలి గా

త్రిమునన్ ఫూత్కృతులం బొనర్పఁగను, నే
త్రిజ్వాల శోభాసమూ
హము నిండం దెసలందుఁ దాండవము భా
లాక్షుండు గావించెదున్. ౧౦౦

౫. గిరిజాకల్యాణలీల

మ. తనకై ఘోరతపం బొనర్చు హిమవ
త్కన్యన్ వటుత్వంబుతోఁ
జని దర్శించి రచించుచున్ సరసముల్
సల్లాపముల్ శూలి య
వ్వనితారత్నము చెట్టవట్టుకొని స్వ
ప్రాసాదముం జేర్చె; దే
వనికాయం బది “సాదు రేఁగె” నని న
వ్వన్ మెల్లఁగన్ స్వాత్మలన్. ౧౦౧

౬. భిక్షాటనలీల

ఉ. పూని మనోజ్ఞమౌ మదన
మోహనరూపము, రూపయౌవన
శ్రీనిధులై తనర్చు నమ
రీతతిచిత్తము చిందులాడఁగాఁ
దాను దదీయసన్నిధినిఁ
దారుచుఁ ద్రిమ్మరియట్లు మోమునం
దీనత దోఁపఁగా నడిగె
దేహి యటంచు హరుండు భిక్షమున్. ౧౦౨

౭. కామదహనలీల

మ. అలరుల్ ముల్కులుగాఁగ, దేటు లల్లెత్రా
డై క్రాలఁ, బుండ్రేక్షువే
విలుకాఁగా, భటపంక్తిగాఁగఁ జిలుకల్,
విండై వసంతుండు వ
ర్తిలఁగా వేఁట, శరంబులం దనపయిం
దీండ్రింబుగా నేయు న
వ్వాలరాజుఁ హరుఁ డాత్మ దృక్శిఖిశిఖన్
భస్మీకరించెం దగన్. ౧౦౩

౮. కాలసంహారలీల

మ. మును శ్వేతుం డను నొక్క ఱేఁడు చనుచున్
భోగాంగనామందిరం
బునకున్ నేలఁ బడంగ జేతఁగల య
ప్పుష్పదండపు వ్వాందు దా
నిని "నీశార్పిత" మంచుఁ బల్కెఁ దుదినిన్
విచ్చేయఁ దత్ప్రాణముం
గొనఁ గాలుం డతనిన్ మదం బుడిపి యు
గ్రుం డిచ్చెఁ గైలాసమున్. ౧౦౪

౯. త్రిపురహరలీల

చ. అరదముగాఁగ ధారుణి, య
హస్కరచంద్రులుగాఁగఁ జక్రముల్,
తురగకదంబమై తగ శ్రు
తుల్, విధి సారథిగాఁగఁ, జాపమై

పరగంగ మేరుపర్వతము,
వాసుకి నారియుగాఁగఁ జేర్చి, యా
హరుఁడు దహించి వేసెఁ ద్రిపు
రాసురు వేల్పులు సంతసింపఁగన్. ౧౦౫

౧౦. జలంధరహరలీల

మ. కాని యా బ్రహ్మవరంబు దిక్పతితతిన్
క్షోభిల్లఁ బీడించుచున్
ఘనగర్వంబున వారి భార్యల బలా
త్కారంబుగాఁ బట్టు నా
చెనఁటిం జంప జలంధరున్ సలిలరా
శిం జక్రిమున్ వ్రాసి బొ
ట్టనవ్రేల న్నది మెత్తు వాని యసుకాం
డం బీశుఁ డోలిం గొనెన్. ౧౦౬

౧౧. బ్రహ్మశిరశ్ఛేదలీల

మ. తనకుం జేకులు సృష్టికర్తృతకు న
త్యంతంబు గర్వించి యా
వనజోద్భూతుఁడు చీటికిం గొనక యా
వైకుంఠునిం, దేవదే
వుని, మృత్యుంజయుఁ, దన్నె మెల్ల నిగమం
బుల్ స్తోత్రముల్ సేయు నం
చును దర్పింపఁగ శంభుఁ డాతని శిర
స్సుం ద్రుంచివేసెం దగన్. ౧౦౭

౧౨. వీరభద్రలీల

మ. చని దక్షుం డొనరించు యాగమునకున్ శర్వాణి, యం దాత్మనా
థుని కేర్పడ్డ పరాభవంబున కెదం దుఃఖించి కుండాగ్నిలోఁ
దనువుం వీడఁగ, వీరభద్రతనువుం దాఁ దాల్చి శంభుండు ద
క్షుని శీర్షంబును విక్రమించి నఱకెన్ స్తోత్రింపఁగా వేలుపుల్. ౧౦౮

౧౩. శరభలీల

మ. త్రిజగత్కంటకు నా హిరణ్యకశిపుం దృప్తోద్ధతుం జీల్చియున్
నిజహస్తాగ్రములం, దదంత్రిముల మైనిం దాల్చి దర్పించి యుం
డ జగత్క్షేమకరుండు శంకరుఁడు నిష్ఠం దన్నృసింహాంగ మ
క్కుజ మొందం బ్రిజ, చించి వేసె శరభాకారంబుతో నయ్యెడన్. ౧౦౯

౧౪. అర్ధనారీశ్వరలీల

క. మును మహిషాసురు మర్దిం
చిన శక్తినిఁ జూచి పరమశివుఁడు హృషితుఁడై
తన యర్ధాంగం బిడి వి
న్ననువుగ నొప్పారె నర్ధనారీశ్వరుఁడై. ౧౧౦

౧౫. కిరాతలీల

క. తన భక్తాగ్రేసరు న
ర్జును గాఢతపోగరిమ్మ శోధింపఁ, గిరా
తుని రూపమున నెదుర్కొని
యని మెచ్చియుఁ బాశుపతమహాస్త్ర మొసంగెన్. ౧౧౧

౧౬. కంకాళధరలీల

గీ. మత్స్యరూపంబుఁ దాల్చి సోమకునిఁ దునిమి
కలఁచుచును రెచ్చి సప్తవార్ధులఁ జరించు
హరిని హరియించి కడిమిమైఁ బరమశివుఁడు
మత్స్యకంకాళము ధరించి మైనిఁ జెలఁగె. ౧౧౨

౧౭. చండీశానుగ్రహలీల

గీ. పరగు చండీశుఁ డనెడు శాబకుఁడు మున్ను
అమితమగు బత్తిమై నివేద్యం బొనర్పఁ
బరమశివునికిఁ బాల, నా హరుఁడు త్రావె
వానిఁ; "బాలెవ్వి" యని తండ్రి బాలుఁ దిట్టె. ౧౧౩

ఆ. వె. క్షీరములను ద్రావె శివుఁ డంచుఁ జెప్పినఁ
జావఁగొట్టె బాలు జనకుఁ; డపుడు
కినుక మెత్తి యతఁడు గొని గొడ్డటం దండ్రి
శిరముఁ ద్రుంచి యీశు శరణుఁ గోరె. ౧౧౪

క. కరుణాళుం డయి పరమే
 శ్వరుం డనుగ్రహముఁ జూపి చండీశునిపై
 హరియించి తదఘము; గణే
 శ్వరత్వ మిడె శివుఁడు భక్తపక్షీయుఁడు గా! ౧౧౪

౧౮. విషధరలీల

క. అమృతార్థంబయి వేల్పులు
 సముద్రముం దరిచ్చ నందు జనియించిన ఘో
 రమగు విషముఁ దిరిజగత్తే
 మముకై పానకమునా నుమాపతి త్రావె. ౧౧౫

౧౯. విష్ణుచక్రప్రదానలీల

మ. దనుజోన్మూలనముం బొనర్చు మతి స
 ద్భక్తిం దనుం గూర్చి య
 ర్చనఁ గావించు సహస్రపద్మముల న
 బ్జం బొండు లోపింపఁగా
 దన కందామరఁ దీసి పూజనము సం
 ధానించు శ్రీ విష్ణునిం
 గని హృష్టుం డయి స్వప్రసాదముగఁ జ
 క్రం బిచ్చె శంభుం డహో! ౧౧౬

౨౦. గణేశబోధలీల

క. కరిముఖునకుఁ దను రత్నా
భరణంబులఁ బూజ సేయువానికి దయతోఁ
గఱపి చతుర్దశవిద్యలఁ
బోరి గణపతిఁ జేసి పంచముఖుఁడై క్రాలెన్. ౧౧౮

౨౧. కుమారోత్పత్తిలీల

చ. కెరలుచు గౌరితో సురత
కేళి హరుండు గదిం, దటాన ద
గ్గఱి కరుదెంచు పావకునిఁ
గన్గొని లేచెను; శైవరేత మ
త్తఱిఁ దనపైఁ బడం గడుపుఁ
దాలిచి యగ్ని, భరింపఁ జాల కా
శరవణమందు వీడె; నట!
శంభుఁడె పుట్టెను షణ్ముఖాఖ్యతోన్. ౧౧౯

౨౨. ఏకపాదలీల

ఆ. పరమశివుఁడు తాండవమునఁ బైకెత్తిన
యేకపాదమునకు హిమకరార్కు
లందె లైరి; చుక్కలయ్యెను జిఱుగజ్జె;
లబ్జమట్లు మెఱసె నంఘ్రితలము. ౧౨౦

### ౨౩. సుఖావహమూర్తిలీల

చ. ఎఱుఁగక శంభుభక్తి లభి
యించును మోక్ష మటంచు మూర్ఖతం
దెరువును బాసి చేయుచును
నిష్ఫలకర్మ లిలం; జనుఃపరం
పరల వహించుచున్న నర
వర్గముఁ బ్రోవఁగ నుద్ధరించి సం
సరణమునుండి శర్వుఁడు ప్ర
సన్నసుఖావహమూర్తియై తగెన్. ౧౨౧

### ౨౪. దక్షిణామూర్తిలీల

క. తలపై జడలును గంగయుఁ
జలివెలుఁగును గ్రాల మోము శాంతం బయి భా
సిల, జ్ఞానముద్రఁ గై కొని
సలువుగ హరుఁ డొప్పె దక్షిణామూర్తి యనన్. ౧౨౨

### ౨౫. మహాలింగోద్భవలీల

శా. "లోకేశుండను నేనె నేనె" యని పె
ల్లుం గొవ్వి యా బ్రహ్మయున్
వైకుంఠుండు చరింప; వారలకుఁ గ
న్పట్టెన్ మహాలింగ మొం
డాకోటీందురవిప్రకాశ మయి; వా
రష్టాంది వారాహహం
సాకారంబులఁ బోయి యుండిరి తదా
ద్యంతంబులం గాంచఁగన్. ౧౨౩

ఆ. తిరిగి తిరిగి వారు తెలియక, గర్వంబు
దక్కి, చేయఁ బెద్దతడవు తపముఁ,
బరమశివుఁడు కృపను బ్రత్యక్షమై నముని
లయిన వారిఁ గాంచి యాదరించె. ౧౨౪

గీ. కాలగళు పంచవింశతిలీల లివ్వి
వినినవారల పాపంబు లింకిపోవు
ముక్తికన్య స్వయంవరంబున గ్రహించి
వారికరముల; సుఖయించు భవ్యముగను. ౧౨౫

—॰ మహర్షులకుఁ గూష్మాండగిరివృత్తముం దెలుపుట ॰—

గీ. ఇట్లు వచియించి రేణుకుం డేఁగె నచటు
వదలి కూష్మాండనామపర్వతమునకును
మహితు లగు గౌతమాత్రి రోమశదధీచి
భృగుపులస్త్యులు దాన వర్తిల్లుచుండ్రు. ౧౨౬

గీ. నందిగిరి యందుఁ గూష్మాండనామగిరిని
నంది యిట మున్ను తపియించి పొందె సిద్ధి;
దానిచుట్టును గుహగిరి ధాతృగిరియు
హరిగిరియు నా వినాయకగిరియుఁ బొలుచు. ౧౨౭

గీ. ఆ గుహాద్రులు తపము సమాచరించి
హరుని మెప్పించి వరముల నంది రందు
శివుకృపానది నాఁగ భాసిల్లుచున్న
క్షీరనది పాఱుచుండు నా గిరులనడుమ. ౧౨౮

మ. అరుదేరంగను రేణుకార్యుఁ డటకు
న్నంచున్న మానుల్ నమ
స్కారణంబుల్ రచియించి, యర్ఘ్య మిడి, స
త్కారంబుఁ గావించి "మీ
చరణన్యాసముచేత మా నెలవు, మీ
సందర్శనప్రాప్తిచేఁ
బరిపూతంబయి, మా యొడళ్లు మెఱసెన్
భవ్యంబుగా రేణుకా! ౧౨౯

క. తెలుపుము! మా కీ గిరికథఁ
బలునాళులనుండి ప్రీతి వడుదుము వినఁగన్
గలుషము లడంగి దానం
గలుగును మోక్షం బటంచ్రు గద" యని యడుగన్. ౧౩౦

క. "మును నందీశ్వరుఁ డిచ్చటఁ
దన శివసేవాప్రమత్తతను శప్తుండై
చను దెంచి నిరాహారతఁ
బొనరించెను బెద్దకాలము మహాతపమున్. ౧౩౧

క. తుదికిం బ్రత్యక్షుండై
ముదితాత్ముం జేసెఁ బంచముఖుఁ డా నందిన్
అదిమొదలు నందిగిరి యను
పదమున నిది వ్యవహరింపఁబడుచుండె భువిన్. ౧౩౨

క. మును వీ గిరిఁ గూష్మాండుం
డను మునిచంద్రుండు ఘోరమగు తపమును జే
సిన శివుఁడు మోక్ష మిచ్చెను
దనరెడు నద్దాని కతనఁ దన్నామమునన్." ౧౩౩

గీ. ఇట్లు వచియించి మెలయించి ఋషిచయంబుఁ
జాటుఁడీ! మీరు భువి వీరశైవమతముఁ
గొలువుఁడీ! శివు, మీ కగుఁ బలుశుభంబు
లనుచు రేణుకుఁ డాకాశమునకు నెగిరె. ౧౩౪

## —• మంగళవాడ వృత్తాంతము •—

క. ఇల మంగళవాడాఖ్యను
గల దొక పత్తనము సార్థకసమాహ్వాయమై
తులతూఁగుచు సిరి సంప
త్తులతో నలకాపురంబుతోఁ దుల్యంబై. ౧౩౫

గీ. అల సదాచారసంపన్న మైన సతికి
ధర దురాచారుఁ డగు భర్త దొరకిన గతి
వీరబిజ్జలుఁ డనెడి దుర్వృత్తుఁ డొకఁడు
దొరగ మంగళవాడకు దొరకినాఁడు. ౧౩౬

క. ధనరాజ్యమదము లాతని
మనంబునం బీఁటవెట్టె; మైకము గ్రమ్మెన్
గనుఁగవను; బుణ్యపాపము
లను భేదము మఱచె నతఁ డనార్యచరితుఁడై. ౧౩౭

క. నరనాథుఁ డైన యాతఁడు
నరకాసురుసోదరుం డనంగను బాపా
చరణపరాయణుఁ డై కడు
దురాత్ముఁడై మిక్కిలిగను ధూ ర్తుండయ్యెన్. ౧౩౮

గీ. సజ్జనుల వాఁడు దలఁచు వంచకులటంచు
యతుల మతిలేనివా రని యాత్మ నవ్వుఁ
దపసు లందఱున్ మిండతపసు లనును
స్వల్పుఁ డెంచండె? తన వోలె సర్వజనుల? ౧౩౯

క. తన చిగిలింతైశ్వర్యముఁ
గనుంగొనుచుఁ గన్నుమిన్నుఁ గానక తిరుగున్
దన ధనసమృద్ధిఁ జెఱచును
దన దుర్నయ మనుచు దుష్టు తెలపఁ డెడందన్. ౧౪౦

గీ. ఇతని యింటను బుట్టద యీఁగ కిలియుఁ
బామునకు బలియును; దైన్యపరులఁ గాంచి
చెండుకొని మోము మాటాడు చుండు నతఁడు
శరణుఁ జొచ్చినవారిఁ గాంచండు మనఁగ. ౧౪౧

గీ. గిల్లికజ్జాలు రేపి శిక్షించుచుండుఁ
చోరబృందంబుల నతండు; వారి బ్రదుకు
అరఁటి యాకట్టు లుండె న య్యవనిపతియుఁ
గంటకప్రాయమై యుండెఁ గష్టుఁ డగుట. ౧౪౨

గీ. క్రూరుఁ డంచును వానిఁ గరోఁ్కటకుండ
టంచుఁ బెనురాక్షసుం డంచు నాడుచుండ్రి
జనులు పరికించ నిజముగా జగమునందు
వాని కుపమానపద మెందుఁ గానరాదు. ౧౪౩

—• రేణుకుఁడు భిక్షుకరూపముతో నాగమించుట •—

ఆ. వె. ఒక్కనాఁ డతండు యువతితో నొంటిగా
ముచ్చ టాడుచుండ ముదితమతినిఁ
"దండ్రి! నాకు భిక్ష దయసేయు మాఁకొంటి"
నంచు నొక్క భిక్షు వఱచె బయట. ౧౪౪

క. మదనోత్సవమున నుండుటఁ
దదీయ మగు నార్తరవము తత్పతి చెవి దూ
ఱద "రాజా! రాజా! భి
క్ష దయంబెట్టు ననుఁ గడుపు కాల్చుచు నుండెఁ." ౧౪౫

మ. అని యా భిక్షువు గ్రిక్క త్రిప్పకొన కా
ర్తాలాపముల్ సేయఁగా
విని యా కూళ పిసాసి బిజ్జలుఁడు కో
పిష్టాత్ముఁడై సేవకుం
గని "యా క్రాఁగుచునున్న పాయసము వే
గం దీసికోపోయి యా
తని చేదోయిని వేయుమీ"యనుడు నా
తం డట్లొనర్చెం దగన్. ౧౪౬

ఉ. సైఁపగరాని వేఁడి కవ
　　　　శత్వముఁ బొందినయట్లు భిక్షు వా
పాపికి బుద్ధి సెప్పఁగను
　　　　బాయసముర్వి వడివేసి కొట్ట నా
భూపతిగేహాభిత్తిపయి ;
　　　　బుస్సున మంటలు రేఁగి యంతటన్
బాపము ! రాజసౌధము క్ష
　　　　ణంబున బూడిద యయ్యె నయ్యరే ! ౧౪౭

క. ధనకనకవస్తువాహన
సనాథముగ మేడ గాలె; జనపతి సతితో
మనెఁ "జావు దప్పి పడెఁబొ
కను లొట్ట'' యటందు రిట్టి గతినిన్ విబుధుల్. ౧౪౮

ఉ. అంతిపురంబులోని జను
　　　　లందఱు గొల్లున గోల వెట్టు చ
త్యంతము దిక్కు దోఁపక య
　　　　థాయథలై పరువెత్తఁ జొచ్చి; రు
ద్భ్రాంతమనస్కుఁడై మన ధ
　　　　రాపతి కొండొకసేపు తప్తుఁడై
స్వాంతమునందు భిక్షుని మ
　　　　హత్త్వ మిదంచుఁ దలంచె జ్ఞానియై. ౧౪౯

గీ. కాదు సామాన్యుఁడైన భిక్షాకుఁ డీతఁ
డే మహాశివయోగియో! యీతఁ డగును!
గన్నుగానక యున్న నా కన్ను దెఱవ
వచ్చెఁ గాఁబోలు! నా పంట పండె నేఁడు. ౧౫౦

—◆ వీరబిజ్జలుని గర్వపరిహారము ◆—

మ. అని చింతించుచు భిక్షునిం దఱిసి సా
ష్టాంగంబుగా మ్రొక్కి భ
క్తినిబద్ధాంజలియై మహాముని మదాం
ధీభూతచేతస్కుఁడన్
నిను నిర్లక్ష్య మొనర్చి కిల్బిషముఁ గొం
టిన్; నా కిఁకన్ బుద్ధి వ
చ్చెను; మన్నింపుము నాదుతప్పిదము నన్
జేపట్టి పాలింపవే. ౧౫౧

ఉ. "నేనె త్రిలోకనాథుఁడను
నేనె ధనాఢ్యుఁడ; నేనె శూరుఁడన్
నేనె మహామహుండ ధర
ణీస్థలి నా కెదు రెవ్వ"రంచు న
జ్ఞానమహాంధకారమునఁ
గన్నులు గానక సంచరించుచు
న్నాను; క్షమించి నన్నుఁ గరు
ణామయ! కావు మటంచు వేఁడినన్. ౧౫౨

గీ. విభుని తల పైని జెయివైచి భిక్షుకుండు
పలికెను; "క్షుధార్తులగు భిక్షువులకు నిడక
బిచ్చ మూరకపుచ్చుట పెద్దతనమె?
భూతతృప్తియ శివతృప్తి పొమ్ము రాజ! ౧౫౩

—◆ రేణుకుఁడు ప్రత్యక్షమై జ్ఞానము నుపదేశించుట ◆—

ఆ. వె. నీవు పెట్టకున్న నీకుఁ బెట్టుదు నేను
వలయునంత భిక్ష భయపడకుము"
అనుచు నవ్వుచున్న యా భిక్షుఁ దల యెత్తి
ఱేఁడు గాంచఁ దోఁచె రేణుకుండు. ౧౫౪

ఆ. వె. ప్రమథగణముతోడఁ బ్రత్యక్షుఁ డగు రేణు
కార్యుఁ గాంచి యొడయఁ డనియె నిట్లు
"ననుఁ బరీక్ష సేయఁ జనుదెంచితిరి కాక
పెట్టఁగలనె మీకు బిచ్చ మేను?" ౧౫౫

గీ. అనుడుఁ రేణుకుఁ డిట్లనె "నవనిపాల!
సిరతిఁ బిడికెడు బిచ్చంబు నీవు పెట్ట
నెంతయుం దృప్తి యగును మా కెల్లరకును
హారుఁడు హర్షించు శివయోగి హర్షపడిన." ౧౫౬

గీ. ఱేఁడు తద్వాక్య మాలించి రేణుకునకుఁ
బ్రీతిఁ బిడికెఁడు బియ్యంబు భిక్ష వెట్టెఁ
జూచుచుండంగనే యటఁ జోద్యముగను
వివిధభోజ్యపదార్థ మావిర్భవించె. ౧౫౭

గీ. వెలుఁగు దోఁపంగ నెడఁద బృథ్వీవరుఁడు
దన్మహత్త్వంబు ద్విగుణీకృతముగఁ గాంచి
తన యొనర్చిన యపచారమునకు మెండు
మండుచు వచించె ననుతాపచండవహ్ని. ౧౫౮

క. "త్రికరణశుద్ధిగ నేఁ దా
వక కరుణాపాంగములకుఁ బాత్రుఁడఁ గాన
ట్టి కుమతి; నీవో యవ్యా
జకృపామయమూర్తి కావె సంరక్షింపన్. ౧౫౯

క. రసయోగంబున భువి నా
యసమును గాంచనము సేయు నట్టులు దుర్మా
నసుఁడగు నన్ను వివేకో
ల్లసితునిఁ జేయవె? దయావిలాసము పేర్మిన్. ౧౬౦

క. శివతత్త్వము బోధింపుము!
శివప్రసాదార్హుఁగాఁగఁ జేయుము నన్నున్
భవసాగర మీఁదింపుము
భవత్కృపాతరణిచేతఁ బరమమునీంద్రా!" ౧౬౧

క. అని దీనంబుగ వేఁడఁగ
మునీశ్వరుఁడు రేణుకుండు ముదితుండయి "యీ
తనిదర్ప మింకెఁ, గల్మష
మనుతాపానలముచేత నడఁగె"నని మదిన్. ౧౬౨

క. "కృతయుగధర్మము నెఱపుచు
క్షితినిం బాలింపవయ్య! స్థిరముగ శృతి స
మ్మతముగ నడువుము! మరి శివ
మతధర్మము లాచరింపుమా! సన్మతితోఁ. ౧౬౩

క. భోగంబు విడిచి పూనుము
యోగము; శివయోగి వగుము ! మోక్షో
ద్యోగము వహింపు మోయీ !
రాగద్వేషముల విడిచి రాజా !'' యనుచుఁ. ౧౬౪

క. ఉపదేశ మిచ్చి రేణుకుఁ
డపారకృపఁ జేసి యిట్టు లాశీ స్సిడి వ్యో
మపథమున కెగసె శివ నా
మపరాయణమైన వదనమండల మలరఁ. ౧౬౫

ద్వితీయాశ్వాసము సమాప్తము.

---

# రేణుకవిజయము

## తృతీయాశ్వాసము

### శ్రీశైలవృత్తాంతము

గీ. ఇంద్రియాగోచరుండు మహేశ్వరుండు
భక్తసులభుండు గావుట వారిఁ బ్రోచె
మల్లికార్జునుఁ డన్న నామమున వెలిసె
జగతి భ్రమరాంబతోడ శ్రీశైలమందు. ౧

మ. కలఁ డచ్చోఁ ద్రిపురాంతకేశ్వరసమా
ఖ్యం దూర్పు ద్వారాన; భా
సిలు బ్రహ్మేశ్వరుఁ డన్న పేరిటఁ బ్రతీ
చీద్వారదేశంబునన్;
జెలఁగున్ నిచ్చ మహేశ్వరాఖ్యను నుదీ
చిం; దక్షిణాశం బ్రవ
ర్తిలెడున్ సిద్ధవటేశ్వరాఖ్యను మహా
దేవుండె భిన్నాకృతిన్. ౨

క. పాతాళగంగ యందురు
పాతకసంక్షాళనైకపారీణ నటన్
భూతేశకృపాఝరమును;
స్నాతులకు లభించు మోక్షసామ్రాజ్య మటన్. ౩

గీ. ఆ నదీకాంత శివదర్శనార్థ మరుగు
భక్తకోటికిఁ దటవృక్షఫలసుమముల
స్వాగతం బిచ్చి పరిచర్య సలుపుచుండుఁ
జల్లనగు నీటఁ దాపోపశాంతిఁ గూర్చి. ౪

—॰ రేణుకుఁడు శ్రీగిరిక్షేత్రమును జేరుట ॰—

శా. ఆ తీర్థంబున కేఁగి రేణుకుఁడు ది
వ్యంబైన పాతాళగం
గాతీర్థంబుల నాడి యిష్టశివలిం
గంబుల్ సమర్చించి త
త్పూతాంభస్సుల మల్లికార్జునుని సం
పూర్ణాభిషేకంబుతోఁ
జేతఃప్రీతిగ సేవసేసి నుతియిం
చెన్ శూలి నేవంవిధిన్. ౫

శా. "జే! యుర్వీధరకన్యకారమణ!
జే! జే! దివ్యయోగీంద్రహృ
ద్ధ్యేయా! నిర్జర బృందవందిత నమ
స్తే సత్కృపాంభోనిధీ!
నీ యాజ్ఞన్ శిరసావహించుకొని తం
డ్రీ! భూమికిన్ వచ్చితిన్
జేయంగాఁ దగినట్టి కర్జమున శా
సింపంగదే! యీతనిన్. ౬

క. అని పలుక రేణుకార్యుఁడు
వినంబడియెఁ బెద్ద యెలుఁగు వింటను; వృషవా
హనుఁడు గిరికన్యకాపతి
కనంబడియె నెట్టయెదుటఁ గడు నమ్రముగన్. ౭

క. కనఁబడి "బాలక! రేణుక!
జనతాఘతమోర్క! ఘోరసంసారమహా
బ్ధినిమగ్నతరణి! లోకపుఁ
గనుంగవను దెఱచి తివు కల రేరు సరుల్ ? ౮

క. ధరజనుల మదారాధన
పరతంత్రులఁ జేసితివి; ప్రపంచమునందున్
వరవీరశైవతత్త్వము
నిరుపమముగఁ జాటితివి; కొనితి హర్షంబున్. ౯

గీ. పుత్ర! రేణుక! కర్తవ్యమును దెలిపెద
వినుము! కైవల్యమునకు సాధనములైన
కర్మమార్గంబు, జ్ఞానమార్గమును బ్రజకు
సతత ముపదేశ మిచ్చుచు క్షితిఁ జరింపు! ౧౦

మ. జనముల్ మెచ్చఁగ నీదు పీఠమున సం
స్థాపించి నిర్వంటి శి
ష్యుని సర్వోత్తము నొక్కనిం; దిరుగుచున్
క్షోణీతలం బెల్ల మో

హానిమగ్న ప్రభువర్గముఁ నయభయ
వ్యాపార పూర్వంబుగా
ననయంబు బా పెడత్రోవనుండి సుపథ
వ్యాసక్తులం జేయుమీ! ౧౧

చ. ధనమదమత్తులై తిరుగు
ధారుణిపాలుర చిత్తమందుఁ బె
ల్చన శివభక్తిబీజమును
జక్కఁగ నాఁటుము; మోసు లెత్తుచుఁ
అనగొనలఁ నిరంతరము
నందముగాఁ గనువిందు సేయుచుఁ
ఘనమగు మోక్షపుం ఫలము
గల్గునటుల్ పొనరింపుమీ! తుదిఁ. ౧౨

గీ. నాస్తికపశూత్కరంబు లనారతంబుఁ
దురించి దానిని మేయ యత్నించుచుండు;
వజ్రపుంగోట వగుచుఁ గాపాడు మీవ
యయ్యది దృఢపరికాండమై యలరుదాఁక. ౧౩

క. భయభక్తులు పెనఁగొన నెం
తయునుం బ్రజ లనుసరింతురి ధారుణిపతులఁ
నయనిధి కావలె రాజో
జ "యథా రాజా తథా ప్రజా" యన వినవే! ౧౪

గీ. జగతి ''శివమతసామ్రాజ్యశాసకుఁ'' డను
బిరుదు వహియించి జగము కన్దెలిచి మెరసి
జలజపత్రాంతరస్థమౌ జలకణంబు
కరణి నిర్లిప్తత వహించి తిరుగుమోయి ! ౧౫

గీ. ఆరయ మదీయమైన మూర్త్యంతరమవు
కాక భిన్నుండవే నీవు ? కావు ! కావు !
జనకుఁడే పుత్త్రుఁడై భువి జననమొందు
నన్న శ్రుతి నాలకింపవే యాత్మజాత ! ౧౬

—• శ్రీ పండితారాధ్య సందర్శనము •—

గీ. ఇట్లు వచియించి శూలి యదృశ్యుఁ డగుడు
రేణుకాచార్యుఁ డెడఁద హర్షించి కడిఁది
మొగసి శివునాజ్ఞ శిరసావహించి మింటి;
కరిగె శ్రీపండితారాధ్యు నాశ్రమంబు. ౧౭

ఉ. ఆతఁడు మల్లికార్జునమ
హాశివలింగసముద్భవుండు, వి
ఖ్యాతవృషాఖ్యగోత్రుఁ డివు;
డా హరు తత్పురుషాఖ్యవక్త్రి సం
జాతుఁడుగా వెలింగెఁ దొలి
జన్మమునందు నతండె; వాని తే
జోఽతిశయంబు నాతని మ
హత్త్వవిభూతియు నెన్న నేటికిఁ ? ౧౮

క. శివభక్తచాతకములకు
నవవారిద మతఁడు; రూపునన్ వెలిగెడి శ్రీ
శివతత్త్వంబే యాతం;
డవనీభాగ్యంబె పండితారాధ్యుఁ డనన్. ౧౯

శా. వా రన్యోన్యముఁ గాంచి సమ్మదభర
స్వాంతంబుతో నమ్రులై
ప్రారంభించిరి చూప నొండొరులపై
భక్తిప్రపత్త్యున్నతుల్
దూరాపాస్తతమస్కు లా యిరువు రిం
దుద్వంద్వమో నాఁగ నా
నీరేజాప్తయుగంబొ నాఁగను గడుం
దీపించి రాసీనులై. ౨౦

క. తెలిసియ యున్నను నిరువురుఁ
దెలిసికొనిరి యడిగి యడిగి తిరియను మహిమల్
ఇలఁ దద్జ్ఞు లహంకారము
మొలకెత్తఁగ నీక వినయమున నందురు గదా! ౨౧

గీ. వార లన్యోన్యదర్శనభాగ్యకలనఁ
దమ్ము ధన్యాత్ములుగ నెదం దలఁచికొనుచు
నైఁపక మిథోవియోగంబు సఖ్యవృత్తిఁ
గొన్నినాళ్లు వసించిరి కూడిమాడి. ౨౨

—• శ్రీ శంకరాచార్యుని తపస్సు •—

గీ. అపరశంకరుఁ డన్న ప్రఖ్యాతి గన్న
శంకరాచార్యవర్యుఁ డా సమయమందె
శ్రీమహేశ్వరు సాక్షాత్కరించు కొనఁగ
సలుపుచుండెఁ దపంబు శ్రీశైలమందు. ౨౩

గీ. నిరశనవ్రతనిష్ఠుఁడై నిండుబత్తిఁ
గృచ్ఛ్రతప మాచరింపంగఁ గృశతఁ బెంచి
వినిచె నాకాశవాణి యాయనకు నిట్లు
"వృథగ నొడలేల యలయించి బడుగ వగుదు. ౨౪

గీ. చంద్రమౌళీశలింగ మర్చన మొనర్చి
సలుపుమీ! పూజ; నీ కోర్కె ఫలిత మగును
నా కుమారుండు రేణుకనామకుండు
దాసి నీ కిచ్చు వాని సందర్శనమున. ౨౫

క. పిమ్మట మత్సాక్షాత్కా
రమ్మబ్బును నీకు శంకరా! పొమ్మనుడున్
సమ్మోద మొంది నెమ్మదిఁ
గ్రుమ్మఱఁగా లేచె రేణుకుని దర్శింపన్. ౨౬

క. గిరిగహ్వరసానువులను,
సరోవరప్రాంతములఁ గుజచ్ఛాయలలో,
వరమున్యాశ్రమముల, శం
కరుండు రేణుకుని వెదుకఁగాఁ బూని చనెన్. ౨౭

గీ. చోళకేరళకాశ్మీరమాళవాంగ
వంగకుంతలపాండ్య నేపాళములను
ఘూర్జరకళింగమాగధకోంకణములఁ
గనుచు మలయాచలమునకుఁ జనె నతండు. ౨౮

గీ. అప్రియత్నంబుగా వాని కడఁగెఁ దాప;
మాత్మయుఁ బ్రిసన్న మయ్యెను; హర్ష మొదవె;
దక్షిణాంగంబు లదరె నత్యంత మిచటఁ
గార్యము ఫలించునంచు శంకరుఁడు మురిసె. ౨౯

గీ. ఒడల భస్మత్రిపుండ్రిముల్, మెడ ధరించి
పెద్ద రుద్రాక్షమాలలు పేరెలుఁగున
శివుని గానం బొనర్చెడి శివశరణులు
కానఁబడి రా స్థలమున శంకరుల కపుడు. 30

గీ. శివుని గానంబు గావించు చిలుకదండు
శివుని స్తోత్రింబులఁ బఠించు సెలలపిండు
శివునికి ఫలంబు లర్పించు చెట్లగుంపు
శివునిఁ బూజించు లతలు దర్శించె నతఁడు. 3౧

గీ. అపరకైలాస మనఁగ నొప్పారుచున్న
తత్ప్రిదేశాన రేణుకదర్శనంబు
తప్పక లభించు నంచు సంతసము గొనుచు
ముందునకు సాఁగిపోయె న మ్మునివరుండు. 3౨

క. శిలలెల్లను శివలింగం
బులు, సెలయేళ్లెల్ల గాంగపూరంబులుగాఁ
గల జంతుబృందకముఁ బ్రమ
థులుగా, శ్రీశంకరులకుఁ దోఁచెను బత్తిన్. ౩౩

మ. చనుచుండంగను శంకరుఁడచటఁ గాం
చంగల్గెఁ బె న్గంతయున్,
దనువందున్ జలకుండియుం గరమునన్
భస్మత్రిపుండ్రింబు మో
మున, శీర్షంబున ముప్పదారుజడగుం
పున్, రావిదండంబు, భి
క్షణపాత్రింబును దాల్చి యున్న యొకనిన్
ఖద్యోతకోటి ప్రభున్. ౩౪

—• రేణుకాచార్యుఁడు శంకరాచార్యునకు చంద్రమౌళీశ్వర
లింగము ననుగ్రహించుట •—

గీ. కాంచి లోకోత్తరప్రభాకలితు నతని
శంకరుఁ "డితండె రేణుకాచార్యుఁ" డనుచుఁ
దనదు భాగ్యంబు పండెనంచును దలంచి
డాసి సాష్టాంగముగను దండం బొనర్చె. ౩౫

మ. "శివసాక్షాత్కరణార్థ మేను దపముం
జేయంగ నాకాశవా
ణి వినంబడ్డది నాకు లోకగురువా!
"నీ దర్శన ప్రాప్తిచే



శ్రీ రేణుకాచార్యులవారు శ్రీ శంకరాచార్యులకు
చంద్రమౌళీశ్వరలింగము ననుగ్రహించుట

నవుఁ దత్సిద్ధి'' యటంచుఁ, గంటి నిను, దే
వా! చంద్రిమౌళీశలిం
గ విశేషంబు ననుగ్రహింపఁ గదె! త
త్కార్యంబు సిద్ధింపఁగన్. ౩౬

క. ఎడ తెగని ప్రయాణంబులఁ
జిడిముడి పాటొందుకొనుచుఁ జెడఁ దిరిగితిఁ జూ,
బడలితి, నా జవసత్త్వము
లడఁగెను నే నిటకువచ్చునప్పటికి మునీ. ౩౭

గీ. నాదు పుణ్యాన నీదు సందర్శనంబు
గలిగెఁ గాకున్న నేమి కావలసె నొక్కొ?
కామితార్థంబు పండ లింగం బొసంగి
పుణ్యమునఁ బొమ్ము! మహనీయపుణ్యతేజ!. ౩౮

మ. అని ప్రార్థింపఁగ రేణుకుండు శివది
వ్యాజ్ఞానుసారంబుగా
జనవంద్యుం డయినట్టి శంకరుని కి
చ్చెం జంద్రిమౌళీశ్వరా
ఖ్యను శోభిల్లెడు దివ్యలింగమును జి
న్మాయ్యసంబుగావించి యి
చ్చెను విన్వీధినిఁ బూలవాన గురియన్
జేజేలు జేవెట్టగన్. ౩౯

క. కొని తల్లింగము వినయం
బున శంకరుఁ డద్ది నేత్రపుటములకుఁ దగన్,
అనఘునిఁగా మహితునిఁగాఁ
బునీతుఁగాఁ దలఁచుకొనుచుఁ బోయె యథేచ్ఛన్. ౪౦

## —• పుండరీక పురీ వృత్తాంతము •—

క. ఆ మలయాద్రిని వెలువడి
భూమండల మాత్మచరణపూతస్పర్శన్
శ్రీమంతముఁ గావించుచు
నా మహనీయుండు రేణుకార్యుఁడు చనియెన్. ౪౧

గీ. దాఁటుచు నదీనదంబుల, దట్టమైన
కానల నతిక్రమించుచు, ఘనము లైన
పత్తనంబులఁ బల్లెల వరుసమీఱు
చతఁడు చని కాంచెఁ బుండరీకాఖ్యపురము. ౪౨

గీ. వర్ణనాతీత మా దేశభాగ్య మెన్న;
నందు జంబు కైకామ్ర మధ్యార్జునేశ్వ
రారుణగిరీశ, కుంభేశ్వరాది దేవ
సంఘ మద్దాని కంగరక్షగ వసించె. ౪౩

క. తొలి విప్రుఁ డొకఁడు పితృ
స్థుల గంగం గలుపఁ బోవుచును రేయగుటన్
నిలిచె నటఁ; దెల్లవారుడు
నలరులుగా మారెఁ గాంచ నస్థు లవెల్లన్. ౪౪

క. పాపుఁడు పుణ్యుఁడుగా నగు
నా పురి దగు గాలి సోకినంతన; మరియుం
దాపత్రియం బడంగును
బ్రాపించు జనుండు మోక్షపద మంతమునన్. ౪౫

గీ. రేణుకజగద్గురుఁడు పుండరీక పురిని
జంబుకేశ్వరముఖ్య దర్శన మొనర్చి
ధన్యుఁగాఁ దన్నుఁ దలఁచుచుఁ దనియకయును
గార్యగతిచేఁ బ్రయాణించి కదలిపోయె. ౪౬

గీ. అలరుఁ దుండీరదేశ మధ్యంబునందు
గాళహస్తి యనంగ నొక్కండు పురము;
నందు వసియించు కీటంబు నందుకొనును
దివ్యకైవల్య మన, లాఁతిఁ దెలుపనేల? ౪౭

— రేణుకాచార్యుఁడు కాంచిపురి కేతెంచుట —

గీ. స్నాన మొనరించి బత్తి స్వర్ణముఖియందు
నలిపి యభిషేకముఁ దదీయజలము చేతఁ
గాళహస్తీశు దర్శించి కనులవిందుఁ
జేసికొని యాతఁ డేగెఁ గాంచీపురంబు. ౪౮

గీ. భావికార్య మపేక్షించి పావనుండు
రేణుకుఁడు వేషమును విసర్జించి యంతఁ
జింకిపాఁతలుఁ, బేలికల్, కొంకికట్టిఁ
దాల్చి యొక తిక్కవాని చందము వహించె. ౪౯

గీ. ప్రాజ్ఞుఁ డగు నా మహాత్ముఁ డప్రాజ్ఞుఁ డయ్యె;
నయ్యెను ద్రినేత్రుఁ డతఁడు జాత్యంధుఁడుగను
బుంసరస్వతి యతఁ డయ్యె మూకుఁడుగను
ఉత్తమవివేకి యాతఁ డున్మత్తుఁ డయ్యె. ౨౦

చ. వికవిక నవ్వువా, రతని
వెంబడిఁ బోవుచు గోచి లాఁగువా,
ర్వికటపు సద్దుసేసి జళి
పించెడివారు, హసించువారు, వెం
డ్రుకలను బీఁకువారును, గ
డుంగడు నల్లరిసేయువారునై,
వెకలుల వైరి యా వెకలి
వేసపువానినిఁ జూచుచుం జనుల్. ౨౧

గీ. ‘నివుఱుగప్పిన నిప్పు నా నిండువీర్య
మణఁగి యుండిన యౌషధం బనఁ జెలంగు
నష్టశక్తులు డాఁచి తా నాదిభిక్షు
రూపము వహించినట్టి రుద్రుండో! యేమొ? ౨౨

క. ఏ పుట్టలో నెఱుంగమ
యే పామున్నదియొ? యట్ల యీతని మహిమల్
తోఁపక యున్నను వీని మ
హాపురుషత గోచరించు’ ననిరి వివేకుల్. ౨౩

క. ఎవ రేమన్నను నాతఁడు
నవు వారలమూర్ఖతకు; మనస్వుల మనముల్
అవివేకుల చేష్టల కె
ట్లు వికారముఁ బొందు? శాంతులు గదా! వారల్. ౧౪

—• వరదరాజస్వామి శిరఃకంపము •—

ఉ. వెంగలిమూఁక లిట్లతని
వీథులయం దభిభూతుఁ జేయుచుం
డంగను విష్ణునాలయము
నఁ గల దైవతవిగ్రహంబు శీ
ర్షాంగమునందుఁ బుట్టె నొక
యద్భుతకంపము; చూచి బిట్టు భీ
తిం గని పూజరుల్ తమ క్షి
తిపప్రభుతో మనవుల్ పొనర్చెదుఁ. ౧౫

గీ. అక్కజంపడి యా మాట కవనిభర్త
పుట్టఁ గంపంబు తన యుల్లమునఁ గడింది
"మదపచారఫలంబొ? మామకపురాకృ
తాఘపరిణామమో?" యని యాత్మఁ గలఁగె. ౧౬

క. "హరిభక్తుల నొప్పించిరొ?
హరిసేవలు మానినారొ? యా హరి వృత్తుల్
హరియించినారొ? నా కిం
కరతతి? కా కిట్టి బెడఁద కలుగునె నాకుఁ? ౧౭

క. శిల కంపించు పెఱుంగము
కలయందును; నెట్టి కీడు గలుగునో యనుచున్
గలగుండుపడుచు మంత్రులఁ
బిలిపించి యుపాయ మడిగి వెఱఁగొనుచు మదిన్. ౫౮

గీ. వారల హితోపదేశానుసారముగను
సలిపె శాంతికపౌష్టికంబులను; దాన
స్వామి కంపం బడంగద! వ్యాధి వేఱు,
మందు వేఱొక్కటే నెట్లు మానఁగలదు? ౫౯

శా. ఆ కాలంబున విప్రవృద్ధొకఁడు రా
జాగ్రేసరుం డాసి "భూ
మీకాంతా! వినవయ్య! మీ కొలపుసా
మిన్ సత్కృపావారిధిన్
ఏకామేశ్వరుఁ గొల్వుమీ! యతఁడె పా
యించున్ సుమీ కీడుఁ; గం
లేకాలుండు స్వభక్తకల్పకమ హో!
నీవేల భీతిల్లఁగన్? ౬౦

గీ. వెన్న యుండంగ నేతికై పెనఁగునట్లు
కనక ముండంగ ధనముకై కలఁగునట్లు
క్ష్మాధవా! మన యేకామ్రనాథుఁ డుండఁ
గామ్యసిద్ధికిఁ జింతిల్లఁగా నీ కేల? ౬౧

## —• ఏకామ్రనాథుని వృత్తాంతము •—

క. ఏకామ్రనాథు మహిమము
ష్మాకాంతా! పరమతాపసశ్రేష్ఠులకుం
గా తెలియఁగరాదు పరులకు;
నీ కెఱిఁగించెదను మున్ను నే విన్న కతన్. ౬౨

ఉ. మున్ను వినోదమాడ గిరి
పుత్రిక భర్తకు వచ్చి వెన్కఁగాఁ
గన్నులు మూఁడు మూసెఁ గర
కంజములన్; రవిచంద్రపావకుల్
ఉన్నటులుండి క్రుంకిరి; మ
హోగ్రభయంబు వహించె లోకముల్;
చెన్నఱిమాసెఁ గర్మలు; న
శించె జగద్వ్యవహార మెల్లయున్. ౬౩

గీ. లోకదుర్దశఁ గాంచి త్రిలోచనుండు
త్రిజగతీక్షేమకరుఁ డౌటఁ దెగడి సతిని
"పిల్లిచర్లాటమున నెల్క విఱిగినట్టు
లతివ! నీ క్రీడ లోకంబు లందెఁ గీడు. ౬౪

క. లోకవ్యథఁ గావించిన
నీ కర్మంబునకు శాస్తినిం బొందుమి! "యో
నీ! కాళి వగుమి!" యనుడుం
దేఁకువ గొని యొడలు వడఁక దేవి యదురుచున్. ౬౫

ఆ. వె. దోసిలొగ్గి కన్నుదోయి నశ్రులు రాల
బత్తిఁ గాళ్ళ వ్రేళ్ళఁబడుచుఁ బతినిఁ
దను క్షమింపుఁ డనుచు దయనీయముగ వేఁడఁ
గనికరించి కాలకంఠుఁ డనియె. ౬౬

గీ. "తరుణి! కాంచీపురం బను పురము గలదు
ధరణి; నది తపస్సిద్ధి క్షేత్రంబు సుమ్ము!
కావునఁ దపస్య సేయు మక్కడఁ; ద్వదీయ
కాళిమ యడంగి గౌరివై క్రాలె" దంచు. ౬౭

ఆ. వె. ఆలుబిడ్డలేని నపరాధ మొనరింపఁ
గటికతనముఁ బూని కానిపింత్రు,
రాతికన్న కఠినమై తగు; విరికన్న
మెత్త నగును ఘనుల చిత్త మెపుడు. ౬౮

క. గిరికన్య యంతఁ గాంచీ
పురికిం జనుదెంచి నాల్గుమూలలు గని యే
ర్పఱచుకొనెఁ దన నివాసము
సురమ్యమయి పొలుచు నొక్క చూతచ్ఛాయన్. ౬౯

ఆ. వె. ఇసుకతోడ నచట నీశలింగ మొనర్చి
తపము సలుపఁ దొడఁగె దక్షపుత్త్రి
మెచ్చి శంకరుండు మెలఁతం బరీక్షింప
వచ్చెఁ బొంగువాఱువాఁక యగుచు. ౭౦

క. నురువులు గ్రక్కుచుఁ దరువులు
విఱుచుచు దొరలించుకొనుచుఁ బెదపెద్ద శిలల్
పఱతెంచె నా నది తపోం
తరాయమనఁ గాలి యున్నతరువు వలనికిన్. ౨౧

క. శివురాణి చూచి వాగును
"శివలింగము కరఁగు; నేమి సేయుదు" ననుచున్
దివు లొందుచుఁ బ్రార్థించుచు
భవుఁ దన దేహమునఁ గప్పి పరిరక్షించెన్. ౨౨

క. కాళికిఁ బ్రత్యక్షుండయి
కాలగళుఁడు శాప మూడ్చి, గౌరి యగు సతిన్
లాలించి మేనిసా మిడి
మే లేకామ్రేశుఁ డనఁగ మించి యటఁ దగెన్. ౨౩

క. అడుగనివారిదె లోపం
బడిగినవారలకుఁ గోర్కు లత్యధికముగా
నిడు మన యేకామ్రేశుఁడు;
తడయక నీ వితనిఁ గొలిచి ధన్యుఁడ వగుమీ!. ౨౪

క. అని నుడువఁగ, భూమీంద్రుఁడు
వినయవిధేయతలతోడ వెన నేకామ్రే
శుని దేవళమునకుం జనె
వెనుకం జను దేరఁ బెద్దపెద్దలు జనముల్. ౨౫

మ. శివు నర్చించెఁ; బయోఽభిషేకము లొన
ర్చెన్; ధూపదీపంబు లె
క్కువఁ గల్పించెఁ; బరస్సహస్రములుగాఁ
గొబ్బండ్లు గొట్టించె? ను
త్సవముల్ కూర్చె; నివేద్యముల్ జరిపె నా
తం డప్డు; కార్యార్థు లె
ల్ల విశేషంబుగ భక్తిఁ జూపుదు రిటుల్
తచ్ఛీఘ్రసంసిద్ధికై. ౭౬

మ. నరవిట్ వేఁడెను ఱేఁడు "శ్రీవరదరా
జస్వామి కేర్పడ్డ యీ
శిరఉత్కంపము మాన్పి రాజ్యమునకా
చేటుల్ నివారింపుమీ
చిరకాలంబుననుండి నిన్నుఁ గొని పూ
జింపంగ రాకున్న నా
గురుదోషంబు సహించి నీదుపదభ
క్తుం గావు న న్నం చొగెన్. ౭౭

క. అరుదెంచి నెలవునకు నా
ధరావరుఁడు పవ్వళించె ధ్యానించుచు; న
ప్పురమేశుఁడు స్వప్నంబున
దరిసెన మిడి తనకు మ్రొక్కు తత్పతి కనియెన్. ౭౮

గీ. "క్ష్మాపతీ! విను రేణుకాచార్యుఁ డనఁగఁ
బ్రమథవరుఁ డేగుదెంచె నీ పట్నమునకు
వెంగలియటంచుఁ బ్రజలు భావించి మూఁగి
యభిభవించిరి దాన ని య్యది ఘటిల్లె. ౭౯

క. నీ వరిగి వానిఁ దోఁకొని
వేవేగం దె మ్మతండు వెంగలిగాఁ డో
భూవర! మీ పురభాగ్యపు
దేవత; రూపొందు ధర్మదేవత సుమ్మీ! ౮౦

క. ముక్కోటివేల్పు లతనికి
మ్రొక్కంగాఁ బూజసేయ ముచ్చటపడుచుం;
ద్రక్కఱఁ దీర్పఁగ నాతఁడె
దిక్కు సుమీ! నీకుఁ బొమ్ము! తెమ్మా యతనిన్. ౮౧

క. అని శివుఁ డంతర్ధానం
బును గొన, మేల్కని నృపోత్తముఁడు, తెలవారం
గను బిలిచి మంత్రిముఖ్యులఁ
దన స్వప్నవిధంబు లెల్లఁ దగ నెఱిఁగించెన్. ౮౨

— రాజసేవకుల పరాభవము —

క. గురుదేవు రేణుకార్యునిఁ
బరికింపఁగ మంత్రివరులు పంపిన చారుల్
తిరుగుచు సందుల గొందులఁ
బురవీథులఁ గూడళులను బోయిరి వెదకన్. ౮౩

శా. ఆడుం; బాడును; మాటలాడుకొను; న
యాృకాశ మీక్షించు; వెం
టాడుఁ మూఁకల; నట్టహాసమును జే
యంబూనుఁ; గన్బొమ్మలన్
ఆడించుం; దనగుడ్లఁ జింపుకొను; బి
ట్టాలించు నేమేమొ! యీ
జాడన్ రేణుకఁ డా పురిం దిరుగు చా
శ్చర్యంబుగా వర్తిలెన్. ౧౪

క. ఒకచోటఁ జెట్టు మొదలను
వికవిక నగుచున్న వెట్టివెంగల పగిదిన్
ఒకని విని యాతఁడే రే
ణుకుఁ డని డాయంగఁ జని కనుంగొని చారుల్. ౧౫

గీ. వారిలి యడుగుల "దేవ! భూపాలమౌళి
మిమ్ముఁ దోడ్కొని రమ్మని మమ్ముఁ బంపె
వడిగ దయసేయుఁ" డనుడు, న వ్వెడఁగు వారి
పలుకు లర్థంబు గానట్లు పలుకఁ డయ్యె. ౧౬

చ. అడిగిన మాట కుత్తరము
నాడఁడు; చూడఁడు మోము ద్రిప్పి; లే
వఁడు; కదలండు వేఁడినను
బల్మిఁబలు వారలు; కూరుచుండెఁ బెన్

జడుగతి మిన్న కాతఁ డెద
నవ్వుచు; మొండరి రాజుకన్న నె
క్కుడు బలవంతుఁ డన్న పలు
కుల్ నిజమై కనుపట్టె నత్తఱిన్. ౮౭

గీ. విసివి వేసారి చారు లెవ్విధిని నేని
నతనిఁ గొంపోవకున్న ఱేఁ డలుగు నంచు
హాతము సేయంగడంగ మహాత్ముఁ డతఁడు
"నన్నుఁ బీడింప మీ కెట్టి పున్నె మబ్బు. ౮౮

చ. వెడఁగను; బిచ్చగాఁడ; నిఱు
పేదను నేఁ; బని లేదు నాకు మీ
యొడయనితోడ; నెందులకు
నూఱక న న్నిటు నిర్దయాత్ములై
బడుగును హింస సేసి కదుఁ
బాపముఁ గట్టుకొనం దలంతు? రిం పో
వుఁడు బ్రిదుకంగ నిండు; ననుఁ
బొమ్మనఁ బోవుదు నూరు వీడియున్." ౮౯

ఆ. వె. అనుచుఁ గదలిరాక యటనె కూర్చుండిన
వెట్టివానిఁ బట్టి బెట్టిదముగ
తెక్క లంటఁగట్టి కిక్కురు మనకుండ
బలిమి లాఁగి చరులు వెలలు చుండ. ౯౦

ఉ. కొందఱు నెత్తి గ్రక్కుకొని
కూలిరి నేలను; మూర్ఛ మున్గినా
రొక్కొందఱు; జీవముల్ విడిరి
కొందఱు; నేతులు కాళ్లు వ్రిస్సి వే
క్రిందఁ దటాలునం బడిరి
కెవ్వునఁ గొందఱు; చేటు దప్పునే?
ఎందును దేవతాసముని
నిట్లభిభూతునిఁగా నొనర్చినన్. ౯౧

క. అవశిష్టులైన చారులు
జవగతి భూపతిని డాసి జరిగిన దెల్లన్
సవినయము నివేదించిరి
యవనీపతి యక్కజంబు నంది యెడందన్. ౯౨

—. కాంచీరాజు రేణుకుని దర్శించుట.—

క. "ఈతండె రేణుకార్యుం
డీతని మహిమమున జరిగె నిది యెల్లయు నేఁ
జూతుఁ జని; శరణుఁ గోరిన
పాతకులను గాచుఁ గాదె భగవానుఁ డిలన్." ౯౩

చ. అనుకొను చా ప్రదేశమున
కా ధరణీపతి యేగుదెంచి యా
తని పదకంజయుగ్మమునఁ
దత్పరతం బడి కేలుమోడ్చి యో

యనఘ! మహాత్మ! నీదగు మ
హాత్మ్య మెఱుంగక చేసినట్టి దూ
షణముల సైఁచి మమ్ముఁ గొని
ఛాత్రులుగాఁ గృప నుద్ధరింపుమీ! ౯౪

ఆ. వె. దైవవిగ్రహంబుఁ దలఁచి రాతిగ మేము
పామరత్వమునను బలికినాము,
దండములకు సాటి దాసుల దోసముల్
పాలముంతో? నీట నోలి ముంతో? ౯౫

క. ఇలువేల్పే కామేశుఁడు
కలఁ గన్పడి నాకు నీదు కత నెఱిఁగించెన్
ఇలఁగల నిధి కనబడుఁ గ
జ్జలంబు వేసినసె, యట్ల జరిగె మహాత్మా! ౯౬

క. నిను దూషించుట చేతనె
ఘనకంపము గలిగెనంట కాంచీపుర దే
వునికిన్ వరదస్వామికి
ననుగ్రహము సేసి మమ్ము నది మాన్పఁగదే! ౯౭

—రేణుకుఁడు వరదరాజశిరఃకంపమును నివారించుట—

క. అనుచుం గ్రమ్మఱఁ గ్రమ్మఱ
మనవులు పొనరించు చున్న మహీపతిఁ గని య
మ్మని కనికరించి, కైకొని
తన రేణుకరూప, మిచ్చి దర్శన మనియెన్. ౯౮

గీ. చింతిలకు! చింతిలకు! భూమికాంత! నీవు
ఆ శివానుగ్రహంబు నీ యందుఁ గలిగె
సత్య మేకామ్రనాథు పూజలను విడుట
వరదరాజమహాస్వామి శిరము వణఁకె. ౯౯

క. శివపూజ విసర్జించిన
నవు లోకంబులకుఁ గీడు; హర్షింపఁడు వి
ష్ణువు దనుఁ బూజించిన నా
శివునిం బూజింపకునికి; సిద్ధ మిది నృపా! ౧౦౦

ఆ. వె. అని వచించి రాజుఁ గొని కోవెలకుఁ బోయి
వణఁకుచున్న స్వామి వరదరాజు
తలను దనదు హస్తతల ముంచి యొత్తుడుఁ
గంప మణఁగె, తేని కింపు వుట్టె. ౧౦౧

గీ. తొల్లి రేణుకు దూషించి తూలినట్టి
భటసమూహంబు నిద్దురం బాసినట్లు
బ్రిదికి యచ్చోటి కేతెంచి వాని కెరగి
రద్భుతంపడి కనుచుండ నవనిభర్త. ౧౦౨

చ. ఇనుమడియైన బత్తిని మ
హీపతి రేణుకుకాళు లంటి వం
దన మొనరించి దేవ! యిదె
నాదు ప్రతిజ్ఞ? యితఃపరంబు నా



శ్రీ రేణుకాచార్యులు కాంచీక్షేత్రమందలి

వరదరాజమూర్తి శిరఃకంపము నివారించుట

తనువు గలంతకాలమును
దప్పను నే శివపూజ; భూమి దీ
నిని జరిపింతు; నా ప్రజలు
నేనును ధన్యుల మయ్యు! నీదయన్. ౧౦౩

క. శివమతసిద్ధాంతంబులు
చెవులకు విందుగ నెఱుంగఁజేయుము! నాకున్
భవసంకటములు మాన్పుము!
దవులకుఁ ద్రోయుము మదీయతమ మని కోరన్. ౧౦౪

ఉ. చంచల యట్లు జీవితము
చంచల; మున్నదొకో సుఖంబు? ప్రా
పంచికభోగబృంద మది
వర్తిలుఁ మీసల తేనె యట్లు; నే
వించుచు శ్రీమహేశ్వరునిఁ
బెద్దయు బత్తిని భోగముల్ విస
ర్జించి విరక్తిఁ గాంచి విర
చింపుము యత్నము ముక్తిఁబొందఁగన్. ౧౦౫

క. జపియింపుము శివమంత్రము;
దపియింపుము శివునిఁ గూర్చి; తన్మతము భువిన్
విపులం బొనర్పు; మని యతఁ
డుపదేశం బిచ్చి యెగిరె వ్యోమమున కొగిన్. ౧౦౬

## —◆ మాసనూరు వృత్తాంతము ◆—

మ. సిరిసంపత్తుల కాటపట్టు సుకృత
శ్రీమందిరం బిందు శే
ఖరుక్షేత్రం బిల మాసనూ రనఁగ నొ
క్కం డుండె గ్రామంబు; త
త్పురమం దా గుడిముందుఁ బొల్చును
వటంబుల్ రెండు దిగ్వ్యోమముల్
సరవిం గొల్తలు వేయు బద్ద లనఁగా
శాఖాగ్రముల్ పర్వఁగన్. ౧౦౭

క. తము నాశ్రయించెడి విహం
గమముల నవి దాఁచి తమదు కడుపునఁ గాచున్;
దమ క్రిందఁ జేరు పథికుల
గమిఁ దమ గాత్రములఁ గప్పి కాచుచు నుండున్. ౧౦౮

క. అవి యెంత సౌఖ్యకరములొ
పవ లిట, నిసి నంత నవి యుపద్రవకరముల్;
నివసించిరి యా తరువులఁ
గువృత్తు లాల్మగ లగు నిరుగురు రాత్రిచరుల్. ౧౦౯

శా. ఆ వృక్షంబులఁ గాపురించుచుఁ బ్రియా
ణాయాసవిశ్రాంతికై
రా వీక్షించి నిశాచరుల్ పథికులం
బ్రాపించియున్ నల్లులై

చేరన్ నెత్తురు ద్రావి గుంజి నరముల్
చెప్పంగ నేముండెఁ? ద
ద్గ్రీవాభంగ మొనర్చి మన్నిఁగొని భ
క్షిం త్రాత్మరూపంబుతోన్. ౧౧౦

క. అనుదినము వార లీగతిఁ
బొనర్చుచుం ద్రెంత ప్రాణిమొత్తముఁ దమ పొ
ట్టను బెట్టుకొనిరొ? జీర్ణిం
చునె పాపము? కుడుప కేల చొప్పం దప్పున్. ౧౧౧

—॰ రేణుకాచార్యుఁ డేఁగుదెంచుట ॰—

క. లోకక్షేమంకరుఁ డగు
నా కుహనాశివుఁడు రేణుకాచార్యుఁడు దా
నీ కత నెఱింగి దీని ప్ర
తీకార మొనర్పఁ దత్ప్రదేశముఁ జనియెన్. ౧౧౨

క. ఎరకై పోయిన పులుఁగులు
దిరిగి కులాయముల కేగుదెంచుచు నుండెన్
హరిదశ్వుఁ డొసఁగు కెంపుల
తెరఁ దాల్చెను బడమటిదెస తెఱవ మొగమునన్. ౧౧౩

ఆ. వె. అవతరించి రేణుకార్యుఁ డచ్చోటికి
వింటినుండి శివు జపించుకొనుచు
దేవళమున కేఁగి దేవుని దర్శించి
విశ్రమింపఁబోవు వేళఁ దాను. ౧౧౪

గీ. వచ్చి పూజారి 'పాంథుడా! బడలి యుంటి
కాని విశ్రాంతియోగ్యంబు కాద యిచటఁ
బనలు స్వర్గంబు; రేయి యీ ప్రాంత మెల్లఁ
గడు భయంకరనరకంబు; కానఁ బొమ్ము!' ౧౧౪

మ. విని తద్వాక్య మెఱుంగనట్లు ముని తా
వే పూజరిం గాంచి యో
యనఘా! ఏటికి విశ్రమార్హ మిది గా?
దాంధ్యంబు నల్దిక్కులన్
ఘనమై పర్వెను; గానఁగాఁబడదు మా
ర్గం బల్ల ముక్కంటికిన్
జనఁగాఁజాలఁ గడింది డస్సితి; బ్రియా
ణం బోర్వ నోక్కింతయున్. ౧౧౮

క. ఆయస్తులైనవారికి
నీ! యాతిథ్య మిడ కిట్లు చెన్నటివై పో!
పో!యందు వేల? దయలే
కో యర్చక! చాలు నూరకుండుమి యనుడున్. ౧౧౬

ఆ. వె. అర్చకుండు దాని కలుగక "యో సాధు!
త్వద్హితంబుఁ గోరి పలికినాఁడ
నీ మహీజములను నిరువురు రక్కసుల్
గలరు చంపివేయఁగలరు నిన్ను. ౧౧౭

మ. పగటన్ నల్లుల రూపుఁ దాల్చి యసుర
ద్వంద్వంబు కానంగ రా
కగుడున్ రాతిరి స్వస్వరూపముల మా
ర్గాయత్తులై యిచ్చటం
దగ నిద్రించెడు పాంథపంక్తిఁ బెదని
ద్రంబుచ్చుఁ; దప్పించుకో
నగు నా కాలునినుండి, కాదు సుమీ! క్ర
వ్యాత్పీడఁ దప్పించుకోన్. ౧౧౯

క. సాయంతనార్చనంబును
జేయుటయే తడవుగాఁగఁ జెచ్చెర నేనుం
బోయెదఁ; దెలిపితి నా పయి
నీ యిచ్చ'' యనంగఁ దా ననెం బాంథుఁ డిటుల్. ౧౨౦

క. భవితవ్యంబును దాఁటఁగ
నవునే? యెవ్వారి కేని నరయంగా మృ
త్యువు రాదె డాఁగు చోటికి?
శివసన్నిధి మృతినిఁ గొనుట శ్రేష్ఠమ కాదే? ౧౨౧

మ. అదియుంగాక యొడల్ కృశించెఁ; బటిమం
బత్యంతముం దగ్గె; నీ
యుదరార్థంబు పురావిధిం దిరుగఁగా
నోర్వన్; మనఃస్ఫూర్తిగా

బ్రదుకాసం ద్యజియించియుంటి; నసుర
ద్వంద్వాని కాహారమ
య్యెద ధ్యానించు చనన్యచిత్తమున మా
హేశాంఘ్రిపద్మంబులన్." ౧౨౨

ఆ. అనుచు నేలమీఁద నలఁత న్నటించుచుఁ
బండుకొనెను బొంత పఱచి యతఁడు
కన్నుదోయి మూసి గాఢనిద్రాపార
వశ్య మభినయింప, వాఁడు చనియె. ౧౨౩

## యక్షదంపతుల విధ్వంసనము

క. పరమేశ్వరు ధ్యానించుచు
గుఱుకొట్టుచు నుండ రేణుకుఁడు, డగ్గఱి యా
సురయుగ్మము పట్టఁగరాఁ,
బరికించియు నుదుటికంటఁ బఱపెను మంటల్. ౧౨౪

గీ. ఆ నిశాచరు లతని నేత్రాగ్నిఁ గ్రాఁగి
యయి యయోగోళకద్వంద్వ మచటఁ బడియెఁ
గాలిన నొడల్లు, వారల కలుషరాశి
కాలిపోక వహించె నాకారము లన. ౧౨౫

శా. ప్రాతఃకాలము కాఁగ శంకరుని నా
రాధింపఁగా భక్తసం
ఘాతం బచ్చటి కేగుదెంచి, విని త
త్కార్యంబుఁ బూజారిచేఁ



శ్రీరేణుకాచార్యులు యక్షదంపతులను
ఫాలనేత్రాగ్నితో భస్మీకరించుట

జేతఃప్రీతిగఁ గాంచి గోళకములం
జేమోడ్పు లర్పించుచుర్
"లాఁతే? యీతఁడు మిత్తిగొంగయ యటుల్
చంపర్ మృషాయోగియై. ౧౨౬

చ. మన తొలిసేఁత లన్నియు న
మాంతముగా ఫలియించె నేఁ డిదే!
కనులకు విం దొనర్చుచును
గన్పడుచుండెను శంకరుండు; మో
మున నదె చిచ్చుకన్ను; మన
మున్పటి ప్రార్థనలం గ్రహించి యీ
దనుజులఁ ద్రుంప లోకముహి
తం బొనరింపఁగ నయ్యె నివ్విధిన్." ౧౨౭

క. అని హెచ్చరించు కొనుచుం
జను దెంచిన భక్తవితతి సద్భక్తిని వం
దన మాచరించి బహుపూ
జనములు సలిపిరి మహేశు సలిపిన సరణిన్. ౧౨౮

గీ. రేణుకుఁడు వారిఁ గాంచి హర్షించి పలికెఁ
"బరమపావనులార! సద్భక్తులార!
మీదు ప్రార్థన లాలించి మెచ్చి నన్ను
మీకు సేమంబుఁ గూర్పఁ బంపెను శివుండు. ౧౨౯

శా. కావింపుండు శివార్చనంబులు మనః
కాంక్షల్ ఫలింపంగ; సం
సేవింపుండు శివాంఘ్రిపంకజముల౯
శ్రేయస్సు సిద్ధింపఁగా;
శైవాఖ్యానములం బురాణముల ని
చ్చల్ పాఠముల్ సేయుఁడీ
కైవల్యంబు భవత్కరామలకమై
కన్పట్టు నిక్కమ్ముగ౯. ౧౩౦

క. ముక్కోటి దేవతలలో
ముక్కంటిని మిగులు వేలుపులు లేరు సుఁడీ!
నిక్కమ! నిక్కమ! యిది శ్రుతి
వాక్యాతనిఁ గొల్చి ముక్తిఁ బడయుఁడు మీరల్. ౧౩౧

క. శివయోగిని సేవించిన
శివుఁ డానందించుఁ దన్ను సేవించిన య;
ట్లవనిం భ్రమించుచుండును
శివుండె శివయోగిరూపుఁ జేకొని సతము౯." ౧౩౨

క. శ్రుతిపఱచి రేణుకార్యుఁడు
శితికంఠుని మహిమ లిట్లు, చేకొని గోళ
ద్వితయముఁ, బయనించెను దగ
నతులగు భక్తులకు దీవనలు గడు నిడుచు౯. ౧౩౩

క. కమ్మరిఁ గని బాటను గో
శమ్ములఁ జూపించి కత్తులను జేయుము నా
నమ్మని, బరువునఁ దనహ
స్తమ్మున నవి వాడు పట్టఁజాలక పోయెన్. ౧౩౪

ఆ. వె. ఎట్టకేల కత్తి పట్టి సాఁగఁగఁ గొట్టి
తనదు శక్తి నెల్ల ధారవోసి
చచ్చిచెడి యొనర్చె శాతఖడ్గంబుగఁ
బురుమగోళకమునఁ బోరి నతండు. ౧౩౫

క. పగిలింపఁగ స్త్రీగోళం
బగపడెఁ జైతన్య మున్నయట్టులు నెదుటం
దగు నొక దాసనపువు మ్రిం
గఁగ మాంసభ్రాంతిఁ బఱచుగతి నున్నట్లున్. ౧౩౬

క. పిఱువీఁక భీతి నా క
మ్మరి దానిని సాఁగఁగొట్ట మానీంద్రుం డ
త్తఱి సమ్మెట వేయించెను;
విరచించి యొసంగి వాఁడు పెన్నడిదంబున్. ౧౩౭

ఆ. వె. దేవ! యిట్టి గుండ్లు దిలకింపఁగా లేద;
చచ్చినట్టు లైతి సాగఁ గొట్టి
యినుపగుండ్లె కాని యిచుముకం బెను నివ్వి
కఠినతరము లగుచుఁ గానిపించె. ౧౩౮

## —। యక్షుల పూర్వవృత్తాంతము ।—

మ. అని తద్గోళకవృత్తముం దెలియఁజే
యం గోర నా రేణుకుం
డను మున్నొక్కమహామునీంద్రుఁ డొక పు
ణ్యారణ్యమం దొక్కచో
టను దీక్షించి తపంబుఁ దా సలుపుచుం
డం దత్పురోభాగమం
దునె క్రీడించిరి యక్షదంపతు లిసీ!
దుష్కామసంతప్తులై. ౧౩౯

మ. కనువిప్పంగనె కానఁగాఁబడిన య
క్షద్వంద్వముం గూర్చి క్రో
ధనుఁడై యమ్ముని వల్కె "జవ్వనపుమ
త్తా గాంచి కామాంధులై
కనులంగానక శంక దక్క యిటు దు
ష్కార్యంబుఁ గావించు మీ
ర్మనుఁడీ! రక్కసులై" యటంచు; విడె ను
గ్రస్ఫూర్తి శాపాంబువుల్. ౧౪౦

ఆ. వె. అంత నొడలు తెలిసి యక్షదంపతులు మా
నీంద్రుపాదములకు నెరగి బత్తిఁ
దము "క్షమింపు" మనుచుఁ దను వేఁడ నాతండు
గనికరించి వారిఁ గాంచి పలికె. ౧౪౧

గీ. "రేణుకుని మీరు బట్టి దోరింపఁ బోయి
వాని ఫాలాగ్నిఁ గాని శాపంబు ముగియు"
ననుచు నంతర్హితుం డయ్యె; యక్షదంప
తులు నిమేషార్ధమున రాక్షసులుగ నైరి. ౧౪౨

శా. అంతన్ వారలు మానసూరుపురమం
దర్ధేందుచూడాలయో
పాంతోద్భూతవటద్వయంబుపయి నా
వాసించి రేలందుఁ ద
త్ప్రాంతాయాతులఁ బాంథులం దునుముచుం
గ్రవ్యాశులై యుండి శా
పాంతం బొందిరి నేఁడు నావలన; గుం
డ్లైనారు వారే యిటుల్. ౧౪౩

మ. అనుచుం దత్కథఁ దెల్పి కమ్మరికి, నా
యాచార్యుఁ డా కత్తులం
గొని తద్గ్రామసమీపమందుఁగలవాఁ
గుం జేరి యం దొక్కఁడా
నినిఁ దాఁ బాఁతి యధోముఖంబుగఁ దగన్
"నే వచ్చునందాఁక నిం
దె నివాసింపుము ఖడ్గమా!" యనుచు నా
దేశించి కార్యార్థియై. ౧౪౪

—॥ రేణుకాచార్యుఁ డుజ్జయిని కేతెంచుట ॥—

ఆ. వె. ఆ ద్వితీయఖడ్గ మద్భుత తేజస్క
మతిఁ డలంకరించి హ_స్తమందు
వ్యోమసీమ కెగసి యుజ్జయినీపురం
బునకు బయలువెడలెఁ జనెడితోవ. ౧౮౫

గీ. జంబుకేశ్వర కిన్నరేశ్వరులు, మహిమ
నించు పాణిభద్రేశ సోమేశ్వరులును,
నలువలంకులఁ దచ్ఛోభ కలరి వెలయఁ
బరమపావన మొప్పుఁ బంపాసరంబు. ౧౮౬

గీ. అది శివక్షేత్ర మగుటచే నట వహించుఁ
దుంగభద్రాపరాఖ్యతో గాంగఝరము,
అటఁ దప మొనర్చువారి కవ్యయపదంబు
కరతలామలకంబ! పల్కతలిఁ కేల? ౧౮౭

ఆ. వె. అవతరించి రేణుకార్యుఁ డాక్షేత్రంబు
నందు స్నానమాడి హరునిఁ గొలిచి
కార్యభారకలనఁ గలకంతు సెలవొంది
వింటి కెగసె శివు జపించుకొనుచు. ౧౮౮

మ. చని శ్రీపాతటినీతటంబుపయి ని
చ్చల్ పొల్చు సిద్ధేశు పూ
జనలఁ ధన్యతఁ గొన్న భక్తుల నివా
సంబైన శ్రీమాళవం

బను దేశంబున, కందు మూర్తమగు పు
ణ్యశ్రీని గావించి ద
ర్శనముం గొల్వఁగ రేణుకుండు మరులా
రాధ్యుల్ సమీపించె దాన్. ౧౪౯

— మరులారాధ్యుని దర్శించుట —

క. మరులారాధ్యుఁడు సిద్ధే
శ్వరలింగోద్భూతుఁ డంచు జగతి న్నందీ
శ్వరగోత్రపతి యటంచును
బరంపరగఁ జెప్పుకొందుర్ప్రజ లెల్లరునున్. ౧౫౦

క. కలుపుచు లింగాంగైక్యముఁ
బురుషార్థచతుష్టయంబు బోధించుచు స
త్కరుణార్ద్రదృష్టి శిష్యుల
దురితంబులఁ గడుగు నా బుధుఁడు సంతతమున్. ౧౫౧

శా. అంతేవాసుల కా గురూత్తముఁడు మ
ల్లారాధ్యుఁ డెవ్వేళ వే
దాంతంబుల్ శ్రుతులుం బురాణములు శై
వాఖ్యానముల్ తెల్పు చ
త్యంతం బేర్పడ నేకవాక్యత యుప
న్యాసంబుఁ గావించుచున్
సంతోసిల్లఁగ జేయుచుండు దివిష
త్సందోహసంస్తుత్యుఁడై. ౧౫౨

క. మరులారాధ్యుఁడు మునియే?
హరుఁడ; యతని యాశ్రిమంబొ? యా కైలాసం;
బరయఁగ శిష్యులు ప్రమథుల;
ధర నియ్యది బొంకు గాదు తథ్యంబు సుఁడీ! ౧౫౩

క. మరులారాధ్యునిఁ గనుఁగొని
గురూత్తముఁడు పొందె రేణుకుఁడు హర్షం; బా
మరులారాధ్యుఁడు రేణుకు
దరిసించి తరించినట్లు తలఁచె నెడందన్. ౧౫౪

క. ఇరువురు జంగమతీర్థము;
లిరువురునున్ వీతిహోత్రు; లిరువురును మహో
త్తర శివకార్యార్థంబుగ
ధరణికి నవతారమైన ధన్యులు వారల్. ౧౫౫

క. చందనకర్పూరంబుల
చందంబునఁ గూర్చె వారి సమ్మేళన మా
నందంబు శిష్యవితతికి
నిందూదయమయ్యె వారి హృదయములందున్. ౧౫౬

— విక్రమార్కుఁడు రేణుకు నర్చించుట —

క. అమరావతి హసియించుచు
నమేయసంపదలచేత నామాళవదే
శము రాజధాని యుజ్జని
యమరుం; బాలించు విక్రమార్కుఁడు దానిన్. ౧౫౭

గీ. ఈతిబాధలు లేకుండ, నీతి విడక,
స్వప్రజారంజకుం డయి, వైభవమున
నమరపతిఁ ద్రోసిరా జని యా విభుండు
చల్లఁగా నేలుచుండె రాజ్యమును దొల్లి! ౧౫౮

చ. అతఁ డొకనాఁడు రేణుకుని
యంఘ్రియుగంబు స్మరించుకొంచు ని
ద్రితుఁ డగుడుం, గనంబడెను
రేణుకుఁ డాతని స్వప్నమందు; స
న్మతి నుపదేశ మిచ్చె శివ
మంత్రము; మేల్కని రాజు దాని వి
స్మృతిగొని యెట్లు నా కగును
రేణుకదర్శన మంచు వందురెఁ. ౧౫౯

క. తలవని తలంపుగా నా
కల వచ్చిననాఁటి రేపకడ వచ్చెను, భ
క్తుల పాలి పెన్నిధానం
బల రేణుకమాని విక్రమార్కుని కడకుఁ. ౧౬౦

ఉ. ముప్పిరిగొన్నబత్తిని వి
భుం డెదురేఁగి నమస్కరించి యా
యప్పకు నర్ఘ్యపాద్యముల
నప్పన సేసియు స్వప్నవృత్తముం

జెప్పి మహాత్మ! విస్మృతినిఁ
జెందితి నీ యుపదిష్టమంత్రముం
దప్పక క్రమ్మఱం దెలిపి ధన్యునిఁ
జేయుము నీదు దాసునిన్. ౧౬౧

ఆ. వె. ఆడఁబోవు తీర్థ మది యెదు రైనట్లు
వెదకు తీవ కాళ్లఁ బెనఁగినట్లు
నిన్నుఁగాంచు ఫౌంటె నేఁ దపించుచు నుండ
దేవునట్ల వచ్చితివి మహాత్మ! ౧౬౨

ఉ. నా సుకృతంబు పండినది;
నాదగు జన్మము సార్థకంబు; నా
దోసము లగ్నితప్త మగు
తూలచయం బటు రూపడంగె; సం
తోసమునందు నా మనసు
తొప్పఁగఁ దోఁగుఁ; ద్వదాగమంబునన్
నా సదనంబు వేల్పుసద
నం బనఁ బూతము నయ్యె సద్గురూ!" ౧౬౩

కం. అని పలుక విక్రమార్కుఁడు
మనమున హర్షించి గురుఁడు "క్ష్మాపతి! నీ భ
క్తిని మెచ్చితి; నీ కా శివు
ననుగ్రహము కలిమి నీప్సితార్థము దీఱున్. ౧౬౪

—• రేణుకుఁడు విక్రమునకు ఖడ్గము ననుగ్రహించుట •—

మ. ఇదిగో ! కాలభుజంగదంష్ట్ర యనఁగా
నెంతే భయోత్పాదకం,
బదరుం గుండెలు చూడఁ జూపఱకు నా
హస్తాసి; యద్దాని ని
చ్చెద నీ కిప్డు గురుప్రసాదమునుగా;
సిద్ధించు నిష్టార్థముల్;
పొదలుం నీకు మహేంద్రవైభవము; సం
పూర్ణాయురారోగ్యముల్. ౧౬౫

మ. అమరేంద్రుం డతిగౌరవంబున సమా
హ్వానించు నిం గొద్ది కా
లములోఁ; దత్పురి కేఁగ నీ వపుడు కే
లం దాల్చు నీ దివ్యఖ
డ్గము యక్షాంగన రూపుఁ బొంది మిగులం
గల్గించు నాశ్చర్య మా
త్మమునం; నాఁటికి దాని శాపము స
మాప్తంబౌ సుమీ ! భూపతీ !'' ౧౬౬

క. అని ఖడ్గపురావృత్తము
వినిపించియు దాని నొసఁగి వినయంబున దా
నినిఁ గండ్ల కద్దుకొనుచుం
గొనిన ధరాపతికి రేణుకుఁడు ప్రీతిమెయిం. ౧౬౭

గీ. "తత్త్వమ"స్యాదులైన శ్రుత్యంతవాక్య
ములకుఁ దా శివపారమ్యమును దెలుపుచు
దివ్యతరముగ బ్రహ్మోపదేశ మొసఁగి
యతని నానందవార్ధి నోలార్చివైచె. ౧౬౮

గీ. దివ్వె వెల్గించినట్టి మందిరమువోలెఁ
గారుమబ్బులు వాసిన గగనమువలె
వ్యాధినిర్మ్మలమైన దేహంబుకరణిఁ
దదుపదేశంబుచే రాజు హృదయ మడరె. ౧౬౯

గీ. అవ్విధిఁ గృతార్థుఁడై మ్రొక్కు నవనిభర్త
శిరసుపైఁ జేతి నుంచి యాశీర్వదించి
శిష్యవాత్సల్యమును జూపి సెల వొసంగి
వింటఁ గొల్హాపురమునకు వెడలిపోయె. ౧౭౦

తృతీయాశ్వాసము సమాప్తము.

---

# రే ణు క వి జ య ము

## చ తు ర్థా శ్వా స ము

### — కొల్హాపుర వృత్తాంతము —

క. సిరికాపురంబు కొల్హా
పురంబు తగుఁ; దత్ప్రసాదమునఁ దత్ప్రత్యల్
పరిపూర్ణసంపదలతోఁ
బరగుదు; రట నేలఁ బండు బంగరుపంటల్. ౧

క. ద్వాదశయోజన విస్తృత
మై దీప్తంబైన పైఁడి ద్వారంబులతో
భూదేవిభూషణం బనఁ
గాఁదగుఁ గొల్హాపురంబు; గాదు వచింపన్. ౨

శా. గోరక్షాహ్వాయచిహ్నితుం డొక మహా
కూరుండు, నానాదురా
చారారంభుఁడు, క్షత్రబంధుఁ డట రా
జ్యం బేలు; నాతండు దో
స్సారోదగ్రతఁ గొల్లగొట్టుచుఁ బ్రజా
సంక్షోభముం గొల్పుచున్
బారం బేదని పాపవర్తనలతో
వర్తిల్లె దుర్వృత్తుఁడై. ౩

క. ముకుసెవులను గోయించును
బికిరపువాఁ డగపడంగ వీథులలోనన్
మెకములకుఁ బోలెఁ జెఱసా
లకుఁ బంపియు గడ్డిపఱకలను వేయుఁ దినన్. ౪

క. తనయింటికి వచ్చిన యా
చనికులఁ గట్టించి హస్తచరణంబులఁ జే
యును జిత్రవిధలు, చెప్పం
గను బాపము వచ్చు నితరకలుషచరిత్రల్. ౫

క. అన్నెముఁ, బున్నెము, నెరుఁగని
మన్నీఁ డవ్వాఁడు పచ్చిమాంసము దినుచుం
గ్రొన్నెత్తురులం ద్రావెడు
చెన్నఁటి రాకాసి గాక క్షితి మనుజుండే? ౬

— రేణుకాచార్యుని ప్రవేశము —

మ. కరుణాంతఃకరణుండు రేణుకుఁడు లో
కక్షేమముం గూర్ప నా
దురహంకారుని పాపచిత్తు మదముం
ద్రుంగింప నేతెంచి యా
పురమార్గంబున భిక్షువేషమునఁ దాఁ
బోవంగ, నా ఱేని కిం
కరు లీక్షించి గ్రహించి త్రాళ్ళ నతనిం
గట్టంగ నుంకించుదుర్. ౭

క. చిక్కక చేతికిఁ బాఱుచుఁ
బిక్కలకును మెఱపుఁదీఁగ వడువున గొందిన్
నక్కుచుఁ దద్భటచయమును
లెక్కింపక శేణుకుఁడు బళీ! యేడ్పించెన్. ౮

గీ. మంత్రిము లెఱుంగు మాయలమారు లగుట
వారలు ప్రయోగమున వానిఁ బట్టఁ గడఁగి
రదియు వితథ యయ్యె; హనుమంతునెదుట నొక్క
పిల్లమంత్రింబు? లిట్లయ్యు విడక వారు. ౯

గీ. సింహశార్దూలముల నెక్కి చేతఁబూని
యీటె లాతనిఁ బొడువంగ నేఁగు దేర
వేసె దృఙ్మోహనాస్త్రంబు; బీర మడఁగి
చాపచుట్టలుగా నేల సరవిఁ బడిరి. ౧౦

క. పడిన తమవారిఁ గనుఁగొని
కడు దవ్వుల నున్న సైనిక వ్రాతంబుల్
హడలెత్తి తిరిగి చూడక
వడివడి వార్వములఁ గేళ్లు వాఱెఁ గడిందిన్ ౧౧

క. కదలీ కదలక యూర్పులు
వదలీవదలకయు వారు కందోయిని ని
య్యదనున మూసీమూయక
బ్రదుకును మరణంబుగాని వడువొంది రటన్. ౧౨

క. హతమార్చి క్రూరకింకర
తతిని నిరాటంకముగను దద్గోరక్ష
క్షితిపతి ప్రాసాదంబును
వెతకికొనుచుఁ బోయె నతఁడు బిచ్చంబునకై. ౧౩

శా. ఆ గోరక్షధరావరుండు తన శు
ద్ధాంతంబునం జారుశ
య్యాగారంబున హంసతల్పమున భా
ర్యాదేవితోఁ గ్రీడనో
ద్యోగాత్ముండయి యుండ ద్వారమునఁ బ్ర
త్యూహంబు నా రేణుక
శ్రీగుర్వగ్రిణి వల్కె బిచ్చ మిడు తం
డ్రీ! యంచు దీనాస్యుఁడై. ౧౪

క. మదనోత్సవమున నుండుట
బదు లాడకపోయె రాజు; వదలక మునియుఁ
బదిఁబదిగ నట్ల యఱచెను
దుది కాతఁడు క్రోధఘూర్ణితుండయి లేచెన్. ౧౫

క. తన సౌఖ్యవిఘాతంబును
జనుఁ డెవ్వం డోర్చు; నందు స్మరకేళికి సైఁ
చునె యంతరాయ మేక
క్షణార్ధమును గాఢమోహసంతప్తుఁ డిలన్ ! ౧౬

## —• గోరక్షుని యౌద్ధత్యము •—

గీ. లేచి కండ్లెఱ్ఱఁజేసి "యీ నీచుఁ డెవఁడు?
సరకుగొన కేల నన్నిట్టు లఱపు లఱచు?
భటులు బంధింప కీతని వదలి రేల?
ఎట్లు తప్పించుకొని వచ్చె నిటకు వీఁడు? ౧౭

ఉ. పక్షులు నీరు ద్రావవల
వన్యమృగంబులుఁ గంపమొందు గో
రక్షుని పేరు విన్నఁ, బెఱ
ప్రాణుల సంగతిఁ జెప్ప నేల? యీ
దక్షుని నాదు నాజ్ఞ జవ
దాఁటిన మూర్ఖులఁ గింకరాళి, నీ
పక్షినిఁ బట్టి చిత్రవధఁ
బట్టుదు నిప్పుడ" యంచు దృప్తుఁడై. ౧౮

క. "భరతము పట్టించెద నీ
దురాత్ముఁ డగు భిక్షుకునికిఁ ద్రోలుఁద్రొత్తట నం
చొఱనుండి పెటికి చురియను
గఱకరి చూపులను గనుచుఁ గాంతకు ననియెన్. ౧౯

క. "రమణీ! బిచ్చము వడ్డిం
పుమి యీ శాక్తాసిద్రోడఁ బ్రాహ్మన సతి పా
పము సేయఁజాలమిని, నా
రమణాజ్ఞను మీఱలేమి రాపడి నిలిచెన్. ౨౦

క. ఇతికర్తవ్యత దోఁపక
సతి యా గతి నిలిచి యొక్క క్షణ మొగిఁ బతి దు
ర్మతి దుర్వ్యవసాయంబులు
మతికిఁ జెతగొలుప నిట్లు మగనికి ననియెన్. ౨౧

ఉ. "వచ్చు నటంచ్రు గాదె! భగ
వంతుఁడె ధర్మపరీక్ష సేయఁగా
బిచ్చపువాండ్రి రూపమునఁ;
బెట్టినఁ బెట్టుఁడు భిక్ష; లేనిచో
వచ్చినత్రోవఁ బొమ్మనుఁడు;
పట్టి వధించుట నెట్టి పాపముల్
వచ్చునొ? కాలుచేత నెటు
వంటెటువంటివి వచ్చునో నెతల్?. ౨౨

ఆ. వె. అతిథిపూజనంబు నమరపూజనమును
నిత్యవిధులు గృహికి నీ వెఱుఁగవె?
అతిథిపూజలేని యమరపూజనమును
వితథ యటందురి వేదవిదులు బుధులు. ౨౩

గీ. భిక్షు విల్లిల్లు దిరుగు చివ్విధినిఁ గఱవు
"కాకు! మత్సదృశుఁడవు భిక్షుంబు నిడక
అగుము! భిక్షుంబు నొసఁగి నీయట్టివాఁడ"
వనుచు వచియింతురి ధర్మరహస్యవిదులు. ౨౪

ఆ. వె. "ఏ గృహస్థు బిచ్చ మిడకుండు నతిథికి
నా గృహస్థు పుణ్య మపహరించి
తనదు పాప మతని తలరుద్ది పోవు నా
యతిథి" యంచుఁ బెద్ద లనఁగ వింటి. ౨౫

క. నీ యెఱుఁగని ధర్మంబులు
నీ యెఱుఁగని శాస్త్రములును నిజముగఁ గలవే?
చేయని కాలిన పిమ్మట
నీ యిల నాకులను బట్టనేమి ఫల మగుఁగా? ౨౬

గీ. నాదు విన్నప మాలించి నాథ! కోప
ముజ్జగింపుము! కావింపు ముచితపూజ"
లనెడు ధర్మోపదేశ మా చెనటి వినఁడు
రుచ్య మగునె? చక్కెర పైత్యరోగి కెందు? ౨౭

శా. గోరక్షుం డది యాలకించి యను "నా
కుం బాఠముల్ చెప్పఁగా
నారంభించితివే? పతివ్రితవు గా
వా? మద్ధితంబైన వ్యా
పారం బెంచక మేలుగీళు లొనరిం
పం జెల్లు నీ; కట్లుగా
కీ రీతిన్ విపరీత వంచెఱుఁగ" నం
చెం తానే గోపించుచున్. ౨౮

క. "ఖండింపుమి ! యెదురాడక
ఖండింపుమి! పోయి బిచ్చగాని కరముఁ; గా
లుం డెవఁడు మంత్రిసంసి
ద్ధుం డగు నా యెదుట? నాకు దోసము లున్నే?" ౨౯

మ. అని కత్తిం దన చేతి కీయఁ గొని తా
నా దేవి తోఁ బుట్టఁ గం
పన మంగంబుల, నా మహేశ్వరపద
ద్వంద్వంబు ధ్యానించుచున్
మనమందుం బలిమేలుకై పయఁటఁ బ
ల్మా రశ్రులి న్నద్దు చం
గన సీమం గల రేణుకుం దరిసె "భి
క్షాం దేహి'' యన్వానినిన్. ౩౦

క. తఱిసి మొగమెత్త నాయమ
దరణిసహస్రికము వెలుఁగు తన్ముఖమందున్
మిఱుమిట్లు గొలుపఁ గనుఁగొని
పిఱువీఁకఁగ వెఱచు; నరుగ వెఱచు నెదుటికిన్. ౩౧

గీ. వెఱచి తలపోసె మఱియు నా మెఱుఁగుఁబోఁడి
"భిక్షుమాత్రుండె కా కాదిభిక్షు వితఁడు?
పాదపూజకు బదులుగా బడితపూజ
సలుపవలసిన కర్మంబు సలుపుకొంటి. ౩౨

క. పతియానతి దాఁటిన దే
వతాపచారంబు సేసి వర్తిల్లిన నేఁ
బతితన; కావునఁ బతి దే
వతాక నగు నే నొనర్తుఁ బతిశాసనముల్." 33

చ. అని తలపోసికొంచు మహి
తాత్మకు రేణుకు దగ్గఱించి వం
దన మొనరించి బత్తిమెయిఁ
"దండ్రి! నినుల్ శరణంబు గోరుచుం
టిని; ననుఁ బాల ముంచినను
నీటను ముంచిన నీదె భార; మే
మని వచియింతు నిన్నుఁ బతి
యానతిఁ గత్తిని దున్మ వచ్చితిన్. 38

క. పతి మెట్టిఁడైనఁ దత్సతి
పతియానతి మీఱరాదు; పతిఁ గడచిన దే
వత లేదు సతుల కని పం
డితు లగు మిముబోంట్లు పలుక నే వినియుంటిన్. 39

క. నా పసుపుకుంకుమంబులు
నీ పాలం గలవు; వానినిం గావఁగ దే!
నా పాతివ్రత్యంబును
నీ పదభక్తియును దేవ! నీ వెఱుఁగనివే? 3౬

ఆ. వె. బత్తి నొసఁగునట్టి వాని నెల్ల గ్రహించు
నీశ్వరుం డటంచు నెల్ల రండ్రు
బత్తి నొసఁగు నాదు కత్తి వేటు గ్రహించి
ధన్యురాలిఁ జేయఁ దలఁపు మయ్య! ౩౭

గీ. ఇట్టి లోకోత్తరం బైన యట్టి భిక్ష
నీకు లభ్యంబు గాదు క్షోణీతలమున
నిట్టి పుణ్యంబు పరులకు నేల కలుగు?
నాథునానతి దాఁటని నాకుఁ దక్క?" ౩౮

మ. అని పల్కన్ సతి, రేణుకుండు నగి 'య
మ్మా! యేమి వడ్డించినం
గొనుదుం, గాలుచునుండె నాదు కడు పాఁ
కొంటిం గడుం; దాళఁజా
లను వడ్డింపుము వేగిరంబ' యని తె
ల్పన్ రాణి యా ఫాలనే
త్రుని ధ్యానించుచుఁ గత్తిఁ దత్కరమునం
దుం గ్రుచ్చె నప్పట్టునన్. ౩౯

క. తన మూఁడవ నేత్రంబునఁ
గనఁగా రేణుకుఁడు కత్తి గరఁగె రసముగాఁ
గొని దానిఁ ద్రావె నాతఁడు
కనుచుండిన రాణి పొందెఁ గడు నచ్చెరువున్. ౪౦



శ్రీ రేణుకాచార్యులవారు గోరక్షనాథుని
గర్వమును హరించుట

## —• గోరక్షనాథుని గర్వహరణము •—

క. ఆ క త్తియె రివ్వునఁ జని
ఘ్మాకాంతుని కడుపుఁ జొచ్చి కాఁడఁగఁ దుర్తిలో
శోకించుఁ బెద్దపెట్టునఁ
గేకలు వేయుచు నతండు క్రిందం దొరలున్. ౪౧.

క. ఈ చేతఁ జేసినట్టిది
యా చేత న్ననుభవింతు రఖిలజనంబుల్;
నీచులు స్వకీయబలమును
జూచుకొనుచు నెఱుకమాలి సోలుదురు తుదిన్. ౪౨.

ఆ. వె. విని తదార్తనాదమును బంధుమిత్రంబు
లంతిపురమువార లరుగుదెంచి
యుపచరించుచున్న నూఱడఁ డయ్యె బా
హ్యోపశాంతి నణఁగు నొక్కొ వ్యాధి! ౪౩.

గీ. వచ్చి ధన్వంతరులఁబోని వైద్యవరులు
పెఱికఁజాలక పోయి రా కఱకు కత్తి
మందుమాత్రికులు పోసియు మాన్పఁజాల
రైరి యావంతయేనియు నధిపుబాధ. ౪౪.

గీ. వ్యాధి యొకటయి మందు వే ఱయ్యెనేని
స్వాస్థ్య మెట్లబ్బు? నెవ్వీధి సౌఖ్య మగును?
వ్యాధిగా దది తొల్లింటి పాపరాశి
తత్ప్రతీకార మెఱుఁగు నా తపసి యొకఁడె. ౪౫

క. యమయాతనఁ బడు చాతఁడు
"రమణీ! నేఁ దెచ్చుకొంటిఁ బ్రాణాపాయం
బు మదంబున భవదుపదే
శముఁ జీరికిఁ గొనక; బ్రదుకు సాంతంబయ్యెన్. ౪౬

క. యతులను, వ్రతులను సభ్యా
గతులను; సజ్జనుల భిక్షుకవ్రాతంబున్
అతితరముగఁ బీడించితి
వితగాఁ దత్ఫలము గుడిపివేయుచు నుండెన్. ౪౭

క. తన ధనముఁ దన ప్రతాపముఁ
గని కన్నులుగనక క్రొవ్వి కానిపనులు చే
యును ననుబోలెను మూర్ఖుఁడు
వినాశమును బొందుఁ దుదికి వీని ఫలముగన్. ౪౮

క. ఈ కొల్హాపురలక్ష్మికి
మా కులదేవతకు మ్రొక్కి మాన్పింతువె? యీ
భీకరనారకబాధను
కాకుండిన నాదు బ్రతుకు కల్లయ సుదతీ." ౪౯

క. అని నోడివి యంతకంతకు
ఘనతరమగు బాధ గొలుపఁ గత్తి కడుపునఁ ;
జనపతి మునికృప మూర్ఛిలె
ఘనవ్యథ దెలియమి మేలు గలిగె నృపతికిఁ. ౯౦

మ. రమణీరత్నము పేరెలుంగు నిడి యా
కర్ణించుచుఁ వేగ స్నా
నముఁ గావించి సుమంబులఁ ఫలములఁ
నానావిధంబైన ధూ
పములఁ దీపములఁ నివేద్యములఁ దాఁ
బళ్ళెంబునం గూర్చి యా
కమలాదేవి మహాలయంబునకు మొ
క్కం బోయె సద్భక్తిమై. ౯౧

క. కావించి యర్చనాదులు
దేవి సమర్పించి తాను దెచ్చిన నానా
నైవేద్యంబులు లక్ష్మీశ్రీ
దేవీకుంకుమముఁ దాల్చి తేజిలు నుదుటఁ. ౯౨

శా. తల్లీ! మత్పతి రాజ్యదర్పమున నాం
ధ్యం బొంది లోకంబు క్షో
భిల్లంజేసెను; ఘోరపాపములు గా
వించెఁ ఫలం బొందె మా

వల్లం దప్పులు సైచి నాదు పసుపుం
బారాణి రక్షించి వ
ర్థిల్లం జేయుము మంగళంబులు, పతిం
దీర్ఘాయువుం జేయుమీ! ౫౩

క. నా పతిదాస్యము జననీ!
నీ పదదాస్యంబు దక్క నే నెఱుఁగఁ బర
వ్యాపారంబులు; నన్నుం
గాపాడుము; తల్లి పుత్రికను గాచుగతిన్. ౫౪

క. వర మిచ్చుదాక నీ పద
సరోజయుగళంబు వదలఁ; జత్తున నన్నుం
గరుణింపవేని నిట నీ
పురస్థలిన'' యనుచుఁ బాదములఁ బడియుండెన్. ౫౫

గీ. ఇట్లు హరియించి యున్న యా యువతిఁ గాంచి
అమ్మవారు వచించె దయార్ద్రమతిని
''నీదు సాధ్వీత్వమే కాచు నీదు పతిని
వజ్రకంకటమై బిడ్డ! వగవ వలదు. ౫౬

మ, అవతారంబయి కుల్యపాక యను పు
ణ్యక్షేత్రమం దున్న యా
శివలింగంబున, దుష్టశిక్షణములన్
శ్రీశిష్టసంరక్షణల్

భువిఁ గావించుచు వచ్చుచున్న గురుదే
వుఁడు రేణుకార్యుఁడు బరా
భవ మొందించుట చేతఁ గల్గెను మహా
పాయంబు నీ భర్తకుఁడు. ౬౭

మ. పతి సేమంబును గోరుదేని నిపుడే
వైళంబ కొంపోయి; యా
యతిపాదంబుల వ్రాల్చుమీ! పతినిఁ బ్రా
యశ్చిత్తపూర్వంబుగా;
సతతానుగ్రహనిగ్రహంబులను ని
స్తందుండు; కాఁబట్టి యో
యతివా! యాతని శంకరుంబలెనె మీ
రర్చించి మే లందుఁడీ!.'' ౬౮

గీ. అని '''సుమంగలీ భవ'' యంచు నబ్ధికన్య
క్షితివరుని పట్టమహిషి నాశీర్వదింప
దేవి యడుగులనుండి యా తెలవ లేచి
హర్షమునఁ దేలు చింటికి నరుగుదెంచి. ౬౯

—• రేణుకుఁడు గోరక్షు ననుగ్రహించుట •—

మ. పతినిఁ వ్రాలిచి రేణుకాంఘ్రుల "క్షమ
ధ్వం మాం క్షమధ్వ'' మ్మటం
చతిదీనంబుగఁ బల్కఁ జేయుటయు లో
కారాధ్యుఁ డాచార్యుఁ డా

పతి శీర్షంబును హస్తపంకజమునన్
స్పర్శించుచున్ "నే క్షమిం
చితి; దీర్ఘాయువవై సతీయుతుఁడవై
జీవింపుమా! భూపతీ!" ౬౦

క. అని దీవించుచు నా భూ
పుని కడుపున నున్న ఖడ్గమును బెఱకంగా
మనుజేశ్వరుఁ డక్షతగా
తుఁనివలె రంజిలుచు లేచి తోరపుబత్తిన్. ౬౧

క. "జయ! జయ! సాంద్రకృపానిధి!
జయ! జయ! గురుసార్వభౌమ! జయ! జయ! స్వామీ!
జయ! శరణాగతవత్సల!
జయ! పుణ్యచరిత్ర! కల్మషలతాదాత్రా! ౬౨

క. తెలిసిన మూర్ఖుఁడనై నే
నలిపితి నపచారములను సజ్జనులగు వి
ప్రులకును, యతులకు, వ్రతులకుఁ;
బలుకంగా నేల? నేను బాపపుఁబురుగన్. ౬౩

క. ననుఁ బోలిన దుర్మార్గుఁడు
జనియింపఁడు పుడమియందు సత్యంబుగ; న
న్ననుతాపవహ్ని గాల్చెను
గనికరమునఁ గావు రేణుకస్వామి! నన్నున్. ౬౪

క. నీపాలఁ బడితి నన్నుం
బాపిష్ఠుం డంచు శాపబద్ధు నొనర్తో?
ప్రాపొసఁగి రక్ష సేతువో?
నాపయి దయఁ జూపి''యంచు నాథుఁడు వేఁడెన్. ౬౫

గీ. తేనివిన్నప మాలించి రేణుకుండు
"వత్స! దీర్ఘాయురారోగ్యభాగ్యములను
బడసి వర్ధిల్లుమీ! నీదు భార్య సాధ్వి
తదుపదేశంబు నీకు భద్రంబు లొసఁగు. ౬౬

మ. పరిపాలింపుము! ధర్మమార్గమున భూ
పా! నీదు రాజ్యంబు; నె
ల్లరు నాత్మీయులుగాఁ దలంచుచుఁ గడున్
లాలింపుమీ! భక్తి భూ
సురులన్ వేల్పుల నిచ్చలుం గొలువుమీ!
క్షోణీజన స్తుత్యమౌ
చరితంబుం గడియించుకొమ్ము! కలుగున్
శ్వశ్శ్రేయసంబుల్ తగన్. ౬౭

క. ఎవ రెవరినిఁ బీడించితి
వవిరళముగ నీవు వారి కందఱకు మహో
త్సవ మొనరింపుమి! యది గౌ
రవభంగ మటంచుఁ దలఁపరా దెన్నండున్. ౬౮

క. సిరి, మెఱుఁగుఁదీవవలె న
స్థిరంబు దేహంబు బుడగతీరునను విన
శ్వర మగు; ధర్మం బొక్కటె
స్థిరమై వెన్నంటి పోవు జీవినిఁ దుదిక౯. ౯౯

క. వెనువెంటఁ దిరుగుచుండును
జనవర! మృత్యు వటుగానఁ జనుఁడు తడయ కా
త్మను దైవభక్తిఁ బూనియు
ననన్యమతి ధర్మపథమునం దుండఁ దగు౯. ౨౦

గీ. ధేనుబృందంబునం గామధేను వట్లు;
పుష్పములయందు మందారపుష్ప మట్లు
గిరుల హిమగిరి యట్టు లా సురవితతిని
శివుఁడె శ్రేష్ఠుండు వాని నర్చింపు మీవు." ౨౧

చ. అని యుపదేశ మిచ్చి మహి
తాత్ముఁడు రేణుకుఁ డాఁదటం బునః
పునరభివాదముల్ సలుపు
భూపుని రాణిఁ గృపార్ద్ర దృష్టితోఁ
గనుచు శుభాశిషంబు లిడి
గాఢముగా శివభక్తి నేర్పి తాఁ
జనియెను వ్యోమమార్గమున
సన్నుతి సేయఁగ వేల్పుమొత్తముల్. ౨౨

## — మంగళవాడ వృత్తాంతము —

మ. అలరున్ మంగళవాడపేరి పురి మా
యాదేవి నాగన్ సతీ
తిలకం బొక్కత సంతులేమిఁ గడు న
ర్థిన్ నోఁచి యాయాయి వే
ల్పుల భగ్నాశగ నై భజింపఁ దుది లో
లో రేవణాచార్యునిన్
ఫలియించెం గడు పాపతివ్రతకుఁ బూ
ర్వంబైన పుణ్యంబునన్. ౨౩

క. "అల రేవణు దయచేతనె
కలిగెను గన్యక" యటంచుఁ గడుబత్తిని నా
వెలఁదుక తనదగు దుహితకు
నలరుచుఁ బేర్వెట్టె రేవణాంబ యటంచున్. ౨౪

క. బాలేందు రేఖవోలెను
బాలిక గొనె దినదినాభివర్ధనమును; ద
ల్లీలాలావణ్యంబులు
నోలిని నభివృద్ధిఁ బొందె జ్యోత్స్నవిధమునన్. ౨౫

క. అందంబునఁ జందంబునఁ
గందోయికి విందొనర్పఁ గన్య. జననికిన్
బందుగులకుఁ బ్రీతివేళక
బృందమునకు ముద్దుగొలిపి వెలయుచునుండెన్. ౨౬

ఉ. అత్తఱి వీరబిజ్జలుని
యన్వయజాతుఁడు తేఁడొకండు శ్రీ
మత్తుఁడు మాసనూరికడ
మాన్యుఁడు రేణుకుఁడొక్క వాఁక మున్
హత్తిన కత్తిగాథ విని
యద్ది గ్రహింప నొనర్చి యత్నముల్,
సత్తిని దార వోసియును
జాలక చింతిలుచుండె మెండుగన్. ౭౭

ఉ. అంతట నూఱకుండ కతఁ
"డా యసిఁ దెచ్చినవాని కిచ్చి మె
ప్పింతు మదర్ధరాజ్య" మని
పృథ్విని జాటఁగఁ బంచె; దాని క
త్యంతము సంతసించుచు మ
హామహమాంత్రికు లేము మేమటం
చెంతయుఁ బంతగించుకొను చేఁగి
మృతించిరి వ్యర్థయత్నులై. ౭౮

—ః ఖర్పరుని మంత్రిమాయ ః—

గీ. ఖర్పరాఖ్యుండు మాంత్రికాఖండలుం డొ
కండు కొంకణదేశ్యుఁ డీగాథను విని
శిష్యబృందంబు గొలువ విచ్చేసె నటకుఁ
బ్రౌఢి శార్దూలవాహనారూఢుఁ డగుచు. ౭౯

గీ. అరుగుదెంచియు దర్శించి ధరణిపతిని
నున్న వాకకొన్ని లేనివికొన్ని శక్తు
లాడె; జేడును బెగ్గడ లాలకించి
గుండియలు గొట్టుకొనఁగ నాగుబ్బుగొనుచు. ౮౦

మ. "పాడువంజేయుదుఁ బొద్దుఁ బశ్చిమదిశన్;
వ్యోమంబునం గాళ్లతో
నడువం గల్గుదు; సప్తసాగరము లా
సంజాలుదున్; నిప్పులన్
ఒడిలోఁ గట్టఁగ నేర్తు; నాకు సరివాఁ
డుర్వీస్థలిన్ నాస్తి; నేఁ
బడయం జాలితి సూ! మహాతపమునన్
వర్తిల్లి యీ విద్యలన్. ౮౧

క. పన్నెండువేల మందిని
గన్నెల బలి యిచ్చికాని ఖడ్గమును మరే
తెన్నునను దీయరాదని
విన్నప మొనరింప నొప్పి పృథ్వీపతియున్. ౮౨

గీ. ఆనతిచ్చెను సచివుల "కంతమంది
కన్నియలఁ బట్టి తెం"డని కరుణమాలి
పరుల ప్రాణంబులను గడ్డిపఱకలుగను
దలఁచెదరు స్వార్థపరులైన ధరణిపతులు. ౮౩

క. అదరించుచుఁ దిట్టులచే
బెదరించుచుఁ గత్తిఁ జూపి బెట్టిదముగ దు
ర్మదులైన భటులు దూఱుచు
సదనంబులఁ గన్నియలను సాధించి రొగిన్. ౮౪

ఆ. వె. దయను మాలి భటులు దల్లిఱొమ్ములనుండి
యుగ్గుఁ ద్రాఁవు కాళ్ళనుండి బలిమి
నోడులనుండి చూపి యడిదంబు హరియించి
చనిరి కన్నియలను సంగ్రహించి. ౮౫

క. పిల్లలను బాయు తల్లులఁ
దల్లుల కెడమై బలాత్కృతతఁ జను నా యా
పిల్లలయు ఘోష లక్కట!
పెల్లుగ గుండియలు చీల్చువితమున నుండెన్. ౮౬

క. "మృత్యువుఁ దప్పింపంగా
మృత్యుంజయు శరణ మొంద మే"లగు ననుచున్
అత్యధికభక్తిఁ బ్రజ సం
స్తుత్యు మహాదేవుఁ జేయఁదొడఁగెను బూజల్. ౮౭

శా. ఆ మాయాసతి కన్యకాహరణ వృ
త్తాంతంబు నాలించి చిం
తామగ్నాత్మను రేవణాంబ దురవ
స్థం దల్చుకొన్చుండ; న

ద్దామారంభులు కాలకింకరసముల్
తద్రౌద్భటుల్ వచ్చి కు
య్యో! మొఱ్ఱో! యని యేడ్చుచున్నను మహా
హుంకారసంరంభులై. ౮౮

గీ. రేవణాంబిక నీడిచి తెక్క వట్టి
తల్లడిలుచుండఁగాఁ దల్లి, వెళ్ళిపోయి;
రకట! భూపతి కర్కశుం డయ్యెనేని
భటులు కర్కశతరు లయి పరగఁగలరు. ౮౯

శా. మాయాదేవి సుతావియోగము సహిం
పంజాల కాత్మంబునన్
జేయంజాలక యే ప్రతిక్రియయుఁ
దాఁ జింతిల్లి చింతిల్లి "నా
కా యమ్మాయి ననుగ్రహించిన ఘనుం
డా రేణుకాచార్యుఁడే
త్రోయంజాలును నాదు దుఃఖ"మని తో
డ్తో మోడ్చి కై మోడ్పులన్. ౯౦

గీ "ఎంతతడ వేఁ దపించితి సంతుకొఱకు
నంతతడవైన సంతసం బంద నైతిఁ;
జెలఁగ వలచేత నొసఁగి డాచేతఁ గొనుట
స్వామి! నినుబోటి గురునికి సముచితంబె! ౯౧

ఆ. వె. ఎవరితో వచింతు? నెవ్వరు రక్షింతురి
తెచ్చి నాదు బిడ్డ నిచ్చు నెవఁడు?
కంచె చేని మేయఁ గాఁ పేమి సేయును?
బతి నృశంసుఁ డైన బ్రదుకు గలదె? ౯౨

క. నిన్నే నమ్మితి; నాదగు
కన్నియఁ గాపాడి రేణుకా! చూపుము నా
కన్నులకు; నీవు పేదల
పెన్నిధి వని చెప్పఁ బెద్ద విబుధులు వింటిన్. ౯౩

ఆ. వె. దిక్కు లేని ప్రజకు దేవుఁడే దిక్కండ్రు;
నిన్ను మించి దేవుఁ డున్నె నాకు?
నిన్ను నమ్మియున్న నిఱుపేదరాలను;
వేఁడుచుంటి దుహితృభిక్షఁ బెట్టు!" ౯౪

— మాయాదేవికి రేణుకుఁడు ప్రత్యక్షుఁ డగుట —

క. అని పెల్లుగ వాపోవుచు
వనితారత్నంబు దుఃఖపరవశయై నే
లను వ్రాలి మూర్ఛబొందెను
ముని రేణుకుఁ డరుగుదెంచి ముందట నిలిచెన్. ౯౫

ఆ. వె. అతని పాదధూళి యనిలాహతంబయి
వెలఁది సోఁక నాపె తెలివిఁ బొంది
లేచి రేణుకార్యుఁ జూచి ముప్పిరిగొన్న
బత్తి వ్రాలి పాదపద్మములను. ౯౬

క. "గురుదేవుండే బ్రహ్మయు
గురుదేవుఁడె విష్ణుమూర్తి గురుదేవుఁడె యీ
శ్వరుఁడు, పరాత్పరుఁడును నా
గురుదేవుఁడె యందు రట్టి గురువుం గంటిఁ. ౯౭

ఆ. వె. నా తపంబు పండె నా నోములు ఫలించె
నన్నుఁ గన్న తండ్రి! నిన్నుఁ గంటి
నిన్నుఁ గాంచకునికి యెన్నాళ్ళనుండియో
వాచియుండెఁ గనులు పరమపురుష ! ౯౮

ఆ. వె. వట్టి మూఢురాల; భవదంఘ్రి భక్తియే
కాక లాతి నెఱుఁగ లోకమందు;
నన్ని రోగములకుఁ ద్వన్నామభజనమే
నయ్యె నయ్య! నాకు నౌషధంబు. ౯౯

క. నీ కరుణను జన్మించిన
నా కూఁతును రాజభటులు నాఁచికొనిరి; యీ
లోకంబున దుర్జనశి
క్షాకార్యముఁ బూను నీదు కనులయెదుటనే. ౧౦౦

గీ. "నిన్ను దర్శింతు; నా బిడ్డ నీ పదముల
వ్రాల్చి మ్రొక్కింతు; నీదు దీవనలఁ బడయఁ
జేతు; నీదైన యుపదేశశిక్ష నిత్తు"
ననుచు నువ్విళ్ళు గొంటి వమ్మయ్యె నెల్ల. ౧౦౧

మ. నిను ధ్యానించినయప్డె నా యెడరు తం
డ్రీ! కొండచందాన వ
చ్చిన మంచుంబలె విచ్చి పోయి కలిగెన్
శ్రేయం బతఃపూర్వ; మో
యనఘా! "నే డిదియేల పాయ?" దని చిం
తాయత్తనై యుంటి; నీ
గనుఁగొంటిన్ సమసెన్ భయం; బిఁక గురూ!
కల్యాణముల్ నా కగున్. ౧౦౨

క. అని దైన్యంబునఁ బలికెడు
మనోవ్యథాకులితహృదయ మాయాదేవిన్
గనికర మొలికెడు చూడ్కుల
ననుగ్రహించుచును రేణుకార్యుఁడు వలికెన్. ౧౦౩

క. "శివు నాజ్ఞ లేక చీమయు
నెవనిం గుట్టద; యిఁకెట్టు లెడరులు గలుగున్?
శివపాదభక్తి గల మా
నవులం గాలుంపు డాయునా? నా తల్లీ! ౧౦౪

గీ. నీ శిశువుప్రాణములకు నో నెలఁత మిన్న!
నాదు ప్రాణంబు లొడ్డి మన్పంగఁ జూతు;
ధర్మము జయించుఁ దుదికి నధర్మ మడఁగి;
ధర్మమూర్తివి నీవు చింతలను విడుము! ౧౦౫

ఆ. వె. ఖర్పరుం డడంగు గర్వభంగం బొంది;
ధూర్తనృపతి మంచి త్రోవఁ బడును;
మనుజుఁ డెంత యున్నతినిఁ బొందు వినిపాత
మంతఁ బొందుఁ దుది నటంచు వినవె!'' ౧౦౬

—• ఖర్పరుని గర్వహరణము •—

మ. అని మానీంద్రుఁడు వల్కుచుండ నిచటన్
స్వాత్మంబునన్ బత్తి రే
వణు ధ్యానించెను శేవణాంబ శిరముం
బట్టీడ్చి ఖండింపఁ గ
త్తినిఁ బైకెత్తినఖర్పరుం డచట ని
స్తేజస్కుఁడై యంగముల్
గొన శైథిల్యముఁ గత్తి జాఱిపడ సం
క్షోభిల్లుచున్ మూర్ఛలెన్. ౧౦౭

గీ. మూర్ఛఁ దేఱియుఁ గొండొక ప్రొద్దునకును
మంత్రవిస్మృతి గలుగుట మాటరాక
తడఁబడుచు లేచి వీడి యా తావు వాఁడు
"బ్రదుకుజీవుఁడా!'' యనుకొంచుఁ బాఱిపోయె. ౧౦౮

గీ. మాంత్రికుండు పలాయనమంత్రి మోలిఁ
జదువు చుండంగ ఖడ్గాశ వదలివైచి,
తన మనోరథ మీడేఱకునికిఁ బొగులు
నా ధరానాథు చెంతకు నరిగె గురుఁడు. ౧౦౯

## —. రేణుకుడు వీరబిజ్జలు నుద్ధరించుట .—

గీ. తలవనితలంపుగా మ్రోల నిలిచి యున్న
యా జగద్గురు గని, భూపుఁ డాత్మకీయ
మగు నకృత్యంబునకు భీతి యావహిల్ల
నన్యగతిలేమి "శరణ"ని యడుగు లంటె. ౧౧౦

క. "గురువర! సత్కరుణాకర!
దురితతమఃపుంజసూర! దుర్మతదూరా!
పరమగుణాకర! ధీవర!
పరిహరియింపుము! మదీయపాపౌఘంబుల్. ౧౧౧

గీ. తలఁచి నీ కత్తిఁ గొన దుష్టతను వహించి
ద్వాదశసహస్రకన్యల బలి నొసంగఁ
గడఁగు నను బాపకూపానఁ బడఁగనీక
యుద్ధరించిన నీకుఁ జేయుదు నమస్సు. ౧౧౨

గీ. బుద్ధి వచ్చెను; నేఁడాది పూనుకొనను
నెట్టి పాపంబునకు; నొట్టు పెట్టుకొందు;
నీదుముఖచంద్రుఁ గాంచంగ నాదు తమము
పంచబంగాళ మయ్యె నో పరమపురుష.!" ౧౧౩

క. అని దీనాలాపంబుల
ననునయ మొనరింప, రేణుకార్యుం "డా చ
చ్చినవానిఁ జంపఁ బూనుట
యనుచిత" మని యెంచి తా దయామతిఁ బలికెన్. ౧౧౪

గీ. "ప్రకృతిరంజనమునఁగాని రాజుగాఁడు;
ప్రకృతిపీడన యమధర్మరాజ యగును;
రాజ వగుదువో? యమధర్మరాజ వగుదొ?
వత్స! భావించుకొనుము నీ స్వాంతమందు. ౧౧౫

గీ. కత్తిఁ గైకొని యే ఘనకార్యములను
దలఁచుకొంటివి సాధింపఁ; దలఁచి నావె
వెఱపు గొలుపుచుఁ బరదారపరధనాళిఁ
గొనుచుఁ బెనుపాపరాశినిఁ గూడఁబెట్టి!. ౧౧౬

క. ధర ధర్మేతరమతివై
పరిపాలన సేయునట్టి పతి "రాజ్యాంతే
నరకం ధ్రువ మ్మనుచు ధీ
వరబృందం బాడు నీతివాక్యము వినవే!. ౧౧౭

—। యక్షనిశాపాంతము; పంద్రెండువేల కన్యల బంధమోచనము ।—

గీ. కావలయునేని నేన యా కత్తిఁ దెచ్చి
నిత్తు నీ" కని తెచ్చి తానీయఁ బలికి
నది భయంకరసర్పమై యతనిపైకిఁ
బఱచె బుసకొట్టు చతఁడు పెల్లఱవు లఱవ. ౧౧౮

క. మహినాథుఁడు బతిమాలఁగ
నహిభీతి నడంప రేణుకాచార్యుం డా
యహిఁ దాఁక నదియు యక్షత
వహియించి నమస్కరించి బత్తినిఁ బలికెన్. ౧౧౯

మ. "గుఱినై మఱి మునిఘోరశాపమునఁ దుర్గాంత్యనుర్ఘూర్ణతన్
నరమాంసంబులఁ దించు, నీదయిన కం
టం గాంగి ఖడ్గంబనై
చిరకాలంబుగ నాను చీ జలములన్
జేడ్పాటు పై నుంటి; దే
వర! శాపాంత మొసంగి నన్ను విడుమా!
పార్థింతు నశాంతమై. ౧౨౦

క. సరి గలదే నీ మహిమకు?
సరి గలదే నీదు కృపకు జగతిం గలదే
నిరయభయము త్వత్సేవా
పరులకు? నినుఁ గాంచుకన్న భాగ్యము గలదే?" ౧౨౧

ఆ. వె. అనుచు సంస్తుతింప యక్షుని దీవించి
యమరలోకమునకు నంపివైచెఁ
బలువ ఖర్పరుండు చెలఁ బాసి కన్నియ
లెలమి మిన్నుముట్ట నెగిరి రపుడు. ౧౨౨

క. తమతమ బిడ్డలఁ గనుఁగొని
తమకంబున నందుకొనుచుఁ దలిదండ్రులు కూ
రిమి మెఱయ ముద్దుగొనుచు,
న్నమితమహోత్సవముఁ బొందిరి రత్తఱిని మదిన్. ౧౨౩

క. పారాయణ మొనరించుచు
శ్రీరేణుకనామ మెడఁద రెక్కొను బత్తిన్
శ్రీరేవణాంబ కన్యా
వారముతో రాజవీథి వచ్చుచు నుండెన్. ౧౨౪

ఉ. వారలు వచ్చి రేణుకుని
పాదములంబడ లేవనెత్తి య
వ్వారల కాశిషంబు లిడి, పంచిన
కూరిమి రేవణాంబ మా
యారమణీమతల్లి కిడి, యంచిత
భక్తినిఁ బౌరు లెల్లరున్
హారతు లిచ్చుచుండ గురుఁ
డా వినువీథిఁ జనెన్ యథేచ్ఛమై. ౧౨౫

—• చోళరాజ వృత్తాంతము •—

చ. శివునికిఁ దక్క నన్యులకుఁ
జేతుల నెత్తనివాఁడు, దేనినేన్
శివునికి ముందు నివేద్యమును
జేయక ముట్టనివాఁడు, నిచ్చలున్
శివు వెలిగాఁగ లాఁతుల భ
జింపనివాఁడును సద్గుణాకరుం
డవునొక రాజు చోళవిష
యంబును నేలుచు నుండెఁ దొల్లిటన్. ౧౨౬

గీ. అతఁ డొకతూరి సామంతులైన పాండ్య
కేరళాధీశ్వరులతోడఁ గీర్తనీయుఁ,
డమరలోకంబునకుఁ బోయి యమరపతినిఁ
గాంచియును మ్రొక్కకయు నేగుదెంచెఁ బురికి. ౧౨౭

గీ. తనుఁ దివిలోకేశుఁ జీరికిం గొనక యట్లు
నిండుసభ మ్రొక్క కేఁగు మన్ననిఁ గినిసి
తగ్గ శాస్తి నొనర్పంగఁ దలఁచి పిలిచె
క్ష్మాపతిఁ బురందరుం డొక్క కార్యమిషను. ౧౨౮

మ. పతి మన్నించి మహేంద్రునానతిని, ది
వ్యస్యందనారూఢుఁడై
తతవేగంబునఁ బోయి నాకముబహి
ర్ద్వారంబునన్ వేల్పు స్వః
పతిపాదద్వయముం గనుంగొని ప్రకో
పం బావహిల్లం గశా
హతి దూఁకించి తురంగమంబులఁ జనెన్
ద్వారంబుపై నత్తఱిన్. ౧౨౯

— శివభక్తుఁడగు చోళ నింద్రుఁడు గౌరవించుట —

గీ. చారచక్షుష్కుఁ డగు పాకశాసనుండు
స్వాపచారంబునకు లజ్జ నంది మదిని
తేనిని క్షమాపణంబు నర్థించి తెచ్చి
యర్హ్యగతి గౌరవించె నర్ధాసనమున. ౧౩౦

క. నరపతి పూర్వాధిక మగు
హరికృతసమ్మానమునకు నాత్మను మూలం
బరసి, యడంకువయ యలం
కరణంబయి భాసిలం దగఁ వచియించెఁ. ౧౩౧

చ. "ఎరగక నీకు నేను బురి
కేఁగుటఁజేసి మహేంద్రి! నిఁ దృణీ
కరణ మొనర్చి యుంటినని
'గర్వపుఁబోత' నటంచు నెంచి నా;
వెఱుఁగవు నావ్రితంబుఁ; ద్రిది
వేశుల కేరికిఁ గేలుమోడ్ప నా
హరునకుఁ దక్క; వేలుపుల
యం దధికుం డతఁ డంద్రు కోవిదుల్. ౧౩౨

క. శివుని యనుగ్రహమున న
న్నెవరును గెలువంగఁజాల; రెవ్వరును బరా
భవ మొందింపఁగఁ జాలరు
భువినే దివినేని సత్యము సునాశీరా! ౧౩౩

చ. అనవుడు నమ్మహేంద్రుఁడు ని
జాత్మను గొంకును బాసి తేనితో
ననెఁ "బొరపాటు వచ్చినది;
యప్పటి నీదగు చర్యకుం గడుం

గినిసి పరాభవించితినిఁ
గ్రించుదనంబున; నా మనంబు త్రపా
శన మొనరించుకొందును; గ
ళంకముఁ బాసెను నీ బుజాక్తిచేఁ." ౧౩౪

ఆ. వె. అనుచు ననునయింప నా రాజు సెలవొంది
తిరిగివచ్చి యాత్మపురమునకును
జరిగి నట్టి కథను దరుణికి వచియించి
శివు ననుగ్రహమున సేమ ముండె. ౧౩౫

గీ. ఉత్తరోత్తరశుభముల నొందుచున్న
నిట్టు లా దంపతులకు సహాయముగను
నాత్మవంశాంకురము లేని వ్యధ యొకండు
కలఁచుచున్నది నాఁటిన ములికివోలె. ౧౩౬

క. ధనకనకవస్తువాహన
సనాథమయి యున్న రాజసౌధం బేనిఁ
దనయులు లేకుండిన నది
పెను నారకముగనె కానిపించును గృహికిఁ! ౧౩౭

క. చంటను వెంటను వ్రేలుచు,
నంటికొనుచుఁ దిరుగుచుండ నలరుచుఁ బాపల్,
ఇంటి నొక దోసతోఁటగఁ
గంటం గను యువతి పుణ్యగతి యెట్టి దొకో! ౧౩౮

గీ. అమృతభాండంబు లబ్ధ మైనట్లు తమకుఁ,
దమ ధరణిఁ బండినట్లు ముత్యాలపంట,
వేయి చంద్రులు తమయింట వెలిఁగినట్లు,
పుత్రుఁ గని దల్లిదండ్రులు ముదము గాంద్రు. ౧౩౯

—॰ రేణుకానుగ్రహమునఁ జోశనకు సంతానప్రాప్తి ॰—

ఉ. సంతతి లేమి వారలు వి
చారముఁ బొందుచు నుండ నొక్క రే
యంతిమయామమందు మహి
తాత్ముఁడు భక్తపరాయణుండు త
త్కాంతకు రేణుకుండు కలఁ
గన్పడి యొక్క ఫలం బొసంగె ని
ద్రాంతమునందు లేచి తన
యక్కలఁ దెల్పెఁగ భర్త ప్రీతుఁడై. ౧౪౦

క. "మన యిలువేల్పగు శివుఁడే
యనుగ్రహము సేసి రేణుకాచార్యునిఁ బం
పెను గలలోనికిఁ; దప్పక
వనితామణి! నీదు కడుపు పండఁగ వచ్చున్" ౧౪౧

క. అనవుడు ముసిముసి నవ్వుచు
వనితయుఁ దలవాంచి యరిగె; భర్తయుఁ దా నేఁ
గెను; దన్నిశీథమున వా
రనంగకేళిం బొనర్చి రానందముతోన్. ౧౪౨

క. నెలదిరిగి నిండ మాసము,
లల పుణ్యముహూర్తమందు నా దేవి సము
జ్జ్వలచక్రవర్తిలక్షణు
నెలఁ బోని మొగంబువాని నిసుఁగుం గనియెన్. ౧౪౩

గీ. పనిచి పుత్రోత్సవంబు నా వసుమతీశుఁ
డప్పు డాయుష్యహోమంబు లాచరించి
దానధర్మంబు లొసఁగి యుత్సవముఁ జేసెఁ
బ్రజలుఁ గానుకలు వెట్టి రా బాలకునకు. ౧౪౪

గీ. బాలకుఁడు విప్రవరుల దీవనలబలిమి
బాలచంద్రునివలె నేత్రపర్వ మగుచు
దినదినవివృద్ధిఁ గనుచు వర్ధిల్లు చుండెఁ
దల్లిదండ్రులుఁ జుట్టాలుఁ దనియుచుండ. ౧౪౫

క. 'కులశేఖరి' యివ్విధమునఁ
గులశేఖరుఁడైన పుత్రకునిఁ గనె; మునిరా
ట్కులశేఖరుఁడగు రేణుకు
ఫలప్రదానం బదేల వ్యర్థత నొందున్? ౧౪౬

—॥ బృహస్పతి యాగమనము ॥—

క. తనకుం బుత్రుఁ బ్రసాదిం
చిన రేణుకుదర్శనంబు సేసి తరింపం
గను దలఁచుచుండ నొకపరి
చనుదెంచెను దేవగురువు క్ష్మాపతికడకున్. ౧౪౭

క. వచ్చిన వాచస్పతిఁ బతి
పొచ్చెము లేనట్టి భక్తిఁ బూజించి "మునీ!
చెచ్చెర సెలవీయుఁడు! మీ
యిచ్చ యెదేఁ జేయువాఁడ నిప్పుడ" యనుడున్. ౧౭౮

మ. "తనయుం గంటివి లేకలేక యని సు
తాప్రియుండు సంతుష్టుఁడై
పనిచెం దీవన, లా శచీయువతియుం
బంపెన్ మహానర్ఘ్యభూ
షణసందోహము; నా జయంతుఁ డనిపెన్
సౌవర్ణపాంచాలికల్
గొనుమీ!" యం చొసఁగెన్ బృహస్పతి; కొనెన్
క్షోణీంద్రుఁ డుద్బాష్పుఁడై. ౧౭౯

గీ. శిశువు దీవించి యమరదేశికుఁడు వలికె
"క్ష్మాప! రేణుకు రప్పించి చూపుఁ బాలు
వరతదాశీర్వచఃప్రభావమునఁ జేసి
తేజరిలు ధాత్రిఁ జక్రవర్తిత్వ మొంది. ౧౮౦

క. శివతత్త్వ మతనిపగిదిని
భువి నెఱిఁగినవారు లేరు ముక్కంటి మహా
జ్ఞ వహించి యతఁడు లోకో
త్సవమునకై యవతరించె ధారుణిపైనిన్" ౧౮౧

—॰ చోళుఁడు రేణుకదర్శనమునకై పయనించుట. ॰—

ఆ. వె. అని వచించి తేనిశా సురాచార్యుండు
దేవలోకమునకుఁ దిరిగిపోయె;
మునివరేణ్యు రేణుకుని సమాహ్వానింప
బయలుదేఱె నాఁడె పార్థివుండు. ౧౫౨

క. పలుదేశంబుల బలువాఁ
కల వంకల దాఁటుకొనుచు క్ష్మాపతి మునిచం
ద్రుల కావాసంబగు నా
మలయాచలముం గనెం గ్రిమక్రిమగతులన్. ౧౫౩

ఉ. భాసిల భస్మపుండ్రములు
బాగుగఁ, జందనమూలపంక్తిఁ బ
ద్మాసనముల్ బిగించి, మెడ
లందుఁ దగన్ రుదురాకపేరు, ల
భ్యాస మొనర్చుచున్ నిగమ
పాఠము, లయ్యెడ గోచరించె స
ద్భానురసంచయంబు లతి
మోదముఁ గొల్పుచు భూపమౌళికిన్. ౧౫౪

క. వ్రతులై వాచంయములై
జితేంద్రియత్వంబుఁ బూని శివదీక్షావ్యా
పృతులై యతీంద్రులచ్చట
క్షితిపతికిం గానఁబడిరి చేయుచుఁ దపమున్. ౧౫౫

క. కొందఱు నాసాగ్రింబునఁ
గొందఱు భ్రూమధ్యమందుఁ గూడిచి దృష్టిన్
డెందంబుఁ జిందనీ కా
నందించుచుఁ బెను దపస్సునన్ మునిఁగి రటన్. ౧౫౬

క. చెలికారముతో గోవులుఁ
బులులుం జరియించు; సర్పములు నకులంబుల్
చెలఁగు నటం జెర్లాడుచుఁ,
గులవైరం బెఱుగ కవి సఖులవలె నుండెన్. ౧౫౭

క. తాపసజనవంద్యుం డగు
నా పుణ్యాత్ముండు రేణుకాచార్యుఁ డిటన్
గాపుర ముండెనొ? తగఁ గా
కీ పరిసర మింత యొప్పునే? యనుకొనుచున్. ౧౫౮

గీ. నిలిపి చతురంగబలము మన్నీఁడు దూల,
సాఁగి ప్రాంజలియై పాదచారి యగుచు,
వింతగాఁ దన్నుఁ గాంచెడి విప్రవటుల
రేణుకార్యుని బస విచారించికొనుచు. ౧౫౯

మ. చని భూపాగ్రణి ముందుముందులకుఁ దే
జస్సాంద్రమై యానవం
బనలం బట్లు వెలుంగఁ బై నివురుచా
యన్ భస్మపుంధూళి పై

ల్చనఁ గాంర్లన్, రుదురాకపూసల సరుల్
భాసిల్ల, శుశ్రూషకుస
న్మునిసందోహపరీతుఁడై తగు యతీం
ద్రుం గాంచె శ్రీరేణుకున్. ౧౬౦

క. శివపంచాక్షరిఁ గఱపుచు,
శివాగమరహస్యముల వచించుచుఁ బ్రోధిన్,
శివతత్త్వసుధను ద్రాపుచుఁ
బ్రవిమలుఁ డగు రేణుకుండు వర్తిల్లె నటన్. ౧౬౧

మ. దరిసింపంగనె వేనినిం గలుషబృం
దంబుల్ పటాపంచలై
విరుగున్; వేని యనుగ్రహంబు దగఁ బ్రా
పించున్ శివాద్వైతమున్;
స్మరియింపంగను వేనిఁ గామ్యము కర
స్థంబౌఁ దుర్టన్; దజ్జగ
ద్గురు నా రేణుకమౌనిచంద్రునిఁ గనెన్
క్షోణీశచంద్రుం డటన్. ౧౬౨

మ. కరముల్ మోడ్చి ముదశ్రునేత్రుఁ డగుచున్
గాత్రంబు సర్వంబు గ
గ్గుఱుపాటుం గొన, గద్గదస్వనముతో
క్షోణీంద్రుఁ డిట్లాడె నో

గురుదేవా! భవదీయదర్శనము చే
కూరన్ సుధాంభోధిలో
సరవిన్ మున్గినభాతి నాకుఁ గలిగెన్
సమ్మోద మొక్కుమ్మడిన్. ౧౬౩

క. భగవానుండా! పెద్దల
వగు నాశీర్వచనఫలమొ? యారచితంబై
తగు పుణ్యఫలమొ? లోకా
తిగు నినుఁ గా కెట్లు గాంతు దేశికవర్యన్? ౧౬౪

క. ఘనమతి! తావకసంద
ర్శన మది లభియింపకున్న స్మరియించినమా
త్రన శంభుఁ డిట్లు నీవును
దనయున్ దయచేసినావు ధన్యుఁడ నైతిన్. ౧౬౫

గీ. దివ్యచక్షుష్కత వహించి తెలియఁగలవు
సర్వకాలంబులందలి సంగతులను
నాదు రాకకుఁ గతము విన్నాణముగను
నీ వెఱుంగుదు; వైనఁ దండ్రీ! వచింతు. ౧౬౬

క. మొనమొన్న సురాచార్యుఁడు
చనుదెంచి తగం ద్వదీయచరణాంబుజ ద
ర్శనముం జేయింపుము నీ
తనయుని కని యాజ్ఞనిచ్చి దయచేసె నొగిన్. ౧౬౭

ఆ. వె. శిష్యవత్సలుఁడవు, సిద్ధవర్తనుఁడవు;
ఉద్ధరింప మమ్ము నోలి లెమ్ము!
కట్టినావు లోకకల్యాణమునకుఁగాఁ
గంకణంబు; నీకుఁ గలదె జాగు? ౧౬౮

చ. అనవుడు రేణుకుం డనె "ధ
రాధిప! మెచ్చితి నీదు బత్తినిన్,
వినయవిధేయతాక్రియలు;
పెల్లు ముదంబును గొంటి; నీదు కో
ర్కిని నెఱవేర్ప నీదయిన
గేహముఁగూరిచి యేఁగుదెంతు నీ
వెనుకనె; ముందుముందుగను
వెళ్లుము నీ వన సంతసిల్లుచున్. ౧౬౯

క. చతురంగబలముతో క్షితి
పతి తన నగరంబునకును వచ్చెఁ; దదాజ్ఞన్
బ్రతియిం డ్లలంకరించిరి;
కుతుకంబును గొనిరి ప్రజలు గురువుం జూడన్. ౧౭౦

ఆ. వె. స్వాగతం బొసంగఁ జతురంగబలముతో
గోపురంబు నెదుట భూపుఁ డుండె
వందిమాగధులును బండితావళి దొట్టి
జనములెల్ల చుట్టుకొనఁగఁ దన్ను. ౧౭౧

—• చోళరాజధానికి రేణుకుఁ డాగమించుట •—

ఆ. వె. భస్మధూళి మేనఁ బరిఢవిల్లుచు నుండ
రేణుకుండు దిగెను క్షోణిపైకి
నాకసంబు వీడి యల చంద్రబింబంబె
యవతరించె నంచు నంద అనిరి. ౧౭౨

మ. దిగుడుర్ భూమికి రేణుకోత్తముఁడు శ
బ్దించెన్ నగారాలు; పె
ద్దగ ఘోషిల్లె జయస్వనంబులు దిశా
తండంబునన్; వేశ్య లొ
ప్పుగ లాస్యం బొనరించి రెల్లరకు స
మ్మోదంబు సంధిల్లఁ; బం
డుగు గానించెను దూర్యనాదములు తో
డ్తో నిండి విన్వీథినిన్. ౧౭౩

ఆ. వె. అందలమున నుంచి యా రేణుకుని రాజు
దండె మోసికొనుచుఁ దాన పోయి
కాంచనాసనమున నుంచి పళ్లెరమందుఁ
గడిగెఁ గాళ్లు నీళ్లు పడఁతి పోయ. ౧౭౪

ఆ. వె. పాదజలము శిరసుపైఁ జల్లుకొని వారు
పాదధూళిఁ దాల్చి ఫాలమందు
తిరిగి తిరిగి మ్రొగ్గతిల్లంబడుచుఁ దెచ్చి
బాలు నుంచి రతని పదముల కడ. ౧౭౫

మ. శిరసందుం జెయివెట్టి యమ్మునియు నా
శీర్వాదముం జేసె ని
క్కరణిన్ "బాలుఁ డితండు పొందు నతిదీ
ర్ఘంబైన యాయుష్య, మి
ద్ధర నేకోత్తరవృద్ధిగా సిరు లనం
తంబైన సత్కీర్తియున్
హరభక్తాగ్రిసరత్వమున్ సుమహితం
బౌ చక్రవర్తిత్వమున్". ౧౭౬

క. అమృతంబు సెవులఁ బోసిన
క్రమమున వా రాలకించి కడు రేణుకు వా
క్యములను బులకింపఁగ గా
త్రి, మమందానంద మొంది స్తవియించి రిటుల్. ౧౭౭

క. "ధన్యులము మేము తిరిజగ
న్మాన్యుండగు నీకు మేము మాన్యుల మగుటన్
అన్యం బేటికి? మునిమూ
ర్ధన్యా! బోధింపు శైవతత్త్వము మాకున్." ౧౭౮

క. అని కోరఁగ రేణుకముని
వినిచెను శివభక్తి మిగుల విపులంబుగ న
జ్జనవరుఁడు కృతార్థత్వముఁ
గౌనె; సంతసపడుచు రేణుకుఁడు పయనించెన్. ౧౭౯

క. కట్టించె శివాలయములు;
పెట్టించెను బూజరుల నివేద్యాదులకై;
పుట్టినసినులకు శివుపే
ర్పెట్టించెను భూవరుండు పేరిన బత్తిన్. ౧౮౦

చతుర్థాశ్వాసము సమాప్తము.

# రేణుకవిజయము

## పంచమాశ్వాసము

—. రేణుకాచార్యుని కాంచీనివాసమహిమ .—

శా. ఆ కాంచీపురమందు రేణుకుఁడు లిం
గానందముం బొందుచున్
ఏకామ్రేశ్వరునాలయంబున ద్వితీ
యైకామ్రనాథుండునా
లోకక్షేమముఁ జూచుచు న్నిలువ, సు
శ్లోకున్ మహాభాగు నా
లోకింపం జనుదెంచుచుండిరి జనుల్
దూరంబునందుండియున్. ౧

క. చరణముల వ్రాలు భక్తుల
శరీరములఁ దాఁకి కల్మషంబుల నెల్లం
గరుణాజలమునఁ గడుగుచుఁ
బరిశుద్ధులఁ జేసి యతఁడు పంపుచు నుండెన్. ౨

ఉ. ఆ గురుదేవుపాదముల
నంటిన గ్రుడ్డికి వచ్చె నేత్రముల్;
మూఁగకు మాట వచ్చెఁ; బద
ముల్ లభియించెను గుంటివారికిన్;

రోగి నిరోగి యయ్యెఁ; గొమ
రుల్ జనియించిరి వంధ్యకుఁ; సిరుల్
బాగుగఁ బొందెఁ బేదయుఁ; ద
పస్వులు దుర్గతిఁ ద్రోలనేరరే? 3

ఆ. వె. కెవ్వు మనుచు వత్తు; రవ్వచుం బోదురు
చేతఁ దీసినట్లు చిత్తశోక
మును; మహాత్ముఁ డతఁడు ముంగొంగుఁ బసిఁడియై
సలుపుచుండె భక్తజనుల రక్ష. ౪

క. మహనీయుం డగు నీతని
నహమమహమిక వచ్చి భక్తు లర్చింతురు దు
స్సహసంసారక్లేశము
దహించుకొని పోవుచుందు రెల్ల నెలవులకున్. ౫

శా. ఏవంభూతశివాజ్ఞపాలనముకై యీ రేడు నూర్లబ్దముల్
ఈ విశ్వం బది యెల్లఁ గుమ్మరిజీ, స్వకీయేష్టంబు సాధించి యీ
శైవాద్వైతము సుస్థిరంబుగ భువిన్ స్థాపించుపూన్కిన్ మహా
దేవున్ ధ్యాన మొనర్చి మూసికనులు తేకించి చేమోడ్పులన్. ౬

క. తన దూడయెలుఁగు విని డా
పునకుం జను గోవుచందమున శంభుం డా
మునిపిలుపును విని విచ్చే
సెను గనులఁ గృపారసంబు చిందుచునుండన్. ౭

చ. కనఁబడి యాతఁ డిట్లు పలు
కం దొడఁగెం దగ "వత్స! నీతలం
పునకు జయంబు గల్గు; మదిఁ
బొందకు చింతలు; ముట్టనీదు పా
వనమగు చేత, భూమి నొక
బాలుఁడు వుట్టును; దండిరి పూనికిం
దనయుఁడు వోలెఁ దీర్చుఁ ద్వాద
నంతర మాతఁడు నీ యభీష్టముల్. ౮

క. అతఁ డాస్తికమార్గంబును
బ్రతినిధియై నీకుఁ బుడమిఁ బాలించుచు దు
ర్మతములఁ దోలును; సేయును
ప్రతిష్ఠ నీ ధర్మపీఠి వానినిఁ బుత్రా! ౯

క. ఆతనికి "రుద్రముని" యని
ప్రీతిగఁ బేర్వెట్టి కలుపు పరశివతత్త్వం
బాతతముగ" నని పలుకుచు
భూతేశుఁ డదృశ్యుఁ డయ్యె ముని కనుదెఱవన్. ౧౦



శ్రీ రేణుకాచార్యులు భూమిని స్పర్శింప
శ్రీరుద్రమునిశివాచార్యు లవతరించుట

## —•శ్రీ రుద్రమునిశివాచార్యుని యవతారము•—

శా. ఏకామ్రేశపురఃస్థలిన్ మునివరుం
డెంతేని నేమం బెదన్
స్వీకారించియుఁ గూరుచుండి శివునిన్
జిత్తంబునం దల్పుచున్,
దాఁకన్, జీల్చుచు భూమి వెల్గొకఁడు సం
ద్రింబున్ విభేదించు నా
రాకేందుప్రభవోలె వెల్వడెఁ; దమో
రాసుల్ నశింపన్ ధరన్. ౧౧

క. ఆ దివ్యద్యుతిమండలిఁ
బ్రాదుర్భావంబుఁ గాంచెఁ గ్రమముగ రమ్యా
స్వాదు లగు నంగములతో
దేదీపన్మూర్తి యొక్క దివ్యశిశు వొగిన్. ౧౨

ఆ. వె. నేలఁ దాఁకినంత సిసుఁ గుద్భవిల్లుట
యక్కజములలోన నక్కజంబ;
ఇది యసంభవంబె? యిలయందు సిద్ధసం
కల్పులగు మునిప్రకాండులకును. ౧౩

మ. నుదుటన్ గ్రాలఁగ భస్మపుండ్రరుచిసం
దోహంబు, కంఠంబునన్
రుదురాకల్ వెలుఁగన్, శిరస్పదమునన్
శుంభజ్జటాజూట మొ

ప్పఁ, దదభ్యంతరమందు లింగము కదుర్
భాసిల్ల, నా బాలకుం
డెదఁ గల్పించెను రేణుకార్యునికి నెం
తే నప్పు డానందమున్. ౧౪

ఉ. ఆడిరి యప్సరస్త్రీతి వి
యత్పథమందునఁ; గిన్నరాంగనల్
పాడిరి శ్రోత్రపేయముగ;
వాతము వీచెను, మెల్ల మెల్లఁగాఁ;
దోడన పూలవానయును
దుందుభినాదములుం దిశాతతిన్
బోఁడిమిమైఁ బ్రవర్తిలెను;
మోదముఁ బొందె సమస్తలోకముల్. ౧౫

క. ఆ కాంచీపుర మేలెడు
క్ష్మాకాంతుఁడు దీనిని విని మది యానందో
త్సేకమునఁ దేలఁ గడుఁగడు
లోకమున మహోత్సవంబులు పరికల్పించెన్. ౧౬

క. ఆ వింతబిడ్డ గాంచఁగఁ
బోవుటఁ దండోపతండములుగా జనముల్
ఆ వేపడగలసామికిఁ
జావమ్యైను బరువుమోయఁ జాలమికిఁ గటా? ౧౭

ఉ. మ్రొక్కుచుఁ జేతు లెత్తి నడు
ముల్ బిగియించి స్తవించువారుఁ బె
క్కక్కువఁ బూలుఁ బండ్లును స
మర్పణ సేసెడివారు; నెమ్మదిన్
బిక్కటిలంగ బత్తి కను
విందుఁగఁ గాంచెడువారునై ప్రజల్
వెక్కసపాటు దక్కి తల
పించిరి చిత్తరుబొమ్మలం దగన్. ౧౮

గీ. భక్తకోటి సమర్పించు పండ్లుఁ బూలుఁ
గడిఁది గుట్టలు గుట్టలుగాఁ బడంగఁ
దాఁకి వానినిఁ బ్రీత్యర్పితము లొనర్చె
గురుఁడు ప్రజ వానిఁ గొనె నవే వరము లంచు. ౧౯

—◆ రేణుకుఁడు రుద్రమునితో మలయాద్రిఁ జేరుట ◆—

గీ. కర్జముల నుజ్జగించి యక్కడనె నిలిచి
నినుఁగుఁ జూచుచుఁ దనియకుండిన ప్రజలకు
ననభిమతమైన భావికార్యానుసారి
గురుఁడు మలయాద్రి కేఁగెను గొనుచు బాలు. ౨౦

క. వరమలయాద్రిని రంభా
పురంబునం బెంచె రుద్రముని మాతగనై
గురుదేవుఁడె; మునిపత్నులు
చరియించిరి దాదులై ప్రశస్యతరముగన్. ౨౧

క. కఱపకయు సకలవిద్యలుఁ
గరామలక మయ్యె రేణుకస్వామికృపన్
హరగానము హరకథలును
బరగెను బాలునికి నిత్యపారాయణమై. ౨౨

క. అతఁడు శివాగమబృందము
శ్రుతిస్మృతి పురాణతతిని సొంపుగ శిష్య
ప్రతతికినిఁ గఱపఁజాలిన
ప్రతిభావంతుఁడుగాఁ బ్రవర్తిలు చుండెన్. ౨౩

ఆ. వె. ప్రాయమందుఁ జిన్నవాఁ డయ్యు నాతండు
విద్దెలందుఁ బడసెఁ బెద్దఱికము;
కలిగి యుండు మందుగుళిక చిన్నదియయ్యు
నంతరమునఁ బ్రబలమైన శక్తి. ౨౪

ఆ. వె. తన్ను మించినట్టి తనయుని వీక్షించి
జనకుఁ డెవఁడు గొనఁడు సంతసంబు?
తండ్రి రేణుకుండు తనపుత్రునిం జూచి
యాత్మ హర్షపడుచు ననియె నిట్లు. ౨౫

— రుద్రమునీశ్వరునకు శివతత్త్వము నుపదేశించుట —

మ. "తనయా! నీవు శివాంశజాతుఁడవు; త్వ
త్స్వాంతంబు పద్మాకరం
బున హంసంబువలెన్ విహారములు స
ల్పున్ శంభునం దెప్పు; డా

తని ధ్యానింతువు; పూజ సేయుదువు ని
త్యం బాతని; న్నట్టి పా
వనచారిత్రుఁడవైన నీకు శివత
త్త్వం బే నెఱింగించెదన్. ౨౬

చ. విని జనకోక్తి రుద్రముని
వెల్లుముదంబు వహించి భక్తి వం
దన మొనరించి తండ్రిచర
ణంబుల వ్రాలి వినీతిఁ బల్కె "నో
యనఘ! భవత్సహస్థితిని
నబ్బెను నా కిది స్పర్శవేధిచే
నిను మది బంగరంబయి య
హీన రుచిన్ వెలుఁగొందదే భువిన్? ౨౭

గీ. చిలుకపలుకులభాతి నేర్చితిని శ్రుతులు
కఱపకయ నీవు నా కర్థ మెఱుఁగ నగునె?
జ్ఞాననేత్రంబుఁ దెఱచి యీ జగతియందు
నాకుఁ గర్తవ్య మేమొ? తండ్రి! కఱపుము!. ౨౮

క. భువికి మహోత్సవ మిది యని
శివదీక్షోపనయనంబు సేసి సుతునకున్
శివతత్త్వము సాంతంబుగ
శివరూపుఁడు రేణుకుఁడు వచించె ఘనముగన్. ౨౯

## — శివమంత్రగురు మహిమములు —

గీ. వేదముల శ్రేష్ఠ మగు యజుర్వేద; మందు
రుద్ర మది మేలుబంతి; యా రుద్రమందు
మాన్యతరము పంచాక్షరీమంత్ర; మిలను
దాని మించిన దివ్యమంత్రంబు నాస్తి. 30

గీ. కలవు నూటెన్మి దుపనిషత్తులు ధరిత్రి
నందుఁ గల దశోపనిషత్తు లర్శితంబు
లందు మాండూక్య మలరు నభ్యర్శితమయి
పట్టుగొమ్మది వీరశైవంబునకును. 3౧

గీ. వేల్పుమొత్తంబులోఁ దాత పెద్దవేల్పు;
అతనికన్నను మిన్న నారాయణుండు;
అతనికన్న హరుండు మహామహుండు
దీనఁ బేర్గాంచె సుమి! "మహాదేవుఁ"డంచు. 3౨

ఆ. వె. హరునికంటె మేటి గురుఁ; డాతఁడే కదా!
శిష్యు నుద్ధరించుఁ జేసి బోధ;
కాన గురువుకన్న ఘనుఁడు వేఱొక్కండు
కలఁడె? చూడ నేలనలుసెఱఁగుల. 33

క. నెలవంకఁ జిచ్చుకంటినిఁ
గళంబునం దున్న కప్పుఁ గాన్పింపక లో
పల డాఁచి సంచరించెడు
నిల హరుఁడే గురుఁ డనంగ; నిది నిజముసుమీ! 3౪

గీ. దాన బ్రహ్మస్వరూపుఁడై తనరు గురువు
నాశ్రయంబునఁ గైవల్య మందు నరుఁడు
సుళ్లఁ దిరుగాడు పుర్వుఁ గాచుగతి నతఁడె
యోలి జన్మపరంపరనుండి కాచు. ౩౫

క. చలివెలుఁగు వేవెలుంగులు
వెలిగాఁ జీఁకట్లపిండు వెడలనిభంగిన్
వెలలదు కలుషము; వస్తువు
దెలియదు గురుసేవ లేమిఁ దెలియుము దీనిన్. ౩౬

—• శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము •—

గీ. ఆ శివబ్రహ్మ మోయి! స్వయంప్రకాశ;
మదియుఁ జిదచిద్విశిష్టమై యలరుచుండు
నది తలంచును సృష్టింప నల ప్రపంచ
కంబు నిలుపును; గావించుఁ గడకు లయము. ౩౭

గీ. ఆ శివబ్రహ్మమందు మా ర్పావహిల్లుఁ
దద్విమర్శశక్తివికాస ధర్మమునను,
అది మయూరాండరసము న్యాయమునఁ దుదికి
నామరూపాత్మముగఁ బరిణామ మొందు. ౩౮

గీ. ఆ విమర్శనశక్తిచే నగును సుమ్ము!
సూక్ష్మసృష్టి; యిచ్ఛాశక్తి స్థూలదృష్టి;
ఒక్కపరి సృష్టిసేయు; వే ఱొక్క తేప
లయ మొనర్చును జగము లీలగ శివుండు. ౩౯

గీ. పరము శక్తివిశిష్ట మద్వైత మొకటె!
శివుని వగు సూక్ష్మచిదచిత్తులు వికసించి
స్థూలముగ జీవుసం దాగిఁ దోఁచుచుండు
నీ రహస్యంబు నెఱుఁగు మోయీ! కుమార! ౪౦

గీ. ఆ పరబ్రహ్మజీవుల కరయ నాస్తి
భేద మావంతయును; దీని విస్ఫుటముగ
నెఱిఁగి బాలక! మననించి కఱపు మోయి!
ప్రీతిభఁ బ్రజలకుఁ గర్ణాభిరామముగను. ౪౧

అష్టావరణమహిమ.

(గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, భూతి, రుద్రాక్ష, మంత్రములు)

క. విను మష్టావరణంబులు
వినిచెద; నిజపీఠమునకు విచ్చేసిన శి
ష్యనివహామతసంశయముల
ననయంబును దీర్చుచుండు సధికప్రీతిన్.  ౪౨

క. నిరతంబు లింగపూజా
నిరతుండై శిష్యకోటినిం గైకొని యు
ద్ధరణంబు సేయు; నాతఁడె
స్థిరగురుఁ; డవ్వాని మించు దేవుఁడు గలఁడే? ౪౩

క. చరమై యచరంబయి తగఁ
బరికింపం బడెడు నీ ప్రపంచము పుట్టుం
బెరుగు లయించును దేనను
నెఱుంగు మా బ్రహ్మమే మహిన్ లింగ మనన్. ౪౪

చ. గురుకులమందుఁ బుట్టి, నిజ
గోత్రగురుం డుపదేశ మీయ, నా
దరమున దీక్షఁ నొంది, మెయిఁ
దాలిచి ముద్రల నైదు, గెల్చి యం
తరరిచయంబు, సర్వమును
దల్చుచు లింగమయం బటంచు, ను
ద్ధరణ మొనర్ప శిష్యుల య
థావిధిగా నభిషిక్తుఁడై తగన్. ౪౫

క. దండనఖండనములను బ్ర
చండతఁ గావించుకొనుచుఁ జరగురుఁడై భూ
మండలిని సంచరించుచు
నుండును జంగమ మనంగ నోలిఁ దెలియుమీ! ౪౬

ఆ. వె. చరుఁడు నిష్కలుండు; స్థిరగురుం డన్నో
సకలరూపుఁడైన శంకరుండె!
సకలనిష్కలంబు జగతి లింగము; వీని
పాదతీర్థ మఖిలపాపహరము. ౪౭

క. ఏతద్భుక్త్యవశేషము
పూత మగు ప్రసాద; మద్ది భుజియించినచోఁ
జేతికిని వచ్చు మోక్షము;
లాఁతి యుపాయంబు లే దిలాతలమందున్ ౪౮

గీ. నినిచి గురుతీర్థమును శంఖముననుఁ దాని
బత్తిఁ బూజించి సేవించు భక్తజనుల
పెక్కు జన్మలనుండియుఁ బేరుకొన్న
దురితసంఘాత మది యెల్ల విఱిసిపోవు. ౪౯

గీ. అవని లింగంబుఁ దాల్చి యా ప్రసాద
మెవఁడు కన్నుల కద్ది గ్రహించుచుండు
వాని శివమంత్రబీజంబు ఫలిత మగును
ముక్తిసుందరి యాతని పొత్తుఁ జేరు. ౫౦

క. నిగమాగమముల స్తుత్యం
బుగఁ దగు తీర్థప్రసాదముల కెన గలదే?
తగ వానిఁ గొనిన భక్తుల
కగుదురె సరి? బ్రహ్మవిష్ణు లైనను వత్సా! ౫౧

గీ. శ్రౌత, మశ్రౌత మని రెండు రీతులఁ దగు
భస్మధారణవిధము; సోపాధికంబు
శ్రౌత మత్యుత్తమ మది; యశ్రౌతవిధము
జగతి నిరుపాధికంబును సంస్కృతంబు. ౫౨

సీ. అయ్యాది యణిమాదు లగు నష్టసిద్ధుల
మూలంబుగాన విభూతి యందు
శివతత్త్వమును వెల్గచేయుట డెందానఁ
బండితు లద్దాని భసిత మందు

బహుమనోవాక్కాయ పాపబృందంబును
భస్మీకరించుట భస్మ మందు్రి
సంసృతిక్లేశంబు క్షరియింపఁ జేయుట
సద్భక్తు లగువారు క్షార మందు్రి

గీ. చెనఁటి యజ్ఞానభీతి రక్షించుచుంట
రక్ష యందురు దీనిఁ; బేర్వడసె నిట్లు
సార్థకంబుగ నది; దీని జన్మభూమి
వినుము! శ్రిద్ధాళుమతి వయి వినుతు వత్స! ౫౩

సీ. ఆ విభూతి జనించె హరుని సద్యోజాత
ముఖజనందాఖ్య గోముఖ్యమునకు
భసితంబు ప్రిభవించె భవువామదేవాఖ్య
ముఖజభద్రాఖ్య గోముఖ్యమునకు
భస్మంబు పుట్టెఁ గపర్ది యఘోరాఖ్య
ముఖజాతసురభి గోముఖ్యమునకు
క్షారంబుఁ గలిగె నీశ్వరుని తత్పురుషాఖ్య
ముఖజసుశీల గోముఖ్యమునకు

గీ. శర్వు నీశానముఖమున జన్మఁ గొన్న
సుమన యను గోవునకుఁ బుట్టె సుమ్ము రక్ష
పంచకం బిది పరమపావనము వత్స!
దీని యుపయోగవిధముఁ దెల్పెదను వినుము. ౫౪

గీ. అల విభూతిని నిత్యకర్మలను; భసిత
మరయ నైమిత్తికములందు; గురుచరార్చ
ఞార; మెల్ల ప్రాయశ్చిత్తకార్యములను
భస్మమును; ముక్తికై తాల్పవలెను రక్ష. ౧౧

క. కల్పం బనుకల్పం బుప
కల్ప మకల్ప మను భస్మకరణవిధులలోఁ
గల్పవిధం బుత్కృష్టము
తెల్పెద; సనకాదిమునితతి గనెఁ దీనిన్. ౧౬

సీ. మహితసద్యోజాతమంత్రంబుతోడ నం
దాఖ్యధేనువుగోమయంబుఁ దెచ్చి
పరమపావనమైన వామదేవాఖ్యమం
త్రముతోడ మెదిపి పిండములు సేసి
పుణ్యం బొసంగు తత్పురుషమంత్రముతోడ
నెంతయు బత్తితో నెండఁ బెట్టి
కలుషకాననములఁ గాల్చు నఘోరమం
త్రముతోడ వాని దగ్ధం బొనర్చి

గీ. తొడరి యీశానమంత్రంబుతోడ దాని
బిల్వపాత్రంబునం బెట్టి విహితవిధిని
భాల మస్తక హృత్కంఠ బాహులందుఁ
దాల్పుము త్రియంబకాది మంత్రములతోడ. ౧౭

చ. అరదము గాఁగ ధారుణి, ర
థాంగములై తగ సూర్యచంద్రు, లా
సరసిజసూతి సారథిగ,
స్వర్ణగిరీంద్రము విల్లుగా, నహీ
శ్వరుఁ డల నారి గాఁగ, హరి
బాణముగా విరచించి మున్ బురా
సురుల హరింప మింట గుఱిఁ
జూచుచునుండె మహేశ్వరుం డొగిన్. ౫౮

ఆ. వె. హరునిఫాలనేత్ర మందుండి నేలపై
వారిబిందు వొకటి జారె నపుడు;
అది ప్రసిద్ధిఁ గాంచె నవనిపై రుద్రాక్ష
నామ మొంది సార్థనామకముగ. ౫౯

క. శిరసందుఁ గంఠమందుం
గరముల శైవాగమోక్త గతిఁ దాలుచు నే
నరుఁ డవ్వానికి మోక్షము
కరామలక మంచు నీలకంఠుఁడు పలికెన్. ౬౦

గీ. వినుము! పంచాక్షరీమంత్రవిధము వినుతు
వాచకం బందు రుచ్చరింపంగ వెలికి;
నధరసంయోగ మొనరింప నం దుపాంశు;
వదియె మానసికం బందు హృది జపింప;
నందు మానసికంబ సర్వాధికంబు. ౬౧

గీ. ప్రణవపల్లవముం గూర్చి వలయుచోట్ల
జపము సేఁత ఫలించు; న్యాసంబు లేని
జపము మూకము; మరి నిరాసనము సుప్త;
మగును నగ్నంబు పల్లవం బయ్యె నేని. ౬౨

గీ. ప్రణవపరిహీణమైన మంత్రంబు మృతము;
సరవి ఋషిశూన్యమేని భుజంగమంబు;
క్రమముగ గురూపదిష్టంబుగాని యెడల
నదియ నిర్వీర్య మండ్రు కోవిదులు వత్స! ౬౩

మ. శివదీక్షం గొని శుద్ధమైన భువినిఁ
సిద్ధాసనం బుండి శా
స్త్రవిధానంబునఁ జేసి యాచమనముల్
ప్రాగ్దిఙ్ముఖుండై హృదిన్
శివునందుఁ విలయం బొనర్చి జపముం
జేయఁ వలెఁ సుమ్ము! మా
నవు లన్యంబగు రీతులఁ ఫలము దా
నం గల్ల దోయీ! సుతా. ౬౪

ఆ. వె. ధ్యానసహిత మైన యది సగర్భము; ధ్యాన
హీనమే నగర్భ మిది యటండ్రు;
మునివరులు సగర్భమును జపిం; త్రదియె శా
స్త్రీయ; మీ క్రమంబుఁ దెలియవలయు. ౬౫

క. పంచమహాపాతకములఁ
దుంచును; బురుషార్థసిద్ధి దొరయించు; సమ
భ్యంచిత మోక్షపదం బం
దించిన యీ మంత్రమున కిదియె సరి సుమ్మా! ౬౬

క. మును సానందాహ్వయుఁ డగు
మునీంద్రుఁ డీ మంత్రజపము మూలముననె పా
పనిమగ్నులైన పెక్కుర
మనుజులను సముద్ధరించి మాన్యతఁ గాంచెన్ ౬౭

గీ. అల వసిష్ఠుండు వామదేవాఖ్యమునియు
నా మహామంత్రజపమున నందుకొనిరి
నిగ్రహానుగ్రహక్రియానిపుణిమంబు
కలుగ జెయ్యది యా మంత్రబలముచేత? ౬౮

క. ఈ మంత్రాధీనుఁడు శివుఁ;
డీ మంత్రము గురునధీన మిట్లగుట గురు
స్వామిముఖంబుననే నరుఁ
డీ మంత్రము బత్తితోఁ గ్రహింపఁగ వలయున్. ౬౯

సీ. శ్రద్ధతో వినుము! ప్రసాదపంచాక్షరి
వీరగోత్రజులకు విధిహితంబు
అభ్యర్హిత మగు మాయాఖ్యపంచాక్షరి
నందిగోత్రజుల కానందకరము.

స్తుత్య మహత్త్వంబు సూక్ష్మపంచాక్షరి
భృంగిగోత్రజులకుఁ బ్రియకరంబు
శోభనసంపాది స్థూలపంచాక్షరి
వృషభగోత్రజులకు విశ్రుతంబు

గీ. మూలపంచాక్షరీ మంత్రము ధరయందు
స్కందగోత్రజులకుఁ గడు సమ్మతంబు
దీనిమహిమంబు వర్ణింప దేవదేవుఁ
డగు మహాదేవునకుమాత్ర మలవి యగును. ౨౦

క. సరవిం గొని ము న్నష్టా
వరణంబులు వడయవలయు స్వకులంబున కౌ
గురునుండి శైవదీక్షను
బురుషుఁడు సహజోపనయనపూర్వముగఁ దగన్. ౨౧

—॰ లింగాంగసామరస్యమహిమ ॰—

మ. ధరియింపన్ వలె స్థూలదేహమున ని
త్యం బిష్టలింగంబు; సా
దరభావంబున సూక్ష్మ దేహమున ను
ద్యత్ప్రాణలింగంబుఁ; ద
త్పరతం గారణదేహమందుఁ బరిదీ
వ్యద్భావలింగం, బిఁకన్
నెఱి నమ్మూఁటిని మేళవించుకొని పా
ణిస్థేష్టలింగంబునన్. ౨౨

క. తఱిదాఁటక యెల్లప్పుడు
మఱియుచుఁ దా నిష్టలింగమునకుం బూజల్
విరచించువాఁడె నిక్కం
బరయంగా వీరశైవుఁ డనఁగాఁ బరగున్. 23

మ. అనయంబుం గురులింగజంగమసప
ర్యల్ సేయుచున్ వారి పా
వనతీర్థంబుఁ బ్రసాదముం, గొనుచు నీ
ప్రాపంచికంబైన చిం
తనముల్ పాసి స్థిరీకరించుకొని చి
త్తం బందు ముక్కంటిఁ గొ
ల్చు నరశ్రేష్ఠుఁడు వీతపాపుఁ డగుటన్
జ్యోతిస్స్వరూపుం డగున్. 24

క. విను! వత్స! స్థూలదేహం
బున నెవ్వం డిష్టలింగపూజ జరుపునో
జననమరణ పాశంబును
దునిచి శివాద్వైత మతఁడు తోరముగఁ గొనున్. 25

ఆ. వె. ప్రాణలింగ మెవడు పాదుకొల్పి స్వసూక్ష్మ
దేహమందుఁ గొలుచు దివ్యభక్తి
నోర్వఁజాలు నాతఁ డుర్వి శబ్దాదిక
విషయసంచయంపు బెడద లెల్ల. 26

ఆ. వె. భావలింగ మెవఁడు పరమకారణదేహ
మందు నిలిపి కొలుచు నా మహాత్ము
వీడి దాల కేఁగు విషయేచ్ఛ లన్నియు
నాతఁ డొందు శివసుఖానుభూతి. ౭౭

గీ. త్రివిధదేహంబులం దాల్చి త్రివిధలింగ
ముల నెఱింగి క్రమంబు, నే పూరుషుండు
సలుపునో యుపాసనంబు నా జనుఁడె సుమ్ము
భువిని శివయోగి; యతఁ డలిప్తుండు వత్స! ౭౮

క. తనయ! శివజ్ఞానం బను
సునిశిత మగు కత్తిచే శిశుత్వమునందే
జననమరణపాశంబును
దునిచిన నీకేమి కఱపుదును జ్ఞానంబుల్? ౭౯

క. శివభక్తిబీజమును మా
నవహృదయక్షేత్రమందునం జల్లి తగం
జివు రెత్తఁ జూడు మోయీ
ఎవరుల్ నినుఁబోనివార లిల లేరు సుమీ! ౮౦

— • రుద్రమునిశివాచార్యుని పట్టాభిషేకము • —

చ. అని యుపదేశ మిచ్చి మహి
తాత్ముఁడు రేణుకమౌని యంతటన్
మునిఁగెను ధ్యానమందుఁ దగ
మూసి కనుంగవ; నేమి చెప్ప నా

తని మహిమాతిరేకమును?
దత్స్థల మెల్లయుఁ గొల్వుకూటమై
తనరెను; స్వస్వకార్యపర
తంత్రతఁ గింకరు లుండి రచ్చటన్ ౭౧

క. మరులారాధ్యుం డొకచో;
గురుఁ డేకోరాముఁ డొకటఁ; గొమరుగఁ గూర్చుం
డిరి విశ్వారాధ్యగురుం,
డరయఁగ వేఱెడలఁ బండితారాధ్యుండున్. ౭౨

గీ. పాండ్య కేరళ-చోళ నేపాళముఖ్య
దేశపతులు మఱొక్క-చోఁ దీఱియుండి;
రా సభామండపంబు మధ్యంబునందు
నారచిత మయ్యెఁ గనకసింహాసనంబు. ౭౩

క. తనరుచు నుండిరి సింహా
సనమున కిరుక్రేవలందు శైవర్షులు శి
ష్యనివహసహితులు; తెలిచెం
గనుఁగవ రేణుకుఁడు వందిగణజయగీతిన్. ౭౪

ఉ. ఆ సమయాన రుద్రముని
హస్తముఁ గైకొని పట్టసంస్కృతిం
జేసియు గూరుచుండఁగను
జేసి సువర్ణమణీమనోజ్ఞ సిం

హాసనమందు రేణుకుఁడె
యాఁదల రత్నకిరీట మూంచఁగా
సేసలు సల్లి దీవనలు
సేసిరి నల్వురు దేశికోత్తముల్. ౭౫

గీ. తేండ్లు కానుకల బత్తి నర్పించుచుండ
సొంపుగా సింహపీఠిఁ గూర్చున్న రుద్ర
ముని, సుర లొసంగు కానుకలఁ గొనుచు భద్ర
పీఠి వర్తిల్లు శివునట్లు వెలుఁగుచుండె. ౭౬

గీ. వెల్లగొడుగును వ్యజనంబు వెల్లచామ
రంబు నందిధ్వజంబు శంఖంబుఁ బంచ
కలశములుఁ దివ్యగాందోళికయును మరియు
గురుపదంబున కా రాజకోటి యొసఁగె. ౭౭

గీ. రుద్రముని రేణుకాంఘ్రిసరోజములకు
నెరగి సెల వొంది చన నాత్మపురికి నృపులు,
సంతసించుచు నల్వురాచార్యులెడఁదఁ
జనిరి శివనామము స్మరించుకొనుచు నపుడె. ౭౮

—॰ భుజగారణ్య వృత్తాంతము. ॰—

క. కొని రుద్రమునిని రేణుక
ముని తిరుగుచు దేశదేశములఁ దా విచ్చే
సెను భుజగారణ్యమునకు;
వినఁగా నద్దానిచరిత విస్మయ మొదవున్. ౭౯

మ. మును పచ్చో నొక కాలసర్పము ఫణం
బుల్ విప్పి నర్తించి చ
చ్చె నకస్మాత్తుగఁ; గొంత సేపటికి వి
చ్చేసెన్ దయార్ద్రాత్మకుం
డనఘుండై తగు 'కల్లినాథ' శివభ
క్తాగ్రేసరుం డా స్థలం
బున; కద్దానినిఁ గాంచి యాతఁడు మదిం
బొందెం గడుం జాలినిన్. ౯౦

క. శివ! శివ! యీ నిర్దోషియు
శివభూషయు నైన పాము జీవము వాసెన్
బ్రవిమలకరుణామయుఁ డగు
శివు నభ్యర్థింతుఁ బ్రదుకఁ జేయఁగ దీనిన్. ౯౧

మ. అని డెందంబున నిశ్చయించుకొని ని
ద్రాహారముల్ మాని దీ
క్షను గూర్చుండి శివాలయంబునను హ
స్తద్వంద్వముల్ మోడ్చి ప్రా
ర్థనముం జేసెను గల్లినాథుఁ డిటులన్
"దండ్రీ! భవద్భూషణం
బును గాపాడవె! యా మృకండుసుతునిన్
మున్ గాచిన ట్లిత్తఱిన్." ౯౨

గీ. అని భజించుచుఁ గల్లినాథాఖ్యుఁ డచట
దారుణతపం బొనర్ప నద్దాని మెచ్చి
భుజగమున కిచ్చెఁ బ్రాణంబుఁ బురహరుండు
కావున భుజగారణ్యాఖ్యఁ గాంచె నదియు. ౯౩

—. రేణుకుఁడు కల్లినాథు ననుగ్రహించుట .—

ఆ. వె. నాఁటినుండి కల్లినాథుండు శివుని ప్ర
త్యక్ష దర్శనంబు నాత్మఁ గోరి
యుగ్రతపము చేయుచుండె నుల్లంబునఁ
బాదుకొల్పి గాఢభక్తిఁ జిరము. ౯౪

ఉ. ఈగతిఁ గల్లినాథుఁడు మ
హేశ్వరుఁ గొల్చుచునుండ నొక్కనాఁ
డా గగనంబునుండి విన
నయ్యెను "వత్స! ఫలించుఁ గోర్కి; యు
ద్వేగము దక్కియుండుము! మ
దీయవచోగతి రేణుకుం డిగో!
త్వాన్మగతుఁ డౌను; ధన్యుఁడవు
కాఁగల వాతని దర్శనంబునన్". ౯౫

మ. విని యమ్మాటలఁ గల్లినాథమునియుం
బ్రీతిం గడుం బొందుచున్
అనఘాత్ముండగు రేణుకాగమనమున్
స్వాత్మంబునం గోరి, యుం

డ నిరీక్షించుచు నేఁగుదెంచెఁ జిరపు
ణ్యశ్రీఫలంబో? యనం
గను శ్రీరుద్రమునీంద్రుతో నటకు వే
డ్కన్ రేణుకాద్యంబు తాన్. ౯౬

ఉ. ఎవ్వని పాదదర్శనము
మెల్ల యఘంబుల రూపడంచునో!
ఎవ్వని వాక్సుధారసము
యీ భవదాహము నార్పఁజాలునో!
ఎవ్వని దర్శనార్థమయి
యిట్లు దపించెను గల్లినాథుఁ; డా
దవ్వుల నున్న రేణుకఁడు
దగ్గఱి పల్కెను గల్లినాథుతోన్. ౯౭

గీ. ''ఓయి! వైరాగ్యనిధి! మానమూని నీవు
మెలఁగుదువు; సత్త్వమూర్తివై యలరుచుంటి;
పుడమి సంసారపాశబద్ధుఁడవు గావు
పరులవలె; నిది శివుకృపాఫలమె యగును. ౯౮

ఆ. వె. కోరి విషయసుఖముఁ గొందఱు వెతఁగొంద్రు
జనుల, చిచ్చుఁబడ్డ శలభము లన
సుడులఁ బడు పురువుల వడువునఁ గొందఱు
సంభ్రమింత్రు జన్మశతములందు. ౯౯

ఉ. ఈదృశజీవలోకము మ
హిం గురువర్యుఁడె యుద్ధరించు, నా
సాదు ననుగ్రహంబుననె
సత్యము మోక్షపదంబు గల్గు; ని
మ్మేదిని ధర్మదేవత సు
మీ! గురుఁడన్నను; నీవు వాని సం
పాదనఁ జేసికొంటివి; భ
వత్సుకృతం బనవద్య మెన్నఁగన్." ౧౦౦

క. గురుఁ డిట్లు పలికి త్రిమలా
ఖ్యరుజల దొలిసియు; నొసంగి కడఁకఁ దిరిదీక్షల్;
ధరియింపించెఁ ద్రిలింగము
లొరిమఁ ద్రిదేహముల నాతఁ డుత్సవ మొందన్. ౧౦౧

క. వరరుద్రమునీంద్రునిచే
గురూపదేశంబు గొలుప గురుదేవునకున్
ఎరగి యనెఁ గల్లినాథుఁడు
"చరితార్థుఁడ నైతి నాదు జన్మ ఫలించెన్. ౧౦౨

క. ఎట్టిఁగిటి నీ దయ నేకో
త్తరశతమగు స్థలముల మహితరహస్యంబుల్
గురువా! యజాండపిండాం
డ రహస్యంబులను లెస్స నాకుఁ దెలుపుమీ!" ౧౦౩

—• రేణుకాచార్యుఁడు సృష్టితత్త్వము నెఱింగించుట •—

క. అనవుడు రేణుకుఁ డనెఁ "గ
ల్లినాథ! పరశివునియందు లీనమయి విమ
ర్శనశక్తి సూక్ష్మరూపం
బున వర్తిలు; నదియె లోకములు సృజియించున్. ౧౦౪

క. పరశివుఁడు జగత్సృష్టిని
జరిపింపఁగ మొట్టమొదట సాకారుండై
పరమేష్ఠిని సృష్టించెను!
గఱపెను నిర్మించి నిగమకాండ మతనికిన్. ౧౦౫

క. శివునాజ్ఞ నీ చతుర్దశ
భువనముల సృజింప బ్రహ్మ పూనియు, మాయం
దవులుకొని విసుఁగుఁ జెందియు,
శివుని ప్రసాదంబుకొఱకుఁ జేసెఁ దపంబున్. ౧౦౬

గీ. హరుఁడు ప్రత్యక్షుఁడై చతురాననునకుఁ
జెంత నాచార్యగణము సృష్టించిచూప
విధియు నండజపిండజస్వేదజముల
నుద్భిదంబుల సృజియించె నొక్కటొకటి. ౧౦౭

సీ. ఇదియె బ్రహ్మాండ; మియ్యది పృథివ్యప్తేజ
మ్ములయు వాయ్వాకాశములయు వికృతి
శ్రోత్రత్వగక్షులు సారిది జిహ్వాఘ్రాణ
ములుఁ బుట్టె నీ పంచభూతములకు

జ్ఞానేంద్రియము లందురి జనులు వీనిని; వీని
జ్ఞానశక్త్యంశమై కాఁగలు చుండు
నంతఃకరణ; మదియగు వృత్తిభేదంబు
చేత మనోబుద్ధిచిత్తము లని

గీ. తగ నహంకార మనియు; భూతములలోని
దగు క్రియాశక్తిదైన రజోంశమునను
వాక్కరాంఘ్రులు పాయు, వుపస్థ యనఁగఁ
బుట్టె కర్మేంద్రియము లైదు పుత్త్రి! వినుము! ౧౦౭

గీ. ప్రాణ ముదయించెఁ గర్మేంద్రియములనుండి
యది సమానము, వ్యాన, ముదాన, మని య
పానమని ప్రాణమని యయ్యె నైదుగతుల
నీ పదేఁడు సూక్ష్మశరీర మిది యెఱుఁగుము! ౧౦౮

గీ. అం దుపాదానకారణం బార్యజనులు
స్థూలదేహంబునకు మతిస్ఫూర్తిఁ బృథ్వి;
సలిలము నిమిత్తహేతువై యలరుచుండు
నీ రహస్యం బెఱుంగుమోయీ! కుమార! ౧౧౦

సీ. స్థూలదేహమునందుఁ గాగలెడు నస్థిచ
ర్మాదులు వినుము! భూమ్యంశములుగ
వెలయు మజ్జాస్వేదపిత్తమూత్రాదుల
నారయు మోయి! జలాంశములుగఁ

పనరారు చుండిన దాహనిద్రాదుల
నాలింపు మయ్యా! యగ్న్యంశములుగఁ
బరగు శ్లేష్మాదుల వాయ్వంశములుగ రా
గాదుల నరవి నభోంశములుగ

గీ. పాంచభౌతికమయి యేఱుపాటు గొన్న
స్థూలదేహంబె పిండ మందురు బుధాళి,
యీ రహస్యంబు గురునిచే నెఱుఁగు జనులు
బంధనిర్ముక్తిఁ గాని ముక్తిపదముఁ గొంద్రు. ౧౧౧

చ. తమతమ కర్మఁ బట్టి మెయిఁ
దాల్తురు జీవులు; ముందు మాతృగ
ర్భమునను శుక్లశోణితము
వర్తిలు నైక్యము నొంది; బుద్బుదో
పమ వహియించు నద్ది గడ
వంగను సప్తదినంబు; లద్ది ప
క్షమునకుఁ బిండరూప మయి
క్రాలుఁ గ్రమంబుగనాలకింపుమీ! ౧౧౨

గీ. మొదటినెల గట్టిముద్దయై; మూర్ధమును ద్వి
తీయమాసంబునందుఁ; దృతీయమందుఁ
గరచరణములు గానుఁ; గ్రమక్రమతఁ బెరుఁగుఁ;
జెలఁగు నేడవనెలయందు జీవ మొంది. ౧౧౩

క. కాని గర్భదీక్ష జీవుం
డెనిమిదియవమాసమందు నేర్పడఁగ సుల
క్షణములు తొమ్మిదవనెలన్
గాను గర్భమునుండి వెడలఁ గొందలపాటున్. ౧౧౪

క. నవమాసంబులు నిండగ
నవనిం బడి తాఁ దమోవృతాత్ముం డగు; భా
గ్యవశంబున నా జీవుని
శివయోగి వెలుంగుఁ జూపి చేయిడి యెత్తున్. ౧౧౫

ఆ. వె. కల్లినాథ? నీకుఁ గల తత్త్వ మంతయు
విశదపఱచినాఁడ వేయు నేల?
శివుననుగ్రహంబుచేత లింగాంగసా
ఖ్యంబు నీకుఁ గలుగఁగలదు ధ్రువము." ౧౧౬

— రేణుకుఁడు రుద్రమునితో శ్రీగిరి కేఁగుట —

గీ. అనుచు నుపదేశ మొనరించి యచటినుండి
రుద్రమునితోడ రేణుకార్యుండు చనియె
శ్రీగిరికిఁ; గల్లినాథుండు సిద్ధిఁ గాంచి
తద్గురూపదేశమున ముక్తత్వ మొందె. ౧౧౭

గీ. కనకహంసలు నరుణశుకవ్రజంబు
ధవళకోకిలబృందంబుఁ దనరుచుండుఁ
బృథివి దక్షిణకాశి యన్ పేరు గొన్న
పరమపావన మైన శ్రీగిరిని సతము. ౧౧౮

గీ. పులులు సింగంబులును గుహావళిఁ జరించు
వనగజంబులు తటములఁ బరగుచుండు
నెలుఁగుబంటులు దరులందుఁ జెలఁగుచుండు
హరిణములు పర్వులెత్తు శ్రీగిరిని సతము. ౧౧౯

—. రుద్రమునీశ్వరునకు శ్రీగిరివృత్తము దెల్పుట .—

గీ. రేణుకుఁడు రుద్రమునిని దర్శింపఁజేయు
చయ్యయి ప్రదేశములను దదద్రియందు
మల్లికార్జునమహిమంబుఁ బెల్లిదముగఁ
బ్రస్తుతించుచుఁ గ్రమముగాఁ బలికె నిట్లు. ౧౨౦

శా. కైలాసాలయుఁ డైన యీశ్వరుఁడె భ
క్తప్రీణనార్థంబుగా
లీలం దాలిచి మల్లికార్జునమహా
లింగస్వరూపం బిటఁ
గ్రాలు; న్నాతని దివ్యశక్తియె సుమీ!
కస్విందుఁ గావించుచున్
వాలాయంబుగ నుండె నిందు భ్రమరాం
బాదేవినామంబుతోన్. ౧౨౧

శా. ఖ్యాతిం బొంది యనాదిసిద్ధములుగాఁ
గన్పట్టు నా ద్వాదశ
జ్యోతిర్లింగములందు నుత్తమముగా
స్తుత్యంబు శ్రీశైలవి

ద్యోతం బౌ వరలింగ మో తనయ! యిం
దుం బండితారాధ్యుఁ డో
పా్రితస్సార్యనిజాభిధానుఁ డొగి జ
న్మం బందె సూ! తొల్లిటన్. ౧౨౨

క. 'ధర లేదు పునర్జని యీ
గిరిశిఖరముఁ గాంచువారికిని; నిందలి రాల్
పరశివమూర్తులు సుమ్మీ!
పరమమునులు ప్రమథగణమె భావింపు మెదన్. ౧౨౩

మ. తనయా! శ్రీహరిసంప్రతిష్ఠితము ర
త్నస్ఫారలింగం బిదో!
కనుమీ! బ్రహ్మప్రతిష్ఠితస్ఫటికలిం
గం బిల్లిదో! చూడు! కాం
చనలింగం బనలప్రతిష్ఠిత మిదే!
శక్రప్రతిష్ఠాపితం
బనఘం బౌ కలధౌతలింగ మని యీ
యీ లింగముల్ చూపుచున్. ౧౨౪

—• సరోవరమందలి విషమును బరిహరించుట •—

ఆ. వె. కొంత దాలి కరిగి చెంతఁ గన్పడు చున్న
విషసరస్సు నొకటి వేల్రఁ జూపి
"తనయ! చూడు మోయి! చెనటివాని యెడంద
తీరు బొందియున్న దీని విధము. ౧౨౫

ఆ. వె. నికటమునకు వచ్చు నిరపరాధులఁ బాంథ
జనులఁ, బక్షితతిని, జంతుచయముఁ
దనదు విషజలంబుఁ ద్రాగించి జమునింటి
కతిథులుగను సతత మనుపు చుండు. ౧౨౬

గీ. నేను నేఁడే సరస్సును నిర్విషముగ
సలిపి లోకకల్యాణంబు సలుపువాఁడఁ
దనయ! కనుమంచు నా సరస్సును స్పృశింప
నది సుధామయ మై క్రాలె నచ్చెరువుగ. ౧౨౭

క. తరువాతను రుద్రమునీ
శ్వరుని కరతలంబుఁ దండ్రి పట్టుకొనుచుఁ ద
త్వరిసరగుసూఁ జొరఁబడి క
న్పఱచెను కైలాసలోక వైకుంఠంబుల్. ౧౨౮

గీ. కలవు మరియును రుద్రలోకంబు, సత్య
లోకమును, మృత్యులోక మా లోన వాని
విస్తరించుచు గురుఁడు చూపించుకొనుచు
నలఁతిసేపటి కేతెంచె బిలము వెడలి. ౧౨౯

గీ. మరియుఁ బల్కెను బుత్రి! శ్రీగిరిని వెలయు
వృక్షకము లెల్ల నా కల్పవృక్షకములై
ధేనుచయమెల్ల నా కామధేనుచయమె
శిలలు చింతామణులె దరిసింపు మోయి! ౧౩౦

క. కల రిచ్చట శివయోగులు
పలువురు; లభియించు మోక్షపద మీ పాంత
స్థులకు; నల పండితారా
ధ్యులు నెలకొల్పినది పీఠమున్నది యిచటన్. ౧౩౧

— రంభాపురీసింహాసనమున కేఁగుట —

క. అని తెలిపి రేణుకార్యుఁడు
మనఃప్రసాదంబుఁ గాంచి మసలెను సుతుతో
డను శ్రీగిరిఁ గొన్నాళులు
మునింగియుఁ దపస్సమాధి మోదముతోడన్. ౧౩౨

క. ఒకనాఁడు పుత్త్రుఁ గొని రే
ణుకుండు రంభాపురంబునుంగూడిచి యేఁ
గి కని భవిష్యత్కార్యము
సకలంబును దెలిపె నిట్లు స్వతనయుతోడన్. ౧౩౩

గీ. శివునియానతి నేఁటి కీ క్షితికి వచ్చి
యరయఁ బదునాల్గునూర్ల యేండ్లయ్యె నాకు
నిర్వహించితినిఁ దదాజ్ఞ నేను సరిగ;
ననుచు యోగమనస్కుఁడై హరునిఁ దలఁచె. ౧౩౪

గీ. హరుఁడు ప్రత్యక్షుఁడై యంత ననియె నిట్లు
"వత్స! నాయాజ్ఞఁ బాలించి వసుధకు దిగి
యడఁచి నాస్తికమతములఁ బుడమియందు
వీరశైవంబు వెలిఁగించి వెలిఁగినావు. ౧౩౫

శా. నీ పీఠంబును నేల రుద్రముని ని
ర్ణీతుం; డతం డూఢ్చి ధ
ర్మాపాయంబుల, వీరశైవమత మా
ర్యావర్తమం దెల్లెడర్
వ్యాపింపంగను జేయఁజాలును; సమా
ప్తప్రాయ మయ్యెన్ భవ
ద్వ్యాపారం బిలఁ; గుల్యపాకగతలిం
గైక్యంబునన్ ర మ్మికన్." ౧౩౬

ఆ. వె. అని వచించి శంభుఁ డంతర్హితుఁడు గాఁగ
కనులు దెఱచి రుద్రమునినిఁ బిలిచి
తద్విధంబుఁ దెలిపి తడయక దివినుండి
కొలనుపాకఁ జేరె గురువరుండు. ౧౩౭

—• శ్రీ సోమేశ్వరలింగమున శ్రీ రేణుకుఁ డైక్యమగుట. •—

మ. అల సోమేశ్వరలింగసన్నిధి నొగిన్
హస్తద్వయిన్ మోడ్చి మా
నిలలాముం డగు రేణుకార్యుఁ డచటన్
నిల్చుండి యేవంవిధిన్
సలిపెన్ స్తోత్రము 'సోమశేఖర! దయా
సాంద్రా! మహాదేవ! వ
త్సలతాపూర! మృకండుపుత్త్రికసము
ద్ధారా! ననుం గావుమీ! ౧౩౮

క. జనకా! నీయానతిఁ గొని
చనుదెంచితి నీదు దివ్యశాసనమును బా
లన మొనరించితి, నిఁక నను
నినుఁ జేరఁగనిమ్ము! నిన్ను నిచ్చలుఁ గొలుతున్. ౧౩౯

మ. తలపై గంగ విరాజిలన్, జడల మ
ధ్యన్ గ్రాల జైవాతృకుం,
డలరం బార్వతి వామభాగమున, బ్ర
హ్మాదుల్ పురోభూమిఁ జే
తులు జోడించియుఁ గొల్వఁగా, జయజయో
ద్ఘోషంబు నిండంగ ది
క్కుల శోభిల్లెడు నీ పదంబులకడం
గూర్చుండఁ గాంక్షించెదన్. ౧౪౦

ఆ. వె. దేవదేవ! నన్నుఁ దావకసన్నిధిఁ
జేర్చుకొను' మటంచుఁ జేయ మనవి
చూచుచుండ నంత సోమేశలింగంబు
నుండి యొక్క జ్యోతి యుద్గమించె. ౧౪౧

ఆ. వె. కాంచుచున్న భక్తకాండంబు లక్కజం
పడుచు నెదుటఁ దొట్రుపడుచు నిలువ
శ్రీమహేశ్వరుఁడు రేణుకాచార్యుని
స్వాంగకమున నైక్యమందఁ జేసె. ౧౪౨



శ్రీ రేణుకాచార్యులు సోమేశ్వరలింగమున

దివ్యదేహముతో నైక్య మగుట

క. సుమవృష్టి గురిసె, దివి లా
స్యము సేసిరి దివ్యకాంత, లా నాకమునన్
అమరావళి జయవెట్టెను,
బ్రమోదపడె యోగివితతి స్వాంతములందున్. ౧౪౩

క. ఉదయించు నిచ్చ భాస్కరుఁ
డుదయాద్రిని, బశ్చిమాద్రి నొరుగు; నటులు గా
కుదయాస్తమయము లొందెను
గద గురుభాస్కరుఁడు రేణుకబుధుం డొకటన్. ౧౪౪

మ. శివతత్త్వామృతపూరమున్ వసుధ ని
శ్శేషంబుఁ బొలించి, శా
స్త్రవిధానంబున వీరశైవమతమున్
స్థాపించి, దజ్మండలో
త్సవముం జేసిన మానిరేణుకుఁడు త
త్కైలాసముం జేరి, యా
శివు సాన్నిధ్యముఁ బొంది, తత్సభఁ బ్రవే
శించెం బ్రహృష్టాత్ముఁడై ౧౪౫

— ఫలశ్రుతిమంగళము —

ఆ. గీ. పరమపావన మీ జగద్గురుని రేణు
కార్యునిచరిత్రఁ జదివిన, నాలకించి
యున్న, వ్రాసిన, వ్రాయించియున్న హరుఁడు
కలుషము లడంచి మోక్షంబు గలుగఁజేయు. ౧౪౬

చ. అల గురువర్య రేణుకుని యద్భుత
గాథల విన్న మూర్ఖుఁ డి
య్యల బుధుఁ డౌ; దరిద్రుఁడు మహీ
పతి యౌ; ధనధాన్యసంపదల్
కలుగును; సిద్ధి యౌ సకలకార్య
ములందు; యశంబు విద్యయున్
బొలుచుచు నుత్తరోత్తరముఁ బొందు
శుభంబులు శంభుసత్కృపన్. ౧౪౭

క. చల్లని చూపులఁ జూచుచు
ముల్లోకంబులకు భద్రములఁ గూర్చు చుమా
వల్లభుఁడు భక్తసంతతి
యుల్లంబులఁ దాండవించుచుండుం గాతన్. ౧౪౮

పంచమాశ్వాసము సమాప్తము.

సంపూర్ణము.

---

# సాధుపత్త్రము

| పుట | బంతి | అసాధువు | సాధువు |
| --- | --- | --- | --- |
| ౪౮ | ౭ | తద్వారి | దద్వారి |
| ౫౩ | ౧౦ | సుండ్రో | సుంద్రో |
| ౬౬ | ౧౨ | మెతు | మెత్తు |
| ౮౧ | ౬ | మోక్షో | యుక్తత మోక్షో |
| ౮౪ | ౮ | తివు | తీవు |
| ౯౦ | ౫ | శంకరుఁడ | శంకరుండ |
| ౧౦౭ | ౧౨ | తెనె | తేనె |
| ౧౧౩ | ౪ | చంపక | చంపేక |
| ౧౩౮ | ౧౨ | పురస్థలిన | పురఃస్థలిన |
| ౧౪౯ | ౧౨ | నమ్యోనయ్య | యమ్యోనయ్య |
| ౧౭౩ | ౧౨ | స్వాదులగు | స్యాదులగు |
| ౧౭౯ | ౧౯ | స్థూలదృష్టి | స్థూలసృష్టి |
| ౧౮౩ | ౧౬ | ముఖజనుశీల | ముఖజనుశీల |
| ౨౦౨ | ౧౮ | డాలి కరిగి | డాల కరిగి |
| ౨౦౩ | ౫ | నేఁడే | నేఁడీ |

ఇంకను వ్యథ, వీథి మున్నగువారిని థకారము పొట్ట లోని చుక్కలును; లాఁతి, చెనఁటి, కుఁడు మున్నగువాని లోని అరసున్నలును; పుత్త్ర, పత్త్ర మున్నగు వానిలోని తా వత్తులును సరిగ సంటకయో ఎగిరిపోవుటయో జరిగినది. సరి చేసికొనవలెను.

# గ్రంథరత్నములు

| | |
|---|---|
| వీరశైవ వివాహ విధి | ౧-౦-౦ |
| లింగధారణ విధి | ౦-౬-౦ |
| సంక్షిప్త శివపూజా విధి | ౦-౨-౦ |
| శ్రీకరభాష్యం (సంస్కృతం) | ౦-౧౨-౦ |
| సిద్ధాంత శిఖామణి ,, | ౦-౪-౦ |
| రేణుక విజయము (పద్యపురాణము) | ౧-౦-౦ |
| వీరశైవరత్నము (తెలుఁగు) | ౦-౫-౦ |
| వీరశైవ మహాత్ములు ,, | ౦-౪-౦ |
| గోత్రసూత్ర పటము | ౦-౨-౦ |
| లింగధారణ సిద్ధాంతము | ౦-౨-౦ |
| మఠములు మందిరములు | ౦-౨-౦ |
| రేణుకాచార్య చరిత్ర (వచనము) | ౦-౧-౦ |
| काशीपीठाचें प्राचीनत्व | ०-२-० |
| Mutts & Mandirs | 0-2-0 |
| "Lingayat for Veerashaiva" | 0-1-0 |

కొనువారే పోస్టుఖర్చులను భరింపవలెను.

ఒక రూపాయికి తక్కువ వెల గల వీ. పీ. పంపఁబడదు.

శివధర్మ గ్రంథమాల,
౪౦౬౫ - సజ్జన్‌లాల్ వీధి,
సికింద్రాబాదు, దక్కన్.

"ఆచార్యదేవో భవ"

"న గురోరధికం"